విశ్వసాహిత్యమాల.— 25.

# బీళ్లు దున్నేరు.

Bhilludunnesu.

మైకేల్ షొలొకోవ్.

అనువాదం:

మహీధర కృష్ణమోహన్‌రావు.

Mahedara krishnamohanRao

1942 సెప్టెంబరు.

విశ్వసాహిత్యమాల.

ముంగండ

(వయా) అంబాజీపేట, తూర్పుగోదావరి.

పాడ్‌న్యాటయూ ట్సెలీనా 1932.

వర్జిన్ సోయిల్ అప్‌టర్న్‌డ్ 1935.

బీళ్ళు దున్నేరు 1942.

అవంతీ ప్రెస్.

ముంగండ.

టైటిల్ పేజీ, 1, 33 ఫారములు—

యం. యస్. ప్రింటింగు వర్క్సు, మారుటేరు.

480 ప్రతులు మాత్రమే.

వెల రు 1–4–0

# సం వి జ్ఞ ప్తి. —

మళ్ళి చాలాకాలానికి ఆంధ్రమహాశయుల్ని కలుసుకో గలిగినందుకు సంతోషంగా వుంది. రెండుదీర్ఘ వత్సరాలు జైలులో గడపవలసి వచ్చింది. ప్రభుత్వ నిర్బంధానికిగురియై, మారిపవి. పెట్టుబడి. సోషలిజం; చారిత్రికం-సిద్ధాంతం.- అనేరెండు పుస్తకాలు ప్రచురించినందుకుగానూ నాకొసంవత్స రమూ, ప్రింటరు కృష్ణమోహన్‌కు ఒకసంవత్సరమూ కఠిన శిక్ష ప్రసాదించడమేగాక 'అవంతీప్రెస్'ను 1942 ఏప్రిలు 11 తేదీని మద్రాసు ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నారు. దానితో విశ్వసాహిత్యమాల అప్పటికి నిలిచిపోయింది. 1942 జూలై నెల ప్రారంభములో కృష్ణమోహన్, నెలాఖరుననేనూ విడు దలపొందినాము. అప్పటినుంచీ తిరిగి గ్రంధ ప్రకటనకై యత్నిస్తూన్నా. నేటికి, సుప్రసిద్ధ రచయితయగు షొలోకోవ్ పుస్తకం "టీ ఖ్ఖ దు న్నే రు" పాఠక మహాశయులకు అందించగల్గేము. త్వరలోనే యింకా అనేకంగా పుస్తకాలను ప్రకటించడానికి యత్నిస్తున్నాము.

యుద్ధంవల్ల కాగితం కరువు వచ్చింది. కాగితంధర విపరీతంగా హెచ్చడమేగాక అది దొరకడమే దుర్లభంగా వుంది. అందుచేత 100 పుటలు 8 అణాలకు యివ్వ నిశ్చయిం చేము. "టీ ఖ్ఖ దు న్నే రు" ప్రారంభించి 3 సంవత్సరాలైంది కాని నేను జైలుకు పోవడంవల్లనూ, కాగితంధర పెరగడం వల్లనూ యీపుస్తకం పూర్తికానేలేదు. ప్రస్తుత పరిస్థితిలో పూర్తిఅయిన పదునారు ప్రకరణాల గ్రంథాన్ని (264 పుటలు)

మొదటి భాగంగా వెలువర్చినాము. త్వరలోనే రెండోభాగం కూడా (450 పుటలు) ప్రచురించగలము. ధనాభావంవల్ల యీగ్రంధం 480 కాపీలుమాత్రం వేసేము. ఈకాపీలు అయిపోయేటంతట్లో రెండోభాగం ప్రారంభిస్తాం. అందుచే పాఠకుల ఆదరాభిమానాలు యిదివరకుకంటే అధికంగా ఆశిస్తున్నాము. లేనిచో గ్రంధప్రకటన కేవలం అసంభవమే అయిపోతుంది.

ఒక్కమాట యీసంవత్సరంలో, 'అవంతీప్రెస్'ను ప్రభుత్వం తిరిగి 22—9—1942 తేదీని యిచ్చివేసింది. 'విశ్వసాహిత్యమాల' పుస్తకాలు యిటీవల అవంతీప్రెస్లో ముద్రిస్తున్నాము. ఈరెండిటికీ వ్యాపార రీత్యానేగాని మరే సంబంధమూ లేకున్నా. ప్రభుత్వ రహాషిను ప్రెస్మీదా. ప్రింటర్మీదా కూడా ప్రసరించి చాలా అలజడికి కారణమైంది. ప్రెస్ తిరిగి యిచ్చివేయడంలో ప్రజల ఆందోళనను ప్రభుత్వము గుర్తించిందన్నమాట.

'విశ్వసాహిత్యమాల' ద్వారా యితోధిక సేవ ఆంధ్రవాఙ్మయానికీ, ప్రజాసామాన్యానికీ చేయడమే మా పరమావధి మాకర్తవ్యాన్ని చక్కగా నిర్వహించగలగాలంటే. ఆంధ్రసోదరుల సహాయసానుభూతులు ఎంతో అవసరమని విన్నవిస్తున్నాము.

సెప్టెంబరు 1942
ముంగండ.

మహీధర జగన్మోహన్‌రావు.
సంపాదకుడు.

# పాత్రలు.

అటమంచుకోవ్, వాసిలీ— గ్రిమాచి సమిష్టి వ్యవసాయక్షేత్రంలోచేరిన ఒకకోసక్కు. కానిదానిని భిగ్నంచేయుటకు రహస్యంగా ప్రియత్నం చేసేవాళ్లలో ఒకడు.

డానిక్, గ్రిగర్, మెట్విచ్— స్వంతంగా వ్యవసాయంచేసుకొనే ఒక కోసక్కురైతు. సమిష్టివ్యవసాయక్షేత్రం అంటే కిట్టదు.

వెటలశ్చికోవ్, ఇవాన్.—సమిష్టివ్యవసాయక్షేత్రంలోపరిపని చేస్తూ, దాని నాశనం కోసం ప్రియత్నంచేసే ఒక కోసక్కు.

బెష్లిక్కుబ్నోవ్, అకిమ్.—సమిష్టి వ్యవసాయక్షేత్రంలోచేరిన ఒక కోసక్కు. పెద్ద బెష్లిక్కుబ్నోవ్ అంటారు.

" " :— బెష్లిక్కుబ్నోవ్ అకిమ్ కొడుకు. ఇతడు కూడా సమిష్టివ్యవసాయక్షేత్రంలో సభ్యుడుగా చేరేడు. తండ్రికి ఇతనికి తేడాతెలియడం కోసం ఇతనిని చిన్న బెష్లిక్కుబ్నోవ్ అని పిలుస్తారు.

బొరోడిన్, టిటాక్ .—భాగ్యవంతుడైన కోసక్కు. (వీరినే "కులకు" అంటారు) పూర్వం విప్లవం రోజుల్లో 'రెడార్మీ'లో పనిచేసేడు.

బోర్షేవ్ టిమోఫీ.— ఒక బీదకోసక్కు, కాని 'కులకు'లను సమర్థిస్తూంటాడు.

దెమసోష్కిన్. ఫోల్.—భాగ్యవంతుడైన కోసక్కు.
" టిమోఫీ.— ఫ్రోల్ కొడుకు.
దేవిదోవ్ సీమియన్.—లోహపు పనివాడు. కమ్యూనిష్టు. సమిష్టి వ్యవసాయక్షేత్రాలు ఏర్పాటుచేయుటకు సోవియట్ ప్రభుత్వంచే నియమింపబడిన 25000 మంది లో ఒకడు. గ్రిమాచీ సమిష్టి వ్యవసాయక్షేత్రానికి అధ్యక్షుడు.
దైమిద్.— ఒక బీదకోసక్కు. సాధారణంగా మాట్లాడడు. అందుచేత ఇతనిని 'మూగి' అంటూంటారు.
దబ్సెవ్, అగాఫన్.— సమిష్టి వ్యవసాయక్షేత్రంలో సభ్యుడు కోసక్కు. దాల్లో పనిచేసే మూడవకూలీదళానికినాయకుడు.
గయేవ్.—ఒక 'కులకు' పెద్దకుటుంబంగలవాడు.
ఇగ్నటియో నోక్. మైకేల్ (మిషాక్) సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిచేసే కోసక్కు.
" ఉల్యానా — మైకేల్ తల్లి.
కోండ్రాషోవ్. ఓసిప్.—యుక్రేనియనుకూలీ. పల్లెటూళ్లలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను గురించి ప్రచారం చేయుటకు పంపబడిన ప్రచారదళానికి నాయకుడు.
కోర్చిన్స్కి.— జిల్లా కమ్యూనిష్టుపార్టీ కార్యదర్శి.
రెష్టినోవ్ సీమియన్.—'కులకు' భాగ్యవంతుడు. బహువృద్ధు.
లుబిష్కిన్. పావెల్— సమిష్టి వ్యవసాయక్షేత్రంలో సభ్యుడుగా చేరిన కోసక్కు. మొదటికూలీదళనాయకుడు.

లోసేవ్, అర్కాడీ (అర్కాషా) సమిష్టి వ్యవసాయక్షేత్రం లోచేరిన కోసక్కు. ప్రతివస్తువు వేరంచేసి విసుగు పుట్టించే స్వభావం అతనిది.

లెబెద్‌స్కీ, వాట్‌స్లావ్, అగస్తోవిచ్.— పూర్వం జారు ప్రభుత్వ సైన్యాల్లో 'లెఫ్టినెంటు'గా పనిచేసేను ఇప్పుడు సోవియటు ప్రభుత్వాన్ని కూలదోయడానికి ప్రయత్నించే రహస్య సంఘములో చేరి ప్రజాసామాన్యములో కుట్రలు చేస్తూంటాడు

మైదన్నికోవ్. కోన్‌డ్రాట్ — ఒక మధ్యతరగతి కోసక్కు సమిష్టి వ్యవసాయక్షేత్రంలో సభ్యుడు.

నగుల్నోవ్ మాకర్:—గ్రామపార్టీ కమ్యూనిస్టు కార్యదర్శి.

నగుల్నోవా లుకేరియా:— మాకర్ భార్య.

నైదియనోవ్ ఇవాన్:— ఒక కమ్యూనిస్టు యువకుడు. కొంద్రాటోవ్ 'పరిచారక దళం'లో సభ్యుడు.

ఆస్ట్రోవ్నోవ్. యాకోవ్. లూకుచ్;— కోసక్కు. భాగ్యవంతు డనేచెప్పవచ్చు. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరి మేనేజరు అయి, దానిని నాశనంచేయడానికి కుట్రలు పన్నుతూంటాడు.

పొలొవిట్సేవ్. అలెగ్జాండర్. అనిసిమోవిచ్:— జార్ సైన్యాల్లో 'కెప్టెన్' ఆస్ట్రోవ్‌నోవ్‌తో కలిసి పని చేసేడు ఇప్పుడు సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్రలు పన్నుతూంటాడు.

సొయూనోవ్నా, మేరియా:— అంద్రీ రజ్మెత్నోవు భార్య.

రజ్మెత్నోవు, అంద్రీ:— ఒకకమ్యూనిస్టు గ్రామ సోవియటుకు అధ్యక్షుడు.

షూకర్:— సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పని చేసే ఒక ముసలివాడు. ప్రగల్భాలు చెబుతూంటాడు.

ఉషాకోవ్, దెమ్కా:— ఒకకోసక్కు. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో సభ్యుడు. రెండవ కూలీవర్గానికి నాయకుడు.

షాలీ, ఇప్పోలిట్:— గ్రామంలో కమ్మరి.



# ఒకటో ప్రకరణం.

## ఆగంతకుడు.

అది 1930వ సంవత్సరం; జనవరి నెల. ఒకరోజు సాయంకాలం గుఱ్ఱపురౌతు ఒకడు 'స్టెప్పి' (పచ్చికబయలు) నుంచి గ్రిమాచీలాగ్ కు పోవు బాట వెంబడే వస్తూన్నాడు. ఆవూరి పొలిమేరలో ప్రవహిస్తూన్న ఏటివారి గుఱ్ఱాన్ని ఆపి, క్రిందికి ఉరికేడు. గుఱ్ఱం రొమ్మంతా నిరంతరాయంగా కురుస్తూన్న మంచుతో నిండి వుంది. బాటకి రెండువైపులానున్న చెట్లగుబురుల్లోంచి చంద్రుడు తొంగిచూస్తూన్నాడు. అప్పటికప్పుడే బాగా రాత్రిపడడం చేత ఆప్రాంతమంతా నిర్మానుష్యంగా వుంది. ఏటి ఆవతల ఎక్కడో కుక్క మొరిగినధ్వని వినిపించింది. దూరాన్నుంచి వెలుతురు మినుకు మినుకుమని కనిపిస్తూంది. రౌతు నెమ్మదిగా ఊపిరితీసుకుని, సావధానంగా చేతి 'గ్లోవు' ఊడతీసి, సిగరెట్టు వెలిగించేడు. జీను సరిచేసి, జీనుకింద చెయ్యిపెట్టి చెమటలుకక్కుతూన్న గుఱ్ఱపు వీపు ఆవిరికక్కుతూంటే చూసి తృప్తిచెందేడు. ఒక్కమాటునిదానించి గభాలున గుఱ్ఱముమీదికి ఉరికి ప్రవాహములోనికి నడిపించేడు. గుఱ్ఱపు డెక్కలు నీళ్ళలోని గులకరాళ్ళమీద పడి గలగల ధ్వని చేస్తూన్నాయి. ప్రవాహంలో నడుస్తూ నీళ్ళు తాగడానికి గుఱ్ఱం

మెడ వంచింది. కాని రౌతు కళ్ళెం బిగలాగి తరట పెట్టడంచేత, పక్కలుఎగరేస్తూ నెమ్మదిగా ఆవలిఒడ్డుఎక్కసాగింది.

సమీపంలో మనుష్యుల అలికిడి, స్లెడ్జి బండి లాగుతూన్న చప్పుడు విని, రౌతు కళ్ళెం బిగలాగేడు. గుఱ్ఱం చెవులు రిక్కించి ధ్వని వినబడిన వైపు చూసింది. రౌతు రొమ్ముమీది వెండిపొదగిన పతకాలు, జీను ముందరిభాగపు గుబ్బ, చంద్రికాంతిలో తళ తళ లాడేయి. కంగారుపడుతూ, కళ్ళెంవదిలేసి కోసక్ టోపీ ముఖం మీదికి లాక్కొని, గుఱ్ఱాన్ని పరుగెత్తించేడు. ఎదురుపడ్డమనుష్యులు దాటిన తరువాత గుఱ్ఱపు వేగాన్ని తగ్గించేడు; కాని, టోపీని మాత్రం తియ్యలేదు.

గ్రామంలోకి వచ్చినతరువాత దోవలో ఎదురుపడిన ఒక స్త్రీని పిలిచేడు.

"యాకోవ్ ఆస్త్రోవ్నోవ్ ఇల్లు ఎక్కడ?"

"అంటే... యాకోవ్ లూకిచ్ కాదూ?"

"అవును... అతనే."

"అదిగో! ఆ కనిపిస్తూన్న పూరిల్లు చూసేరూ ... ఆ చెట్టుకి ఎదురుగా; అదే అతని యిల్లు."

"సరే, తెలిసింది. సెలవు."

విశాలంగావున్న ఆపూరింటియెదుట గుఱ్ఱము దిగి, కళ్ళెం చేతపుచ్చుకొని నడిపిస్తూ ఆవరణలోపలికి వెళ్ళేడు. చేతిలోనున్న కొరడాతో తలుపుమీదచప్పుడుచేస్తూ,

## ఆగంతకుడు.

"యాకోవ్ లూకిచ్! తలుపు తీస్తావా?" అని కేక వేసేడు.

నెత్తిమీద టోపీ లేకుండా, కోటుఒకటి పైన వేసుకొని ఆ ఇంటి యజమాని తలుపుతీసి గుమ్మములో నిలబడి, కొంత సేపు ఆ కొత్తగావచ్చినవ్యక్తిని నిదానించిచూసి గడపదాటివచ్చేడు.

"ఎవరు మీరు!"

"లూకిచ్! ఇంకాగుర్తుపట్టలేదూ నన్ను? ఈరాత్రికి ఇక్కడ ఆగుతాను. గుర్రాన్ని కట్టడానికి మంచిస్థలం ఏదేనా వుందా?"

"కామ్రేడ్! నేను మిమ్మల్ని గుర్తు పట్టలేకుండా వున్నాను. జిల్లా కమిటీనుంచి వచ్చేరనుకుంటాను. అవునా?... లేక వ్యవసాయ డిపార్టుమెంటు తాలూకా? మిమ్మల్ని ఎక్కడనో చూసిన జ్ఞాపకంవుంది."

ఆ ఆగంతకుడు చిరునవ్వునవ్వుతూ ముఖమునుకప్పియున్న కోసకు టోపీ తీసివేసేడు.

"పాలోవిట్స్కీ ను ఎరుగుదువా?"

ఆమాటవినగానే యాకోవ్ లూకిచ్ నిర్ఘాంత పోయేడు. ఎవరేనా వున్నారేమోనని కంగారుతో నలుదిక్కులా చూసేడు.

"చిత్తం. తమరా! ఎక్కడినుంచి దయచేసేరు? గుర్రాన్ని కట్టడానికి శుభ్రమైన సాల వుంది లెండి. ఇప్పుడే అక్కడ కట్టేయిస్తాను. తమరు ఎంత సేపటినుంచి ...." అన్నాడు నెమ్మదిగా.

"ఇప్పుడే. గట్టిగా మాట్లాడకు. మీయింట్లో కొత్తవాళ్ళు ఎవరేనా వున్నారా?"

చీల్చుదున్నేరు.

ఆ రౌతు చేతులోని కళ్ళెం లూకుచ్ చేతికిచ్చేడు. మెడ జూపి తల కొంచెం పైకియెత్తి, వెనక కాళ్ళు నెమ్మదిగా ఈడుస్తూ ఆ గుఱ్ఱం లూకుచ్ వెంబడే వెళ్ళింది. తబేలాలో ఇంకో గుఱ్ఱం వుండడం పసికట్టి, సకిలించింది. లూకుచ్ కళ్ళెం తీసేడు. గుఱ్ఱం మేత ప్రారంభించింది.

"టంగులు కొంచెం వొదులుచేసేను. గుఱ్ఱం చల్లబడ్డ తరువాత తియ్యొచ్చు జీను." అంటూ యాకోవ్ లూకుచ్ గుఱ్ఱం నడ్డిమీద ఒకగుద్ద కప్పేడు. గుఱ్ఱం చాలా అలిసియుండడం చూసి, అతడు తన అతిధి చాలా దూరాన్నుంచి వచ్చియుంటాడని ఊహించేడు.

"యాకోవ్ లూకుచ్! పాడి,పంట, బాగావున్నాయా?"

"ఆ-వాటికి లోటులేదు. కొంతసేపయినతరువాత నీళ్ళు పెట్టి గడ్డి వేస్తాను: ఇప్పుడప్పుడే తొందరలేదు. లోపలికి రండి. ... ఇప్పుడు మిమ్మల్ని ఏమనిపిలవాలో నాకు తెలియకుండా వుంది. పూర్వపు పేర్లతో పిలవడానికి కొత్తగా వుంది ఎందుచేతనో."

"పోలొవ్-చిన్నప్పుడు మా తల్లి తండ్రులు పెట్టిన పేరుతో పిలు. ఆ పేరు మరిచిపోలేదనుకుంటాను. ఏం-మరిచిపోయేవా?" అతిధి తబేలావదిలి బయటికి వచ్చేడు. లూకుచ్ నెమ్మదిగా అతని వెనక బయలుదేరేడు.

"ఎల్లా మరిచిపోగలను! మనం ఇద్దరంకలిసి జర్మను సైన్యాల్ని చావకొట్టి తరిమేవాళ్ళం. ఆ ఆఖరు యుద్ధంలో మనం...... అలెగ్జాండర్! అప్పుడప్పుడు మీరు జ్ఞాపకం వచ్చేవారు. నోవో

రోసిస్కా లో మనం విడిపోయిన తరువాత మళ్ళీ మీ సంగతే తెలియలేదు. కోసక్కులతో కలిసి మీరు టర్కీకి వెళ్ళిపోయి వుంటారనుకున్నాను."

ఇద్దరూ మాట్లాడుకుంటూ వంటయింట్లోకి వెళ్ళేరు. ఆ కొత్తగావచ్చినవ్యక్తి నెత్తిమీది టోపీతీసి, క్రౌర్యాన్ని వెలిగక్కే ఆచిన్న నీలి కళ్ళతో గది నాలుగుమూలలా కలయచూసేడు. అక్కడే బల్లమీద కూర్చునియున్న ఇంటి యజమానురాలిని చూసి కుశలప్రశ్న వేసేడు. ఆమె ముక్తసరిగా సమాధానం చెప్పి, 'కొత్తగా వచ్చిన ఈయన ఎవరు! నేను అతనిని ఎట్లు గౌరవించాలి?' అని అడుగుతూన్నట్లు ల్యూకుచ్ కళ్ళలోకి చూసింది.

"వెళ్ళి భోజనం సిద్ధంచెయ్యి" అని భార్యకు ఆజ్ఞాపించి, అతిథితోకూడ విశాలంగా అందంగా వున్న ఒక గదిలోనికి వెళ్ళి, ఒక బల్లమీద కూర్చున్నాడు.

ఆ అతిథి భోజనంచేస్తూ వాతావరణస్థితినిగురించి, పూర్వ స్నేహితుల్ని గురించి మాట్లాడేడు. భోజనం ముగించినచ్చి, అతడు ఒకమూల ధూళితో వేళ్ళాడుతూన్న సిలువ దగ్గిరికి వెళ్ళి, మోకరించి ప్రార్థించేడు. "ల్యూకుచ్, నాకోసం చాలా శ్రమపడ్డావు. ఇప్పుడు నీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి."

ల్యూకుచ్ తన భార్యకేసి వెళ్ళిపొమ్మన్నట్లుగా చూసేడు. ఆమె త్వరగా బల్ల శుభ్రపరచి వెళ్ళిపోయింది.

## రెండో ప్రకరణము.

### డేవిడోవ్.

పార్టీ డిస్ట్రిక్టుకమిటీ సెక్రిటరీ కొంచెం మందకొడిమనిషి. ఆఫీసు గదిలో బల్లముందు కూర్చుని, పక్కన నిలబడియున్న డేవిడోవ్‌ను కొంత సేపు నిదానించిచూసి, అతడు తెచ్చిన డాక్యుమెంట్లు తిరగెయ్యడం ప్రారంభించేడు.

బయట గాలి హోరుమని వీస్తూంది. ఒక గుంజకు కట్టబడ్డ గుర్రము నడ్డిమీద పిట్ట ఒకటి వాలి పాడుతూంది. గాలివిసురుకి ఎగరకొట్టబడి తిరిగివచ్చి గుఱ్ఱము మీద వాలి, విజయ గర్వంతో మెడ యెత్తి నలువైపులా చూసింది. ఆకాశంమీద మేఘాలు వేగంగా పరుగెత్తుతూన్నాయి. కిందకూడ ఎండ, నీడ ఒకదానినొకటి తరుముకొడుతూన్నాయి. కిటికీలోనుంచి చూస్తే, దూరంగా 'డాన్' నది, దానివెనుక అరణ్యము, ఆవెనుక మంచుతో కప్పబడి తెల్ల తెల్లగా కనిపిస్తూన్న పర్వతాలు...ప్రకృతి బహు సుందరంగా వుంది.

"అయితే జబ్బుచెయ్యడంచేత ఇంతవరకు మీరు రాస్టోవ్‌లోనే వున్నారన్నమాట. సరే...ఈ ప్రాంతాల్లో సమిష్టి వ్యవసాయక్షేత్రనిర్మాణావశ్యకతను గురించి ప్రచారం చెయ్యడాని

కని పంపబడిన 8 మంది మూడురోజుల కిందట వచ్చేరు. మేమంతా సమావేశం అయేము. సమిష్టివ్యవసాయ క్షేత్రాల ప్రతినిధులంతా వారిని కలుసుకొని మాట్లాడేరు." సెక్రెటరీ ఏదో ఆలోచిస్తూ క్రింది పెదిమె కొరికేడు. "ఇక్కడిపరిస్థితులన్నీ చాలా విషమంగా వున్నాయి. ఈజిల్లాలో 14.8% మాత్రం సమిష్టివ్యవసాయ క్షేత్రాలలో చేర్చడం అయింది. వీటిలో చాలభాగం సమిష్టిగా వ్యవసాయం చేసుకొనడానికి ఏర్పరచబడ్డ చిన్న చిన్న సంఘాలు మాత్రమే. కులకులు ఎవ్వరూ ఈ దరికేనా రావడంలేదు. పన్ను కూడా చెల్లించడం లేదు. ఇటువంటి సమయంలో మనకి ఎంత మందివున్నా అవసరమే. 43 మంది ప్రచారకుల్ని పంపమని వ్రాస్తే 8మందిని మాత్రం పంపించి వారితోనే సరిపుచ్చుకోమన్నారు." ఆమిడిగుడ్లతో మళ్ళీ దేవిడోవ్ కేసి చూసేడు.

"కామ్రేడ్! మీరు తాళాలు బాగుచేస్తూంటారన్న మాట. బాగానేవుంది. అయితే—మీరు ఫ్యూటిలోవ్ కర్మాగారంలో ఎంతకాలంనుంచి పనిచేస్తూన్నారు? సిగరెట్టు కాలుస్తారా?"

"సైన్యాల్ని విడగొట్టేసినప్పటినుంచీకూడాను అప్పుడే 9ఏళ్ళు అయింది." అంటూ దేవిడోవ్ సిగరెట్టుకోసం చెయ్యి జాపేడు. అతని ముంజేతిమీది పచ్చబొట్టు చూసి, సెక్రెటరీ చిరునవ్వుతో,

"మీరు నావికాదళంలో పనిచేసినట్టున్నారే!"

"అవును."

"మీ చేతిమీద ఆపచ్చచూసి అనుకున్నాను."

బీళ్ళు మళ్ళేను.

“ఏదో—అప్పుడు చిన్నతనం. కేస్తూంటే మాట్లాడక ఊరుకున్నాను.....” డేవిడోవ్ కోపంతో చొక్కా చెయ్యి క్రిందికి తీస్తూ “దీనికేం కాని పన్నువసూళ్ళవిషయం చూద్దురూ ముందు.”

సెక్రిటరీ మౌనంగా వూరుకున్నాడు. పెదవులమీది అర్థం లేని చిరునవ్వు మాయం అయింది.

“కామ్రేడ్! మీరు జిల్లాకమిటీ ప్రతినిధిగా ఈ రోజుననే బయలుదేరి వెళ్ళండి. రీజియనల్ కమిటీ కొత్తగా యిచ్చిన సూచనలు ఎరుగుదురు కాదూ? ... ఎరుగుదురా! సరే. వెంటనే మీరు గ్రెమాచీ గ్రామ సోవియటుకి వెళ్ళండి. ఇప్పుడు ఏమాత్రం ఆలస్యం చెయ్యడానికి వీలులేదు అక్కడికి వెళ్ళినతరువాత విశ్రాంతి తీసుకోనవచ్చునులెండి. నూటికి నూరు పాళ్ళు—భూమి సమిష్టి వ్యవసాయ క్షేత్రాల క్రిందికి తీసుకొని రావలసిన బాధ్యత మీది. అక్కడ నామ మాత్రంగా ఒకసంఘం వుంది కాని, అంతగా పని చెయ్యడంలేదు. ఇప్పుడు మనం బ్రహ్మాండమైన సమిష్టివ్యవసాయ క్షేత్రాలు ఏర్పాటుచెయ్యాలి త్వరలోనే ఒక ప్రచారక దళం మీ సహాయానికి అక్కడికి పంపిస్తాము. మీరు వెళ్ళి, వెంటనే సమిష్టివ్యవసాయక్షేత్రాలు ఏర్పాటుచేసి, జాగ్రతగా, నేర్పుతో, భాగ్యవంతుల్ని అణగత్రొక్కాలి. గ్రామంలోని బీదరైతుల్ని, మధ్యరకపు రైతుల్ని, పూర్తిగా సమిష్టివ్యవసాయ క్షేత్రాల్లో సభ్యులుగా చేర్చండి. తరువాత 1930 లో సమిష్టిగా సేద్యంచేయ దలచినభూమికి పెట్టుబడికోరకు కొంత 'ఫండు' ధాన్యరూపంగా

పనులు చెయ్యండి. ఈపని అంతా చాలా జాగ్రత్తగా చెయ్యాలి. సామాన్య రైతులతో అట్టే విరోధ పడకండి. గ్రెమాచీలాగ్ లో ముగ్గురు సభ్యులతో మన పార్టీ శాఖ ఒకటి వుంది. దాని శెక్రిటరి, గ్రామ సోవియటు అధ్యక్షుడు కూడ చాల చురుకైనవాళ్ళు. పూర్వం 'రెడ్ పార్టిజాన్ దళాల' లో పనిచేసేరు. ఇంక నేను చెప్పేదేముంది. పరిస్థితుల్ని బట్టి మీకు తోచినట్లు పనిచెయ్యండి. వాళ్ళకి రాజకీయపరిజ్ఞానం తక్కువ అవడంచేత అప్పుడప్పుడు పొరపాట్లు చెయ్యొచ్చు. ఏవిషయంలోనైనా మీకు సలహాకాని, సహాయంకాని కావలసివస్తే జిల్లా కార్యాలయానికి రండి. ఇంకా ఆగ్రామానికి ఇక్కడికి టెలిఫోను సౌకర్యాలులేవు. ఆవూళ్ళోని పార్టీ శెక్రిటరీ 'ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బేనర్' బిరుదాన్ని పొందేడు. కొంచెం కోపిష్టి; మోటుదనం ఎక్కువ." శెక్రిటరీ ఎదటి బల్ల మీద తన వేళ్ళతో టక టక వాయిస్తూ, డేవిడోవ్ ఇంకా అక్కడే వుండడంచూసి మళ్ళీ ప్రారంభించేడు.

"ఇంకొక్క విషయం చెప్పడం మరిచిపోయేను. ప్రతిరోజు ఎప్పటివార్తలప్పుడు నాకు తెలియచేస్తూండండి. అక్కడనున్న మనవాళ్ళని కొంచెం అదుపు ఆజ్ఞలలో వుంచండి. ఇప్పుడుమీరు నిర్మాణ శాఖకి వెళ్ళి మరీవెళ్ళండేం! జిల్లా ఎగ్జిక్యూటివ్ కమిటీ తాలూకు గుత్తాలు మీకు సప్లయి చెయ్యమని తెలియచేస్తాను. మీరు వెళ్ళిన పని నూటికి నూరు పాళ్ళు సాధించుకు రావాలి. ఈ 18 గ్రామసోవియటులను కలిపి ఒక బ్రహ్మాండమైన సమిష్టి

వ్యవసాయ క్షేత్రం ఏర్పాటు చెయ్యాలి."

"భాగ్యవంతుల్ని అణచడంలో కొంచెం మెత్తగా ప్రవర్తించమన్నారు—ఆ విషయం కొంచెం వివరంగా చెప్పండి."

"చెప్పడానికేముంది?" సెక్రెటరీ గర్వంగా చిరునవ్వు నవ్వేడు. "భాగ్యవంతులు రెండు రకాలు. ధాన్యరూపంగా ఇయ్యవలసినదంతా చెల్లించేవారు కొందరు; మూర్ఖపు పట్టుదలతో ఏమియూ చెల్లించనివారు కొందరు. ఈ రెండవరకపు భాగ్యవంతుల్ని ఏమి చెయ్యాలో తెలుస్తూనే వుంది. ఏమీ సంకోచించకుండా ధాన్యపు వసూలు చట్టం 107 వ ఆర్టికిల్ ప్రకారం మాడ్చి పారెయ్యడం. కాని, మొదటి రకపు కులకుల్ని ఏమి చెయ్యాలీ అన్నదే కొంచెం ఆలోచించవలసిన విషయం. మీరివిషయంలో ఏంచేస్తే బాగుంటుందంటారు?"

"చెయ్యడానికేముంది? మళ్ళీ అదనపుపన్ను విధించడం."

"అచ్ఛే! కామ్రేడ్! అదేమీ సరియైన విధానం కాదు. దానివల్ల మనగొయ్యి మనమే తవ్వుకున్నవాళ్ళం అవుతాం. ప్రజలకి మనమీదవున్న గౌరవం నశిస్తుంది. ఇల్లా చేస్తే సామాన్య రైతులు ఏమనుకుంటారు? వాళ్ళు 'సోవియటు ప్రభుత్వం చేసిపని ఇది! ఏదోవిధంగా రైతులందర్నీ నాశనం చేస్తారు.' అనుకుంటారు. 'రయితు సమస్యల్ని ఉపేక్షాభావంతో చూడక, జాగ్రత్తగా ఆలోచించి, వారిని మనవైపుకి తిప్పుకొనడానికి ప్రయత్నించాలి.' అని కామ్రేడ్ లెనిన్ చెబుతూంటే, వారిమీద అదనపు పన్ను

విధించమంటారు మీరు. అవన్నీ చిన్నతనపు చేష్టలు. వాటివల్ల లాభం లేదు."

"ఏమిటి! చిన్నతనపు చేష్టలా!" డేవిడోవ్ ముఖం జేవురించింది. "అయితే మీవుద్దేశ్యం ప్రకారం 'స్టాలిన్' అవలంబించిన విధానం తప్పు అన్నమాట."

"నేచెప్పినదానిలో స్టాలిన్ విషయం ఏముంది!"

"ఈమధ్య స్టాలిన్, మార్క్సిస్టు ......అదేదో కాన్ఫరెన్సు జరిగినప్పుడు...భూమి సమస్యనుగురించి మాట్లాడిన ఉపన్యాసం చదివేను....వారిని ఏమని పిలుస్తారు? నోట్లో ఆడుతూంది..."

"అగ్రేరియనులనా?"

"ఆ! అది! మరిచిపోయేను."

"సరే, తరువాత విషయం కానియ్యండి."

"ఆ ఉపన్యాసం అంతా 'ప్రవదా' లో పడింది. ఆ పత్రిక ఒక్కసారి తెప్పించండి"

సెక్రటరీ 'ప్రవదా' తీసుకువచ్చేడు. డేవిడోవ్ గబగబా పేజీలు తిరగెయ్యడం మొదలెట్టేడు.

అతడు నవ్వుతూ డేవిడోవ్ ముఖంకేసి చూసేడు.

"ఆ! ఇదిగో! వినండి చదువుతాను ... 'దేశములోని భూమి అంతా కాకుండా, కొంత భాగము మాత్రమే సమిష్టివ్యవసాయ క్షేత్రాలుగా ఏర్పాటు చేయుటకు ప్రయత్నించినంత కాలము, మనం భాగ్యవంతుల్ని అనగ త్రొక్కలేము.' ఇంకా ఇక్కడ

బీళ్ళుమన్నారు.

ఏమన్నాడంటే, 'కాని ఇప్పటి పరిస్థితులన్నీ వేరు. భాగ్యవంతుల నిరోధక శక్తిని నాశనంచేసి ఆవర్గం పూర్తిగా అంతరింప చెయ్యడానికి అవకాశం కలిగింది మనకి.' చూసేరా-ఇక్కడేమన్నాడో? 'వర్గాన్ని అంతని' అని అన్నాడు. తెలియలేదు? ఇంతస్పష్టంగా చెప్పినప్పుడు అదనపు పన్ను ఎందుకు విధించకూడదు? అదనపు పన్ను విధించడమే కాదు, నేలవెట్టి రాసెయ్యాలి వాళ్ళని."

సెక్రటరీ పెదవులమీద చిరునవ్వుపోయింది. ముఖం గంభీ దాల్చింది.

"సమిష్టివ్యవసాయక్షేత్రాలలో చేరిన బీదరైతులచేత, మధ్యరకపు రైతుల చేత ధనిక వర్గాన్ని అంతని అంతరింప చెయ్యాలి." అన్నాడు. "అంతేకాదు? కానియ్యండి."

"ఊం! మీరు..."

"ఊం లేదు; ఆ లేదు." సెక్రటరీ అతి కోపంతో అన్నాడు. మాట కూడా కొంచెం తడబడింది. "మీరిచ్చే సలహా ఏమిటి? పిడుగుకి బియ్యానికి ఒకటేమంత్రంఅన్నట్లు పన్ను చెల్లించినవారిమీద చెల్లించనివారిమీద కూడ ఒకే విధంగా చర్య తీసుకుంటారన్నమాట. అదీకాక 14.8% భూమిమాత్రం సమిష్టివ్యవసాయక్షేత్రాలుగా ఏర్పడి, సామాన్య రైతులు ఇప్పుడిప్పుడే సమిష్టివ్యవసాయక్షేత్రాలలో సభ్యులుగాచేరుతూన్న ఈ జిల్లాలోనా ఆ విధానం అవలంబించడం? స్థానికవిషయాలు తెలియకుండా, ఎక్కడినుంచోవచ్చిన మీబోటివారంతా..." సెక్రటరీ ఉద్రే

కాన్ని అపుకోని నెమ్మదిగా చెప్పడం ప్రారంభించేడు.

"ఏవో పెద్దపెద్ద ఊహలు మనస్సులో నుంచుకొని పైకి తమ యిష్టంవచ్చినట్లు మాట్లాడుతూంటారు..."

"సరే. ఆ..."

"ఒక్కసారి ఆగండి—మధ్య అడ్డంరాక. భాగ్యవంతుల మీద అటువంటి చర్య తీసుకోవలసిన అవసరం వస్తే, రిజియనల్ కమిటీ నుంచి 'ఏవిధంగానైనాసరే ధనిక వర్గాన్ని నాశనం చెయ్యండి.' అని వాళ్ళు తెలియచెయ్యనే తెలియచేస్తారు. అప్పుడు మిలీషియా సహాయంతో వారినందర్నీ అణిచిపారెయ్యొచ్చు. కాని అంతవరకు పన్ను చెల్లించనివారిని మాత్రం 107 వ ఆర్టికిల్ ప్రకారం దావా చేసి, తగినచర్య తీసుకోవడం చాలు"

"అయితే—బీదరైతులు, సామాన్యరైతులు, కూలీలు మొదలైన వారు ధనికవర్గాన్ని నాశనం చెయ్యడానికి అంగీకరించరంటారా? వారంతా పెద్ద రైతుల పక్షం వహిస్తారనా మీవుద్దేశం?

శెక్రిటరీ డ్రాయరు తాళం వేసేడు.

"నాయకులు చెప్పినదానికి మీయిష్టం వచ్చినట్లు అర్థం చెప్పచ్చును. కాని, ఈజిల్లాకు నేను, జిల్లా కమిటీ బ్యూరో మాత్రమే జవాబుదారీ. మీరు మా నీతి ననుసరించి పనిచెయ్యవలసిందే కాని మీయిష్టంవచ్చినట్లు పనిచెయ్యడానికి వీలులేదు. అవతల నాకు చాలా తొందరపనులున్నాయి. ఇంక మీతో కూర్చుని మాట్లాడడానికి తీరుబడిలేదు." అంటూ శెక్రిటరీ లేచినిలబడ్డాడు.

బీళ్ళు దున్నేరు.

దేవిడోవ్ ముఖం జేవురించింది. పెదవులు చలించేయి. కాని, కోపం అణచుకొని నెమ్మదిగా,

"నేను పార్టీ అనుసరించమనిన నీతి అనుసరిస్తాను. దాపరికం ఎందుకు-నిర్మొహమాటంగా చెబుతూన్నాను. మీరు అనుసరించ మనిన విధానం తప్పు. రాజకీయ దృష్ట్యా అది సరియైనది కాదు. ఈవిషయం ఘంటాపథంగా చెప్పగలను." అన్నాడు.

"మంచి చెడ్డల విషయముతో మీకు అవసరం లేదు. మీరు నేను చెప్పిన ప్రకారం నడచుకొని తీరాలి. దానిలోని లోపాలకి జవాబుదారీ నాది. ఇంక ఆవిషయం కట్టిపెట్టండి."

టెలిఫోనుగంట గణ గణ మోగింది. శెక్రెటరీ రిసీవరు తీసుకొని చెవిదగ్గర పెట్టుకొన్నాడు. ఇతరులెవరో ఇద్దరు ముగ్గురు లోపలికి వచ్చేరు. దేవిడోవ్ నిర్మాణశాఖ ప్రధానాధికారిని కలుసుకొనడానికి వేగంగా వెళ్ళిపోయేడు.

"మితవాద ధోరణిలో పడ్డాడు ...ఏమీ అనుమానంలేదు." అనుకున్నాడు, ఆఫీసు వదలి వెళ్ళిపోతూ. "స్టాలిన్ యిచ్చిన ఆ వుపన్యాసం వారందరికి చదివి వినిపిస్తాను. రౌతు మెత్తనయితే గుర్రం మూడు కాళ్ళమీద నడిచిందని, నీ మెత్తదనం చూసి పెద్దరైతులు అంతకంతకు లొంగనిస్థితికి వస్తూన్నారు. రిజియనల్ కమిటీ ఆఫీసుకి వెడితే వాళ్ళు నువ్వు చాలా సమర్థుడవని చెప్పేరు. ఏం లాభం? పెద్దరైతుల్ని ఒక్కడిని కూడా లొంగతియ్య లేక పోయేవు. ఒక్కడూ ఇవ్వవలసిన ధాన్యంఇవ్వకుండా మాట్లాడక

కూర్చున్నాడు. ప్రజాసామాన్యాన్ని కూడగట్టుకొని, వాళ్ళని ఎందుకు అభివృద్ధి మార్గానికి నడిపించడం లేదు!" శెక్రిటరీతో మాట్లాడుతూన్నట్లుభావించుకొంటూ వెళుతూన్నాడు. ఎవరితో నైనా మాట్లాడుతూన్నంత సేపు ఏవిషయంతోనక, తరువాత ఒంటరిగా తనలోతను ఆలోచించుకొనే సమయంలో అనేకనూతన విషయాలు మనస్సుకితట్టడం మామూలు. శెక్రిటరీతో మాట్లాడుతూన్నంత సేపు - ఉద్రేకంచేత తొట్రుపాటుపడి, ఏవిషయం తోనక మొదటిమాట నేపట్టుకుకూర్చున్నాడు. అప్పుడు శెక్రిటరీతో నెమ్మదిగామాట్లాడిఉండవలసింది. అల్లాఆలోచించుకుంటూ పరధ్యాన్నంగా వెళుతూ, బజారులో మంచుపడి తెల్లగానున్న పేవకడిమీద అడుగువేసి జారిపడ్డాడు.

“అంతటితో చాలించి వెళ్ళిపోయేవు. లేకపోతే మెత్తగా తన్ని వదిలిపెడుదును” అనుకున్నాడు గట్టిగా. పేవలోజారిపడి తనలోతను మాట్లాడుకొంటూన్న దేవిడోవ్‌ను దోవనుపోతూన్న ఒకయువతిచూసి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. లేచి బట్టలుదులుపుకొని దేవిడోవ్ వెళ్ళిపోయేడు.

అతడు తిన్నగాతనబసకివెళ్ళి సూట్ కేస్ తీసుకొన్నాడు. అతడు లెనిన్ గ్రాడ్‌లో బయలుదేరినప్పుడు రెండుజతల గుడ్డలు, మేజోళ్ళు, స్క్రూ-డ్రైవర్లు, రెంచిలు, ఇంకాచేతికిదొరికిన ఇతర సామానులుతోటి పెట్టెనింపేడు. వాటిలోబట్టలుతప్ప మిగిలినవన్నీ అనవసరమే. పెట్టిలోవున్న ఈసామానువిషయం జ్ఞాపకం వచ్చేట

ప్పటికి అతనికి నవ్వువచ్చింది. "వీటి అవసరంకూడా తప్పకుండా వస్తుంది." అనుకున్నాడు. సమిష్టివ్యవసాయక్షేత్రంలో ఏ ట్రాక్టరేనా మరమత్తు చెయ్యవలసివచ్చినప్పుడూ, అప్పటికప్పుడు మనకి ఎక్కడ దొరుకుతాయి? కాని అక్కడ ట్రాక్టరులేవట్టుందే! అ-మరేం భయంలేదు. నేనుఆర్గనైజరుగా జిల్లాఅంతటా తిరుగుతూంటాను కాదూ. సమిష్టివ్యవసాయక్షేత్రంలో పనిచేసే ఏ కమ్మరివానికేనా యిస్తే కళ్ళకద్దుకునిపుచ్చుకుంటాడు" అని నిశ్చయించి సూట్ కేసు స్లెడ్జిబండిలో పడేసేడు.

బాగాబలిసియున్న జిల్లాఎగ్జిక్యూటివ్ కమిటీగుఱ్ఱాలు స్లెడ్జిబండితో నిముషంలో ఊరుదాటేయి. కొంతదూరంవెళ్ళేటప్పటికి డేవిడోవ్ చలి భరించలేకపోయేడు. చిరిగిపోయిన బూట్లలోంచి చలిగాలి దూరి, కాళ్ళు కొంకర్లు పోతూన్నాయి. టోపీ బాగా ముఖం మీదికి లాక్కొని, చొక్కా బిగించుకొని, ముణిచిపెట్టుకొని కూర్చున్నాడు. జిల్లాముఖ్యపట్టణాన్నుంచి గ్రిమాచీలాగ్ కి 17 మైళ్ళువుంది. అంతా గుట్టలమయం. కనుచూపుమేర ఎటు చూసినా మంచుతో కప్పబడిన బీటిభూములే కనిపిస్తూన్నాయి. బాటకిరుప్రక్కల కొట్టేసిన చెట్లమొదళ్ళతోటి, ముళ్ళ దుప్పలతోటి నిండి వుంది.

శరీరం వేడి ఎక్కడానికి డేవిడోవ్ బండిదిగి వెనకభాగం పట్టుకొని పరుగెత్తసాగేడు. కొంతసేపయిన తరువాత బండిలోకి ఉరికి కాళ్ళు ముడుచుకొని కొంతసేపు కునికేడు. బండి కుదుపుకి

అప్పుడప్పుడు కళ్ళు తెరిచిచూసి మళ్ళీ పడుకుంటూన్నాడు.

చలిపక్కలువంచేస్తూంది. దేవిడోవ్ లేచికూర్చున్నాడు. పొద్దు బాగా వాలిపోయింది. ఎటుచూసినా కనుచూపుమేరవరకు వ్యాపించియున్న సైబీరియా స్టెప్పీమంచుతో కప్పబడి తెల్లటి బట్ట పరచినట్లుంది. బాటకి పక్కగా బూడిదవర్ణపు నక్క ఒకటి వెనక కాళ్ళమీద కూర్చునివుంది. స్లెడ్జిబండి చూడగానే ఒక్కగంతేసి అతివేగంగా పరుగెత్తిపోయింది.

దేవిడోవ్ గ్రిమాచీలాగ్ చేరేటప్పటికి సాయంకాలం అయింది. గ్రామసోవియటుఆఫీసు ఆవరణలో చాలా స్లెడ్జిబళ్ళు ఆగివున్నాయి. ఏడు-ఎనమండుగురు కోసక్కులు చుట్టలుకాలుస్తూ వరండామీద కూర్చునివున్నారు. నురగలు కక్కుతూ వెళ్ళి గుఱ్ఱాలు వాళ్ళముందు ఆగేయి.

"ఏమండీ! తబేలా ఎక్కడ?" అనిఅడిగేడు దేవిడోవ్. వారిలో ఒక కోసకుయువకుడు "కామ్రేడ్! అదిగో ఆ పూరిల్లు కనిపిస్తూందిచూసేరూ; అదే తబేలా." అన్నాడు.

"బండి అక్కడికి పోనియ్యవోయ్." అని బండివానికి చెప్పి బండీదిగి చలికి కొంకరించుకుపోయి జివ్వున లాగుతూన్న దవడలు వేడియెక్కడానికి చేతులతో రుద్దుతూ బండివెనక బయలుదేరేడు. ఉత్తరరష్యనులవలె యాసగామాట్లాడుతూన్న ఈతడెవడో పెద్దవుద్యోగస్థుడయివుంటాడని అనుకొని ఆకోసకులు అతని వెనకనే బయలుదేరేరు.

## బీళ్ళు దున్నేరు.

శాలలోంచి ఉచ్చ, పేడ, కలగలిసిన చిన్న పరివాహం వస్తూంది. బండీవాడు గుఱ్ఱాల్ని ఆపేడు. డేవిడోవ్ గుఱ్ఱాల్ని విప్పసాగేడు. కోసకులు అతని చుట్టూచేరి, వింతగా చూస్తూన్నారు. బుగ్గమీసాలనిండా పట్టుకొనియున్న మంచుతుడుచుకుంటూ,

"కామ్రేడ్! దగ్గిరికి వెళ్ళకండి గుఱ్ఱంతన్నుతుంది." అన్నాడు.

డేవిడోవ్ తోకపట్టాతీసి, తొస్సిపళ్ళు కనిపించేటట్లుగా నవ్వుతూ అతనికేసితిరిగేడు.

"తాతా! గుఱ్ఱపుదళంలో పనిచేసినవాణ్ణి నేను. ఈగుర్రాన్ని లొంగతియ్యలేకపోను."

"పన్నొకటి ఊడిపోయింది- ఏగుఱ్ఱమేనా తన్నడంచేత కాదు కదా?" అన్నాడు కాకిలా నల్లగా వున్న ఒకకోసక్కు. మిగిలిన వాళ్ళంతా విరగబడి నవ్వేరు. కాలరు సర్దుకుంటూ డేవిడోవ్ పరిహాసంగా —

"అబ్బే! - వెనక ఒకసారి తప్పతాగిగంతులెయ్యడంలో విరిగిపోయింది. అదీఒకందుకు మంచిదే అయింది. ఆడాళ్ళకి ఇప్పుడు నేనుకరుస్తానని భయంపోయింది. ఏమంటావు, తాతా?" అన్నాడు.

ఈవిధంగా వాళ్ళంతాకొంతసేపు వేళాకోళంగా మాట్లాడుకుంటూ నవ్వుకున్నారు.

డేవిడోవ్ వాళ్ళందరికి తలొక సిగరెట్టు యిచ్చి, తనొకటి వెలిగించి, గ్రామసోవియటుఆఫీసు వైపు బయలుదేరేడు.

"అధ్యక్షుడు, పార్టీ శెక్రెటరీ కూడ అక్కడే వున్నారు."

అన్నాడు, దేవిడోవ్ వెనకవస్తూన్న ముసలి కోసక్కు. మిగిలిన కోసక్కులందరు రెండుదమ్ములో సిగరెట్లు కాల్చిఅవతలపారేసి వాళ్లు కూడా బయలు దేరేరు. కొత్తగావచ్చిన అతడు,సాధారణముగా అక్కడికి వచ్చి అందరివలె బండిదిగి డాక్యుమెంటుకేసు పంకనిపెట్టుకొని పక్కనున్నవాళ్ళకేసి కన్నెత్తికూడా చూడకుండా తిన్నగాలోపలికిపోకుండా, —ఎంతోఅనుభవముఉన్నవానివలె జీను విప్పడంలోను, గుర్రాన్ని జాగ్రత్త పెట్టడంలోను, బండివానికి సహాయంచేసి, అందరితోను చాలకలిసికట్టుగామాట్లాడడంచూసి ఆకోసక్కులు ఆశ్చర్యపోయేరు.

"కామ్రేడ్! బండివాడు చేసుకొనే పనికి మీరు సహాయం చెయ్యడం ఎందుకు? ఉద్యోగస్తులు చెయ్యవలసిన పని కాదది. ఏమంటారు?" అనిసల్లకోసక్కు పట్టలేకఅడిగేడు.

"ఇదిమాకుచాలావింతగావుంది." అన్నాడు ముసలికోసక్కు. దేవిడోవ్ ఏదో చెప్పబోయేడు, కాని అతనికి అవకాశం ఇవ్వకుండానే, రాగిమీసాల కోసక్కు, సుత్తితో పనిచెయ్యడంచేత కాయలు కాచియున్న దేవిడోవ్ చేతులకేసి చూపిస్తూ,

"ఏం- అంత ఆశ్చర్యం ఎందుకు? అతను కమ్మరి" అన్నాడు.

"కాదు. తాళాలు చేసేవాడిని." అన్నాడు దేవిడోవ్. "కాని మీరంతా నాతోకూడా సోవియటుకి వస్తూన్నా రెందుకు?"

"మీరు ఇక్కడికి ఎందుకువచ్చేరో అని. రైతులు బకాయి పెట్టిన ధాన్యపుపన్ను వసూలు చెయ్యడానికా?"అన్నాడుముసలి

కోసక్కు వరండాదగ్గర ఆగి.

"సమిష్టివ్యవసాయ క్షేత్రాలు ఏర్పరచేపనిమీద."

ఆమాట వినగానే ముసలికోసక్కు వరండా దగ్గిరనుంచి గబగబా బయటకి వెళ్ళిపోయేడు.

సరంబీచేసిన ఆగది తోళ్ళు ఎండబెట్టిన వాసన వేస్తూంది. గదిమధ్య డ్రాయరుదగ్గర ఆజానుబాహుడొకడు దేవిడోవ్ కేసి తిరిగి, నిలబడి ఉన్నాడు. అతని బూడిదరంగు చొక్కామీద 'ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బేనర్' అని వ్రాయబడియున్న ఎర్రటి రిబ్బను గుచ్చబడివుంది. 'ఇతడే పార్టీ శెక్రటరీ అయివుంటాడు.' అనుకున్నాడు, దేవిడోవ్.

"జిల్లాకమిటీపంపించిన ప్రతినిధిని నేను." అనిదేవిడోవ్ తనని తనే పరిచయం చేసుకున్నాడు. "కామ్రేడ్! మీరు పార్టీ శెక్రటరీ కాదూ?"

"అవునండి. నేనే శెక్రటరీని. నా పేరు నగుల్నోవ్. సోవియట్ అధ్యక్షుడు ఇప్పుడే వస్తాడు." అంటూ దేవిడోవ్ దగ్గిరికి వచ్చేడు. సాధారణంగా గుర్రపురౌతులందరి కాళ్ళవలెనే అతనివికూడా దొడ్డికాళ్ళు. విశాలమైన వక్షస్థలం, అందమైన కళ్ళు, తీర్చి దిద్దినట్లున్న కనుబొమలు, అన్నీ బాగానేవున్నాయి, కాని విపరీతంగా పైకి తోసుకుపోయిన ఆచిన్న ముక్కు ముఖానికి అందవికారం తెచ్చింది.

గొఱ్ఱెచర్మంతో చేసిన టోపీ నెత్తి వెనక పెట్టుకొని, పైని

కులు ధరించు చిన్న జాకెట్టు తొడిగి, కోసక్కు ట్రౌజర్లను చివర మేజోళ్ళలో బిగించి, కుదిమట్టంగావున్న ఒక వ్యక్తి పక్క గది లోనుంచి వచ్చేడు.

"ఇతనే సోవియట్టు అధ్యక్షుడు — ఆండ్రీ రజ్మెట్నోవ్." అన్నాడు నగుల్నోవ్.

అధ్యక్షుడు చిరునవ్వుతో ఉంగరాలుతిరిగి బొద్దుగానున్న మీసంసవరించుకొని డేవిడోవ్ కేసి చెయ్యిజాపేడు.

"ఎవరువీరు? జిల్లాకమిటీనుంచి వచ్చిన ప్రతినిధులా? ఆ— వీ డాక్యుమెంట్లు ... మకార్! అవి నువ్వు చూసేవు కాదూ? అయితే వీరు సమిష్టివ్యవసాయక్షేత్రాల విషయమై వచ్చేరను కుంటాను." అతను కనురెప్పలాడ్పుతూ ఆనీలికళ్ళతో డేవిడోవు కేసి చూడ్డం మొదలెట్టేడు.

డేవిడోవు బల్లదగ్గిర కూర్చుని, 'కమ్యూనిస్టు పార్టీ రెండు మాసములలోపుగానే దేశములోనిభూమిఅంతా సమిష్టివ్యవసాయ క్షేత్రములుగా ఏర్పాటుచెయ్యవలెనని నిశ్చయించినదని' చెప్పి, అమురునాడే గ్రామములోని కోసక్కులను, ఇతర Active Workers ను పిలిచి సమావేశంచేస్తే బాగుంటుందన్నాడు.

నగుల్నోవుస్థానికవిషయాల్ని గురించి, ముఖ్యంగా సమిష్టి వ్యవసాయము ఏర్పరచు ఉద్దేశముతో స్థాపించిన గ్రామాచీ అసో సియేషనును గురించిచెప్పేడు. అతడు మాటాడినంతసేపు రజ్మెట్ నోవు శ్రద్ధగావింటూ మధ్యమధ్య తనుకూడాఅందుకుంటోచ్చేడు.

వీళ్ళున్నారు.

"ఇక్కడి భూములన్నీ సమిష్టిగా సాగుబడి చేయించడానికి ఒక అసోసియేషను ఏర్పరచేము." నగుల్నోవు తొట్రుపాటుగా చెప్పసాగేడు. "కామ్రేడ్! నేను చెప్పేది వినండి. దీనివల్ల ప్రభుత్వానికి నష్టమే కాని లాభం లేదు. సమిష్టివ్యవసాయ క్షేత్రం అని పేరే కాని అంతకంటె మరేమీ లేదు. మొత్తం 18 మంది సభ్యులు వున్నారు. వారంతా గర్భదరిద్రులే. ఈ సమిష్టివ్యవసాయ క్షేత్రం ప్రారంభించేటప్పటికి ఆ 18 మందికి కలిసి 4గుర్రాలు, ఒక కాడి ఎడ్లు, మాత్రం వున్నాయి. పోషింపబడవలసినవాళ్ళు 107 గురు. ఇటువంటిపరిస్థితుల్లో దానినిజయప్రదంగానడపడంఎల్లాగ చెప్పండి. వ్యవసాయానికి కావలసిన యంత్రాలు, పశువులు, మొదలయినవి కొనడానికి కావలసిన సొమ్ము ప్రభుత్వం నుంచి దీర్ఘవాయిదాల మీద తీర్చుపద్ధతిని అప్పుగాతీసుకోవచ్చును. కానిదీర్ఘవాయిదాల లోనయినా ఆఅప్పు ఏవిధంగాతీరుస్తారు? పోనీ ప్రభుత్వం ఇచ్చిన సొమ్ముతో ట్రాక్టరు కొన్నా బాగానేవుండును. కాని అవికొని ఇవ్వరు. ఇంక పశువుల్ని కొని, వాటితో వ్యవసాయంచేస్తే అంత లాభం వుండదు. ఇంకోవిషయంకూడాను: అసలు వీళ్ళు సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్ని సరియయినపద్ధతులమీద నడిపించడంలేదు. నేనయితే ఈసాటికి వీళ్ళందర్నీ మూట ముల్లె కట్టించి బయటికి తోలేసివుందును. ఎంత సేపూ ఇచ్చినంతవరకు అప్పుపుచ్చుకొనడం తప్ప, దానిని సద్వినియోగంచేసి, సమిష్టివ్యవసాయ క్షేత్రం అభివృద్ధి చెయ్యడంలేదు. ఇంతఅప్పు పుచ్చుకొని, 'ప్రభుత్వం అప్పు

ఇస్తూంది-ఇయ్యనీ. వాళ్ళుయిస్తామంటూంటే మనంవద్దనడం ఏమి? గోచీకూడా లేని మనదగ్గరనుంచి వాళ్ళు వసూలు చేసేదేముంది!" అని వాళ్ళు ఊహిస్తూన్నారు. ఇంక అసోసియేషన్ ఆట్టేకాలం నిలవదు. ప్రతి రైతును సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేర్చడమే సరియయిన పద్ధతి. అదేకనక కొనసాగిననాడు స్వర్గంఅంటూ వేరే ఎక్కడో వుండదు. కాని, ఒక్కచిక్కు వుంది. ఈ కోసక్కులు శుద్ధ మొద్దులు. చెబితేవినరు; వాళ్ళకి తోచదు. ఇలాటివాళ్ళంద ర్నీ వెనక ముందు చూడకుండా..."

"ఈ అసోసియేషన్‌లో మన పార్టీ మెంబర్లు ఎవరేనా వున్నారా!" అన్నాడు దేవిడోవ్.

"లేరు." అన్నాడు నగుల్నోవ్. నేను 1920 సంగంలో ఒక కమ్యూన్‌లో చేరేను. క్రమంగా దానిలోనిసభ్యులు కొంతమంది విడిపోవడంచేత అదిరద్దయిపోయింది. నాఆస్తిఅంతా ఆకమ్యూన్‌కి ఇచ్చేసేను. స్వంతఆస్తి అంటే నాకుకిట్టదు. అందుచేత నాపశువులు ఇతరపరికరాలు అన్నీకూడా మరియొక కమ్యూన్‌కి యిచ్చేసేను. ఆకమ్యూన్ ఇంకాపనిచేస్తూంది. ఇప్పుడు నాకు, నాభార్యకు ఏవీూ లేవు. ఇంక రజ్మెట్నోవ్ విషయం. పాపం—అతనికి భార్యలేదు. ఒక ముసలితల్లి మాత్రం వుంది. అతనుకనక చేరినట్లయితే వాళ్ళు 'వీడు వీసంఎత్తుపనిచెయ్యడుసరికదా-పైగా ఆముసలమ్మనికూడా మనకిఅంటకట్టేడు, మేపమని.' అంటారు. అందుచేత సాధ్యమైనంత దూరంగా వుండడం మంచిది. మూడవ పార్టీ మెంబరు ఇప్పుడు

ఇక్కడవుండడంలేదు. అతనికి ఒక చెయ్యిలేదు. యంత్రంలో పడి తెగిపోయింది. ఈఅసోసియేషన్‌లోచేరడానికి అతనికి ఇష్టంలేదు. 'పోషించడానికి ఆ వున్నవాళ్ళు చాలు. పైగా నేనుకూడా ఎందుకు, దండుగ?' అంటాడు."

"అవును. ఆ అసోసియేషన్ పరిస్థితులేమీ బాగులేవు" అన్నాడు రజ్మెట్‌నోవ్. "అర్కాష్కా లోసీవ్ దానికిఅధ్యక్షుడు. అతనికి దానిని మేనేజిచెయ్యడం తెలియదు. అటువంటివాడు అధ్యక్షుడు అవుతూంటే చేతులుముడుచుకొనిచూస్తూ, మనని కాసట్లు ఊరుకోవడం మనదే తెలివితక్కువ. అసలు అతడు అధ్యక్షుడుగా రాకుండా చెయ్యవలసింది."

"ఏం? ఎందుచేత?" అనిఅడిగేడు డేవిడోవ్ ఏవో కాగితాలు తిరగేస్తూ.

"అతను ప్రతివస్తువు తిరిగి లాభానికి అమ్ముతూంటాడు. అతని దగ్గరనున్న పెద్దలోపం అది అసోసియేషన్ ధ్వంసం అవడానికి అదే ముఖ్యకారణం. మంచిపశువుల్ని అభివృద్ధిచెయ్యడం కోసం అసోసియేషన్‌కి మంచిఆబోతు నొకదాన్ని కొన్నారు. లోసీవ్‌కి ఆ ఆబోతును మార్చి, మోటారుసైకిలు కొనాలని తోచింది. ఈ విషయం మాకుచెప్పకుండా ఎల్లాగో ఆఅసోసియేషన్ మెంబర్ల చేత అంగీకరింపచేసి, వెంటనే ఆబోతును అమ్మేసి, మోటారు సైకిలుకొన్నాడు. ఈవిషయం మాకు తెలిసింది. కాని అంతాఅయి పోయినతరువాత మేముమాత్రం ఏంచెయ్యగలం. పోనీ, అదేనా

ఉపయోగించేరా-అదీలేదు. ఒక్కడికీ దాన్ని నడిపించడం తెలియదు. అందుచేత దాన్ని కొన్నచోటుకి తిరిగిపంపేసేరు. అక్కడ మెకానిక్కులు దానిని పరీక్షించి, 'ఈపాటికి దీనిని మూలపారెయ్యొచ్చు. బాగుచేస్తే అసలుఖరీదుకంటె ఎక్కువ అవుతుంది— లాభంలేదు.' అన్నారు. దాల్లో కొన్ని భాగాలు పోయేయి. అవి ఈప్రాంతాల్లో ఎక్కడాదొరకవు. అసోసియేషనుకు యాకోవ్ లూకుచ్ ఆస్త్రోవ్నోవ్ ను అధ్యక్షుడుగా ఎన్నుకోవలసింది. అతడు చాల తెలివైనవాడు. క్రాస్నొడార్ నుంచి కొత్తరకపు గోధుమవిత్తులుతీసుకువచ్చి నాటేడు. ఎంతఎద్దడిసంవత్సరంఐనా అవి పంటజబ్బు ఇయ్యవు. అతడు వేసవిలో భూమి మెత్తగాదున్ని అట్టేపెట్టడంచేత అందరిభూములకంటె బాగా పండుతాయి. మంచిరకపుపశుజాతినికూడా అభివృద్ధిచేస్తూన్నాడు. కాని పన్నుకి తొందరపెడితేమాత్రంకొంచెంమూలుక్కుంటాడు, ఇయ్యడానికి. ఏమయితేనేం - వ్యవసాయంలో మంచినేర్పరి. వ్యవసాయశాఖ వారుఅతనికిఒకసర్టిఫికెటుకూడాఇచ్చేరు." అన్నాడురజ్మెట్నోవ్.

"అబ్బో! అతడు పైకిఅల్లావుంటాడు కాని తోడేలువంటివాడు. ఎంతసేపూ తనబాగే చూసుకుంటాడు. విరిగినవేలుమీద పుచ్చ కూడా పొయ్యడు." అన్నాడు నగుల్నోవ్.

"ఆ - ఆవిషయంలో అతన్ని ఏమీ అనడానికి వీల్లేదు. అలా అయితే ఇంతకాలందాగుతుందా!" అన్నాడు రజ్మట్నోవ్.

# మూడో ప్రకరణం.

## కుట్ర.

కెప్టెన్ పొలోవిట్సేవ్, యాకోవ్ లూకుచ్ అస్త్రినోవ్ ను కలుసుకొన్న రాత్రి వారిద్దరు చాల పొద్దుపోవువరకు మాట్లాడు కుంటూ నేవున్నారు. యాకోవ్ చాల తెలివైనవాడనీ, జిత్తుల మారి అనీ గ్రామాచీలో అందరు యెరుగుదురు. అయినప్పటికి ఆ రోజుల్లో దేశమంతటా ప్రతివారినీ అల్లకల్లోలపరుస్తూన్న రాజ కీయవాతావరణం అతనిమీద విరుచుకుపడడం మానలేదు. ఆరోజు రాత్రి మొదలు అతనిజీవితం దినదినగండాలతో ప్రారంభంఅయింది.

రాత్రి భోజనం అయినతరువాత లూకుచ్ ఒక కర్రపెట్టె మీదకూర్చుని వెనకటివిషయాలన్నీ చెప్పసాగేడు.

"అలెగ్జాండర్! పూర్వం ఆరోజుల్లో వున్న కులాసాయే లేదు ఇప్పుడు. కోసక్కులు వ్యవసాయాల్లో కొంచెం లాభాలు తిని కోలుకుంటూన్నారనుకుంటూంటే - మళ్ళీ చూడండి - పన్నులు ఎంత హెచ్చించేరో. మీ ప్రాంతాల్లో ఎల్లావున్నాయి పరిస్థితులు? అక్కడ సమిష్టివ్యవసాయక్షేత్రాల గొడవ ఏమీ లేదూ?

"అరొ్ాగ్య! లేకపోవడం ఏమిటి! ప్రతిచోటా వుంది." అని అతిథి ముక్తసరిగా సమాధానంచెప్పి, లూకుచ్ ముఖంకేసి పరిశీల

నగా చూడసాగేడు.

"ఇంకా ఈ గొడవ ఇక్కడ ఒక్కచోటే అనుకున్నాను. దేశంఅంతటా వుందీ!" అన్నాడు లూకుచ్. "నాకథచెబుతాను, వినండి. 1920వ సంవత్సరంలో మనసైన్యాలు ఓడిపారిపోతూంటే నేను తిరిగివచ్చేసేను. నాసామానంతా ఆరెండు గుర్రాలతోసహా నల్లసముద్రం దగ్గిర విడిచిపెట్టి. వట్టిచేతులతోవచ్చి, నా చుట్టు గుడిసెలో ప్రవేశించేను. అప్పటినుంచీ, రాత్రి పగలు అనక రెక్కలుముక్కలయేలా పనిచేసేను. మొదటిసారి కామ్రేడ్సు పొల్లుకాయలు కూడా మిగల్చకుండా అంతా పట్టుకు పోయేరు. అది మొదలు నన్ను ఈవిధంగా ఎన్నిసార్లుచేసేరో లెక్కలేదు. కాని వాళ్ళు తీసుకొన్న ప్రతిసారి, రసీదులు మాత్రం ఇస్తూవచ్చేరు. అందుచేత వాళ్ళు చేసిన అన్యాయాలు మరిచిపోదం అనుకున్నా ఆరసీదులు చూడగానే మళ్ళీ జ్ఞాపకం వస్తూన్నాయి." లూకుచ్ లేచి గోడనున్న అద్దంవెనకనుంచి కాగితాలకట్టఒకటి పైకితీసేడు. "ఈకట్ట అంతాఅబాపతే! ఇది 1921వ సంవత్సరంలో తీసుకొన్న వాటికిరసీదు. అప్పుడు ధాన్యం, కోళ్ళు, వెన్న, తోళ్ళు, మాంసం సమస్తం ఇచ్చేసేను. ప్రత్యేకం వ్యవసాయపు పన్నుకి రశీదులు ఇవిగో. ఇవిఅన్నీ ఇనూర్న్సు పన్నులకి రశీదులు. ఒకచేమిటి- మేతలేక చావడానికిసిద్ధంగా వున్న పశువులకి, ఇల్లువదిలి పారిపో కుండా వున్నందుకు మాకు కూడా పన్నుకట్టేరు. ఇప్పటికప్పుడే అమాంబాపతు ఒక సంచీరసీదులు పోగుపడ్డాయి. అలెగ్జాండర్

బీళ్ళు చున్నేరు.

అనిసిమోవిచ్! ప్రభుత్వంమాటిమాటికి- నేనుకష్టపడిసంపాదించిన దంతా దోచేస్తూంది. మళ్ళీ నేను కూడ పెడుతూనే ఉన్నాను. నా దగ్గర మంచి ఎడ్లజత ఒకటి ఉండేది. అందులో ఒక ఎద్దును మంచి ఖరీదుకు అమ్మేసేను. నా భార్య తాలూకు కుట్టుమిషను అమ్మేసి మళ్ళీ ఎద్దుని కొన్నాను. 1925 వ సం॥ నాటికి ఇంట పుట్టిన దూడలు ఎదిగి, అవి ఒక కాడిఎడ్లు కలిసివచ్చేయి. అప్పటికి మొత్తం 2జతలఎడ్లు, 2ఆవులు ఉండేవి. అయినప్పటికి ప్రభుత్వం నావోటు రద్దుచెయ్యలేదు."

"గుర్రాలు ఏమీ లేవూ- నీకు?"

"ఒకొక్క విషయమే వస్తూన్నా; ఉండండి. ఒకరైతు దగ్గరనుంచిచిన్న ఆడగుర్రపుపిల్లనొకదాన్ని కొన్నాను. ఆరోజుల్లో మా గ్రామానికంతకీ అదొక్కటేగుర్రం.క్రమంగాఎదిగి,అది మంచి గుర్రంఅయింది. నేనుఇంతవరకు ఎక్కడా అటువంటిగుర్రంచూడ లేదు!ఒక జిల్లా వ్యవసాయపరిదర్శనంలో దానికిసర్టిఫికేటుకూడా వచ్చింది. అగ్రికల్చరల్ ఇనస్పెక్టర్లుచెప్పే విషయాలన్నీ శ్రద్ధగా విని, చేతనయినంతవరకు వాటిని ఆచరణలో పెడుతూ, దున్నడం, విత్తులు చల్లడం, ఊడ్చడం, అన్నీ సకాలంలోచేస్తూ, అతశ్రద్ధగా, వ్యవసాయంచేసేను. పంటవిషయంలో, నాచేలతరవాతే, మిగిలిన వాళ్ళవందరిపీకూడా. వేసవిలోనే మెత్తగానాలుగుచాళ్ళుతోలి అట్టేపెట్టి, తోలకరించగానే, విత్తులుచల్లేవాడిని, అందరికంటె ముందుగా. ఈప్రాంతాల్లో, నాకంటె బాగా వ్యవసాయంచేసే

వాడు లేను. వ్యవసాయశాఖవారు నా సామర్థ్యానికి మెచ్చుకొని సర్టిఫికేటు ఇచ్చేరు కూడాను. అది ఒకసారి చూడండి."

అతిథి, యాకోవులూకిచ్ చూపించిన వైపు చూసేడు. ఒక సిలువ ప్రక్కన అద్దము కట్టిన ఒక సర్టిఫికేట్ వ్రేలాడుతూంది. దాని దగ్గరే సోవియట్ కమేండరు వొరోషిలోవు ఫొటో ఉంది.

"ఆఁ—అదే, వాళ్ళు ఇచ్చిన సర్టిఫికేట్. నేను పండించిన గోధుమలు రాస్టోవులోని వ్యవసాయడిపార్టుమెంటు అధికారులు కూడా చూసి, చాలా మెచ్చుకున్నారు." లూకిచ్ సగర్వంగా చెప్పసాగేడు. "మొదట నేను తిరిగివచ్చిన కొత్తలో 12 ఎకరాలు మాత్రం వ్యవసాయం చేసేను. క్రమంగా 20, 40, 60, చివరకు 70, ఎకరాలవరకూ కూడా వ్యవసాయం చెయ్యగలిగేను. ఇంతభూమీ కూడా నేను, నా భార్య, కొడుకు, కోడలు, కలసి చేసేవాళ్ళం. అదునురోజుల్లో మాత్రం ఒకటి, రెండుసార్లు కూలివాడిని పెట్టేవాడిని. ఆరోజుల్లో సోవియటు ప్రభుత్వం ప్రతిరైతును ఎంత భూమి చెయ్యగలిగితే అంత, సేద్యం చెయ్యమని, ప్రోత్సహించింది. ఆరోజులలో అహర్నిశలు నిద్రాహారాలు కూడా మాని, యెంత కష్టపడి పనిచేసేనో ఆ భగవంతుడికే తెలియాలి. అలెగ్జాండర్ అనిసిమోవిచ్! మీరు నమ్ముతారో లేదో కాని - ఇప్పుడు చాలా భూమి సేద్యం చెయ్యడానికి భయంగా వుంది. ఎందుచేతంటారు? 70 ఎకరాలు దున్నుతే నన్ను కూడా కులకులలో జమకడతారు. మా సోవియటు అధ్యక్షుడు ఆండ్రీ రజ్మెట్నోవ్ మూలంగా వచ్చింది

ఈ చిక్కంతా. అతను 'యాకోవ్ లూకిచ్! నువ్వు ఎంత భూమి దున్నగలిగితే అంతా దున్ను. మన సోవియట్ ప్రభుత్వానికి ఇప్పుడు ఆహారపదార్థాలకి చాలా చిక్కుగా వుంది. నీ వంటి ఉత్సాహంగల రైతులే చెయ్యాలి ఏంచేసినా' అనేవాడు. 70ఎకరాల భూమీ స్వంతంగాచేసుకుంటూన్నా, నన్ను కులకుల్లోజమకట్టి సర్వనాశనంచెయ్యడానికి చూస్తూందీ సోవియట్ ప్రభుత్వం. ఆ భగవంతుడి ఆజ్ఞ ఎల్లావుందో తెలియదు."

"సమిష్టివ్యవసాయక్షేత్రాలలో చేరడానికి మీ వూళ్ళోవారెవరేనా ముందుకు ఉత్సాహంగా వస్తూన్నారా?" అని అడిగేడు అతిథిచేతులు వెనక్కి కట్టుకొని మంచందగ్గరనిలబడి.

"సమిష్టివ్యవసాయక్షేత్రంలోనా! ఇంతవరకుదాన్లోచేరమని వాళ్ళు బలవంత పెట్టడంలేదు మమ్మల్ని. కాని రేపుబీదకోసక్కులంతా చేరిమీటింగుచేస్తారుట. సాయంకాలం వాళ్ళందరితోను చెబుతూ వెళ్ళేరు. ఈవిషయాల్ని గురించి క్రిస్టమస్ పండుగుల నాటినుంచి చెబుతూనే వున్నారు, అందర్నీ చేరమని. కానిప్రతి వాళ్ళు మేముచేరం అంటే మేముచేరం-అన్నారు. ఎవడేనా తెలిసి కూడా గోతులో దిగుతాడా? వాళ్ళు మళ్ళీ ఏదో కొత్త యెత్తు యెత్తుతూన్నట్లుంది. పైనుంచియెవడో కొత్తవాణ్ణి తీసుకువచ్చేరు, మమ్మల్ని అందర్నీ సమిష్టివ్యవసాయ క్షేత్రాలలో బలవంతంగా చేర్పించడానికి. ఇది మా అంతానికే వచ్చింది. ఇంత కాలం కష్టపడి సంపాదించుకొన్న ఆస్తి-చూసీరా అస్తమానం పనిచెయ్యడం చేత

చేతులు ఎల్లా కాయలు కాచేయో- ఎడ్లు, ఆవులు, గుఱ్ఱాలు, కోళ్లు ధాన్యం, భూములు, చివరకు ఇల్లుకూడా వాళ్ళ కిచ్చేయవలసిందే. ఈవేళ ఆస్తి ఇమ్మన్నారు- రేపు పెళ్ళాన్నే ఇమ్మంటారు. ఏమంటారు- అలెగ్జాండర్ అనిసిమోవిచ్? మీరు చెప్పండి. పశువులు, గుఱ్ఱాలు, ధాన్యం మొదలైన నా ఆస్తి అంతా ఇచ్చేస్తాననుకోండి. ఇంకొకడు తన నల్లులుపట్టినపాత మంచం ఒకటిస్తాడు, అంతకంటె ఇతరమైన ఆస్తి ఏమీ లేదని. మేమంతా ఎంత ఆస్తి ఉంటే అంతా ఇచ్చి, వచ్చినలాభం సమంగా పంచుకోవాలి. ఇది న్యాయమేనా? దీనివలన నాకు నష్టంకాదూ? ఒకడు తన జీవితమంతా ధారపోసి 10 ఎకరాలకొండరి సంపాదించటానికి ప్రయత్నించవచ్చు. నేను నాకుఇష్టమైనమరియొక ......... ఇదిగో! మనంయెన్ని వాగినా లాభంలేదు. చూడండి!" లూకూచ్, ఫ్రీకెలుకో సేస్తారన్నట్లుగా అభినయించేడు. "ఇంకఆగొడవపక్కబెట్టి పెడదాం. ఇప్పుడేంచేస్తున్నారు, మీరు? ఏదేనా ఉద్యోగమా?"

అతిథి యాకోవ్ లూకుచ్ దగ్గరగావచ్చి పక్కనే బల్లమీద కూర్చునిసిగరెట్ వెలిగించేడు.

"లూకుచ్! నువ్వు నాకంతెనీలోపనిచేసేవు. ఎకటెరిండోనార్ నుంచి మనంవెనకతిరిగి పారిపోతూన్నప్పుడు సోవియటుప్రభుత్వాన్నిగురించి అక్కడికోసక్కులికి ఏమనిచెప్పేనో జ్ఞాపకం ఉందా? 'ఒరేయ్! కమ్యూనిష్టులుమిమ్మల్ని నేలపెట్టిరాసేస్తారు. జాగ్రత్త! వాళ్ళ చేతులలో పడితే మళ్ళీ తప్పించుకోవడము

అసంభవం. చెయ్యి కాలినతరువాత ఆకులుపడితే లాభంలేదు.' చిలకకిచెప్పినట్లు చెప్పేను." కొంతసేపు నిశ్శబ్దంగా ఉన్నాడు. ఎందుకో తనలో తనే నవ్వుకున్నాడు. "నేను ఎంత చెప్పేనో అంతా జరిగింది. మన సైన్యాలన్నీ చెదిరిపోయినా నేను 'నోవో రొసిస్కు' లోనే ఉండిపోయేను. మనకి సహాయం చేస్తామన్న వాలంటీర్లు, విదేశపభుత్వాలు కూడా దగాచేసేరు. అటువంటి పరిస్థితులలో మనం ఏంచెయ్యగలం? నెమ్మదిగా బోల్షివిక్ సైన్యాలలో చేరేను. నన్ను స్క్వాడ్రన్ కమేండరుగా నియమించేరు. పోలండు యుద్ధరంగానికి వెళ్ళేముందు, సైన్యాధికారులను పరీక్షించి, వారిలో ద్రోహులను తొలగించడానికి ఒక కమీషను ఏర్పాటుచేసేరు. ఆకమీషను నన్ను నాఉద్యోగాన్నుంచి తొలగించి, అరెస్టుచేసి, విచారణకి రివల్యూషనరీటిబ్యూనల్ కిపంపించింది. కామేడ్స్, బహుశా, నన్ను కాన్సన్ట్రేషను కాంపుకి పంపించడమో, కాల్చెయ్యడమో, చేసిఉందురు. ఎందుకో తెలుసునా? మా ఊరువాడొకడువచ్చి నాకు వ్యతిరేకంగా, 'పాటిలోక్ నుచంపిన హంతకులలో నేనుఒకడనని' చెప్పేడు. కాని విచారణకి తీసుకొనివెళుతూంటే, దోవలో తప్పించుకొని పారిపోయేను.......చాలాకాలం మారుపేరుతో, రహస్యంగా కాలక్షేపంచేసేను. 1923వసంIIలో మాఊరుచేరేను. నేనుఒక్క తెలివైనపనిచేసేను; బోల్షివిక్కు సైన్యాలలో కమేండరుగాపనిచేసినట్లు తెలియజేసేటందుకు వెనకటి డాక్యుమెంట్లన్నీ జాగ్రతచేసేను.

అప్పటినుంచీ, జీవితంనెమ్మదిగా ఒడుదుడుకులులేకుండాలాక్కొ-
స్తూన్నాను. క్రమంగానన్ను 'డావ్ ఛెకా' (గూఢచారిదళం) యొక్క రిజియనల్ పొలిటికల్ బ్యూరోలోకితీసుకున్నారు. కాని నెమ్మదిగా దానిలోనుంచితప్పుకొని స్కూలు మేష్టరుగా చేరేను. మొన్న మొన్నటిదాకా దానిలోనే ఉన్నాను. కానిఇప్పుడు... ...ఇప్పుడుచేసేపనివేరు. ఏదోపని మీదడస్టు-ఖోపరస్క జిల్లాకి వెడుతూన్నాను. పూర్వస్నేహితుడవు కనక ఒకసారి చూసివెడదం అని వచ్చేను."

"మీరు మేష్టరీచేస్తున్నారన్నమాట. అయితే-.—.-.— మీరు చాలా పుస్తకాలు చదివిఉంటారు. ప్రపంచవిషయాలన్నీ బాగా తెలుస్తాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలంటూ మొదలెట్టేరు వీళ్ళు; దీనిపర్యవసానం ఎల్లా తేలుతుందంటారు?"

"పర్యవసానం ఎల్లా తేలుతుందని అడిగేదేమిటి! కమ్యూనిజమే. మళ్ళీ ఎల్లాంటి కమ్యూనిజమో తెలుసునా? ఏమీ కల్తీలేనికమ్యూనిజం. కారల్ మార్క్సు కమ్యూనిస్టుమేనిఫెస్టో మొదలయినగ్రంథాలుచాలాచదివేను. సమిష్టివ్యవసాయక్షేత్రంఅనిచెప్పి చివరకేం చేస్తారో తెలుసునా? ఎవరికీకూడా స్వంతఆస్తిఅనేది లేకుండా ఒక్క పశువుల్నే కాదు, చివరకు నీపిల్లల్నికూడా తీసికొనిపోయి ప్రభుత్వమే పోషిస్తుంది. ప్రతివస్తువు సమాజపరమవుతుంది. పిల్లలూ, భార్యలు మొదలు ఇంట్లోవాడుకొనే ప్రతివస్తువుకూడా అంతే. నీకుఏపిండివంటయినా, ఏకోడిమాంసంకూరేనా, తినాలని

ఉన్నా కాని సాగదు. కలలో అంబలో, వాళ్ళు ఏది పెడితే అదితిని సంతృప్తి పొందాలి. ఏవిధమయినస్వతంత్రిమూ లేకుండా బానిసల లాగ చాకిరీచేస్తూపడిఉండాలి ”

“అదినాకుఇష్టంలేకపోతే?”

“ ‘నీకుఇష్టంఉందా? లేదా?’ అనిఅడిగి చెయ్యరువాళ్ళు ”

“అంటే?”

“నేను అన్నదే?”

“చాలాబాగుంది.”

“నేనోప్రశ్న అడుగుతాను. ఆవిధంగా నువ్వు జీవించగలవా?

“ఊహు — జీవించలేను.”

“అల్లాఅయినట్టయితే చేతులుముడుచుకొని కూర్చొని లాభం లేదు; ఆవిధానం నాశనంచెయ్యడానికి పోరాడాలి.”

“అలెగ్జాండర్! ఆప్రయత్నాలన్నీ ఇదివరకే అయేయి. ప్రాణాలకి తెగించి పోరాడేం.....దానివల్ల సాధ్యంకాదు. కలలో కూడా నమ్మను నేను.”

“ఇంకో సారి ప్రయత్నించిచూడు.”పాలోవిట్సీవ్,గడియా వేసి ఉన్న తలుపుకేసిచూసి, ఇంకాదగ్గరగా చేరేడు. “దీనిలో నువ్వు తప్పకుండాచేరుతావని నిన్నుకూడా లెక్ఖవేసుగున్నాము. మనఈ జిల్లాలోకోసక్కు_లంతాతిరుగుబాటుకితయారవుతున్నారు. ‘రెడ్ ఆర్మీ’లోపనిచేస్తూన్న సేనా నాయకులతోను, మాస్కోతోను, ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి. పెద్ద పెద్ద కర్మాగారాల

లో పనిచేస్తూన్న ఇంజనీర్లనుకూడ చాలమందిని మనవైపుకి తిప్పే సేము. ఇంతే కాదు .విదేశాలనుంచి మనకి కావలసినంత సహాయం వస్తుంది. మనంఅందరం దేశంనాలుగుమూలలా ఒక్కసారి తిరుగు బాటు లేవతీస్తే, విదేశప్రభుత్వాల సహాయంతో రేపు తొలకరి నాటికి డ్రాన్ పరగణాఅంతా ఒక్క కమ్యూనిస్టుకూడా లేకుండా చెయ్యగలం. నీభూమి నువ్వు స్వయంగా దున్నుకొని, స్వేచ్ఛగా జీవించగలుగుతావు. ఆగు; నేనుచెప్పడం పూర్తిఅయిన తరువాత మాట్లాడు. మనప్రద్యమంఅంటేఅభిమానంవున్న వాళ్ళు ఈజిల్లాలో అనేకమందివున్నారు. అటువంటివారినందర్నీ సుసంఘటితంచెయ్యాలి. నేను 'ఉస్టు-ఖొపరస్కు' జిల్లాకి వెళుతూన్నది అందుకోసమే. నువ్వుమాతో చేరుతావా? అప్పుడేమనజిల్లాలో 300మంది చేరేరు. దుబొవిస్కి, వైసోకివాయ్, టుబ్యాన్‌స్కో, మొదలయిన గ్రామాలలో మన సంఘానికి శాఖలు ఏర్పాటు అయేయి. ఈ వూళ్ళోకూడా అటువంటిసంఘశాఖ ఒకటి యేర్పాటుచెయ్యాలి. ఇప్పుడు చెప్పు-నువ్వు ఏమిచెప్పదల్చుకున్నావో."

"ఈవూళ్ళో సమిష్టివ్యవసాయక్షేత్రాల్లో చేరడానికి ఎవరికీ యిష్టంలేదు. ధాన్యపు..."

"ఒక్కసారిఆగు. ఇప్పుడు ప్రజలసంగతికాదు మనంమాట్లా డుతూన్నది; నీసంగతిచెప్పు."

"ఇటువంటివిషయం వెంటనే, ఏమీ ఆలోచించుకోనకుండా నిశ్చయించడం ఎల్లాగ? ఇదేమేనా సామాన్యవిషయం కనకనా!"

బీళ్ళుమన్నేరు.

"ఆలోచించు. ఒక్కసారిగానే అన్ని గ్రామాల్లోనూ కూడా తిరుగుబాటు లేవతీస్తాము. జిల్లాముఖ్యపట్టణం ముట్టడించి, మిలీషియాని, కమ్యూనిస్టుల్ని, వేరు వేరుగా యెదిరించి నాశనంచేసి, వశపరుచుకుంటాము. ఇంకమనకిఅడ్డేమీవుండదు."

"కాని మనకి ఆయుధాలు ఎక్కడినుంచివస్తాయి?"

"ఎక్కడినుంచో వస్తాయి. నీదగ్గరకూడా ఏమీ ఆయుధాలు లేకుండావుండవు."

"గుర్తుగా ఇక్కడెక్కడో పాతిపెట్టేననుకుంటాను. ఆస్ట్రియన్ మోడల్......"

"మనం ప్రారంభంచేస్తే చాలు, వారం రోజులలో విదేశాల నుంచి ఓడలమీద తుపాకులు, ఫిరంగులు కావలసినన్ని వస్తాయి. విమానాలు కూడాను, తెలిసిందా?"

"అయినా, నన్ను స్థిమితంగా ఆలోచించుకోనియ్యండి. వెంటనేచేరమని బలవంత......"

"సమిష్టివ్యవసాయక్షేత్రాల్లో చేర్చినట్లు బలవంతంగా ఎవర్నీ చేర్చడంలేదు మేము. చేరడం, చేరకపోవడం నీ యిష్టం. కాని, లూకుచ్! ఈవిషయం రెండోకంటివాడికి తెలియకూడదు సుమా!"

"నేను ఎవరితోనైనా చెబుతానని భయపడనక్కరలేదు. కాని, ఇది చాలప్రమాదకరమైన పని. అందుచేత సాధకబాధకాలు ఆలోచించుకొని మరీచేరుతానన్నాను. ఇంతకీ, నాకు ముసలితనం వచ్చింది." రెండు నిముషాలు మాట్లాడకుండా వూరుకున్నాడు.

"ప్రభుత్వం కనక భాగ్యవంతుల్ని మాటిమాటికి ఏదో రూపకంగా దోచుకోనకుండా వున్నట్లయితే, ఈ పాటికి ఈ వూళ్ళో వాళ్ళ అందరికంటె ధనవంతుణ్ణి అయివుందును. నేనొక్కడిని అందులోకి దిగుతే..."

"నువ్వొక్కడివే దిగడం ఏమి!" కెప్టెన్ లూకుచ్ మాటకి అడ్డం వచ్చేడు.

"సరే, నేను చేరుతాను బాగానే వుంది. కాని, మిగిలిన వాళ్ళ మాటేమిటి? వాళ్ళంతా కూడా ఈ వుద్యమంలో చేరుతారా?"

"ప్రజలంతా గొర్రెలమంద లాంటి వాళ్ళు. నడిపించే వాళ్ళు ఉండి, ఎల్లా నడవమంటే అల్లా నడుస్తారు వాళ్ళు. నీమాట ఖాయమేనా?"

"అలెగ్జాండర్! నా వుద్దేశం..."

"ఊరికే నీళ్ళు నమలక, అవును, కాదు, అని రెండు ముక్కల్లో తేల్చెయ్యి."

"ఆలోచించుకోనడానికి కొంచెం వ్యవధి యియ్యండి. ఏ సంగతి రేపు ఉదయం చెబుతాను."

"నీకు నమ్మకస్తులని తోచిన ఇతర కోసక్కులతో కూడ మాట్లాడు. సోవియటు ప్రభుత్వం మీద కసితీర్చుకోనడానికి ప్రయత్నిస్తూన్న వాళ్ళనందర్నీ నెమ్మదిగా చేర్చు" అంటూ పొలోవిట్సేవ్, అప్పుడే ఆజ్ఞలు ఇవ్వడం ప్రారంభించేడు.

"ప్రతివాడికీ సోవియటు ప్రభుత్వం మీద గుర్రుగానే వుంది."

"కాని నీకొడుకుమాటఏమిటి?"

"ఆవుతోపాటే దూడకూడా. నేను ఎటువైపుంటే మావా డుకూడా అటువైపే."

"అతనుమంచివాడేనా? మనంనమ్మవచ్చా?"

"ఆ విషయంలో మీరు సందేహించనవసరంలేదు. సరియైన కోసక్కు." అన్నాడు లూకుచ్ సగర్వంగా.

లూకుచ్ ఒక పెద్ద రగ్గు, దానిపైని ఒక గొర్రె చర్మం పరచి, పాలోవిట్సీవ్ కి ఒకమంచిగదిలో పక్క ఏర్పాటుచేసేడు. పాలోవిట్సీవ్ బూట్లనుమాత్రంతీసి, ఆ దుస్తులతోనే పడుకొని నిద్రపోయేడు.

మరునాడుదయం వెలుతురురాకముందే యాకోవ్ నిద్రనుండి లేచి, వరండాదగ్గర, ఒకచిన్నగదిలోనిద్రపోతూన్న ఎనుబదేండ్ల ముసలితల్లిదగ్గరకు వెళ్ళేడు. పాలోవిట్సీవ్ వచ్చినపనిని గురించి క్లుప్తంగాచెప్పేడు. ఆమె నిశ్శబ్దంగావింటూ కూర్చుంది.

"అమ్మా! నీ ఆశీర్వచనం కోసం వచ్చేను." అని సాష్టాంగపడి నమస్కారం చేసేడు.

"నాయనా! లే! శత్రువుల నెదిరించు. భగవంతుడు నీకు సహాయం చేస్తాడు. వాళ్ళు చర్చిలుకూడామూసేస్తూన్నారు...... మతగురువుల్ని వాళ్ళు బ్రతుకనిచ్చేలా లేరు.........వాళ్ళని నాశనంచెయ్యి"

ఆ రోజు ఉదయం యాకోవ్ అతిధినిలేపేడు.

"చేరడానికే నిశ్చయించేను. ఇకపైని నేను చెయ్యవలసిన పని ఏమిటి?"

"ఇది పూర్తిగా చదివి అడుగున దస్కతు చెయ్యి." పాలోవిట్స్కీవ్ లోపలి జేబులోనుంచి ఒక కాగితం పైకితీసేడు. యూశోవ్ ఆ కాగితం తీసుకున్నాడు.

"భగవంతుడు మన పక్షాన్ని ఉన్నాడు. కోసక్కునైన నేను నా జన్మభూమియైన డాన్ పరగణాను, దాస్యబంధముల నుండి విడిపించుటకు బద్ధకంకణుడనయితిని. క్రిస్టియన్ మత నాశకులును, రష్యను ప్రజాపీడకులును అయిన కమ్యూనిస్టు బోల్షివికులను నాశనముచేయుటకు, పై అధికారుల ఆజ్ఞల ప్రకారము నా సర్వస్వము ధారపోసి, కంఠములో కొనఊపిరి ఉన్నంతవరకు, పోరాడుటకు నిశ్చయించితిని. పై అధికారుల యొక్కయు సేనాధిపతులయొక్కయు, ఆజ్ఞలను సర్వవిధముల అనుసరిస్తాను. రష్యను సనాతన మాతృభూమియొక్క స్వాతంత్ర్య బలిపీఠముమీద నా సర్వస్వము అర్పణచేసెదను."



# నాలుగో ప్రకరణము.

## గ్రామ సమావేశము.

గ్రిమాచీలోని బీదకోసక్కులు, Active Workers కలసి మొత్తం 32 రు వరకు సమావేశమయేరు. అందరు నిశ్శబ్దంగా ఉన్నారు. డేవిడోవ్ గొప్ప వక్త కాకపోయినప్పటికి అతని ఉపన్యాసం మొదటినుంచీ, చాలా శ్రద్ధగా వింటూన్నారు.

"కామ్రేడ్స్! నేను 'రెడ్ పుట్టిలోవ్ వర్క్సు' లో పని చేసిన కూలీని. మన కమ్యూనిస్టుపార్టీ నన్ను ఈ ప్రాంతములో సమిష్టి వ్యవసాయ క్షేత్రములు నిర్మించుటలోను, జలగలవలె రక్తముపీల్చి, మనల్ని పిప్పిచేస్తూన్న భాగ్యవంతుల్ని నాశనము చేయుటలోను మీకు సహాయం చెయ్యడానికి పంపించింది. ఎక్కువగా నేను చెప్పవలసినది ఏమీ లేదు. మీరంతా ఒక సమిష్టివ్యవసాయక్షేత్రంలో చేరి భూమిని, పశువులు మొదలైన మీ ఆస్తిని సమాజపరం చెయ్యాలి. సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరడం ఎందుకు? ప్రస్తుతంవరకు మనం ఉన్న నికృష్టపరిస్థితులలో ఇంక ఉండలేంకనక. ఇప్పుడు మనం తిండి లేక ఎందుకు మాడవలసి వస్తూందో తెలుసునా? పండినపంట

అంతా కొద్దిమంది భాగ్యవంతులు పాతర్లువేసి ముక్కు పిండు తూన్నారు. వాళ్ళదగ్గిరనుంచి ఆపంట అంతా మనం బలవంతంగా స్వాధీనం చేసుకోనవలసివస్తూంది. ఇప్పుడున్న మన ఈ దరిద్రం పోవాలంటే ఇంకా ఎక్కువ భూములు దున్నాలి. కాని పూర్వకాలపు మొద్దునాగళ్ళతో ఇప్పటికంటె హెచ్చు భూమి దున్నడానికి అవకాశం ఉందా? లేదు. మరి, మనం ఏంచెయ్యాలి? ట్రాక్టర్లను ఉపయోగించాలి. ఇక్కడ మీ డాన్ ప్రాంతంలో ఒక్క అరకతో ఎంతభూమి సేద్యంచెయ్యకలరో నాకు తెలియదు ...”

“కట్టిన నాగలి విప్పకుండా, రోజంతా దున్నితే, 30 ఎకరాలవరకు వ్యవసాయం చెయ్యొచ్చు.” అని ఒక కులుకు సమాధానం చెప్పేడు.

“అబ్బా! 30 ఏకరాలే! గట్టిభూమిఅయితే!” అని ఇంకొక కోసక్కు అడ్డుప్రశ్న వేశాడు.

“అధమం 3 జతల ఎడ్లేనా ఉంటేకాని అంతభూమి దున్నడానికి సాధ్యంకాదు ఇక్కడ ఉన్నవాళ్ళలో ఒక్కడికి కూడా బలమైన ఒకజత ఎడ్లు లేవు. కొద్దిమంది భాగ్యవంతుల చేతుల్లో ఉన్నాయి అవి అన్నీ.” అంది ఒక ఆడది.

“అసలు విషయం అదికాదు! తెలియనిదే ప్రతీదానిలోనూ కలగచేసుకోక నోరుమూసుకో!” అన్నాడు ఒకకోసక్కు.

“నాకు కాదు, ఇంటికి వెళ్ళి నీ పెళ్ళానికి చెప్పు నోరుమూ

బీర్చుకున్నారు.

సుకోమని." ఆమె జవాబు చెప్పింది.

"ట్రాక్టరుతో మీరెంత దున్నకలరు?" అని అడిగేడు ఇంకొక కోసక్కు.

డేవిడోవ్ సద్దు అణిగేవరకు ఊరుకొని తరువాత "మన ప్యూటిలోవ్ వర్క్సులో తయారయిన ట్రాక్టర్లయినట్లయితే ఆ 30 ఎకరాలు ఒకరోజులో దున్నేస్తుంది." అన్నాడు.

సభ్యులంతా ఆశ్చర్యపడ్డారు.

"అబ్బా! 30 ఎకరాలే!" అన్నాడు ఒకకోసక్కు.

డేవిడోవ్ కంగారుచేత ఆరిపోయిన పెదవులు తుడుచుకొని మరల ప్రారంభించేడు.

"ఆ ట్రాక్టర్లని సాధారణ రైతులు ఎవరూ కొనలేరు. కొని నా ఉపయోగంకూడా ఉండదు. అందుచేత ఒక ట్రాక్టరు కొనాలంటే చాలమంది రైతులు కలసి కొనాలి. ఒకటి, రెండు ఎకరముల చిన్న చిన్న భూఖండాల్ని ట్రాక్టర్లతో దున్ని వ్యవసాయం చెయ్యడంవల్ల ఏమీ లాభంలేదు, పైగా వీలుకూడా లేదు. అది ఎంత సేపూ పెద్ద పెద్ద భూఖండాల్ని దున్నడానికే ఉపయోగిస్తుంది. బీదవాడికి ఏనుగును ఇస్తే ఎంత ఉపయోగిస్తుందో, అట్లే సాధారణ రైతుకి ట్రాక్టరుకూడా అంతే ఉపయోగిస్తుంది."

"అంతకంటెకూడా కనికిష్టం." అని వెనక బెంచీలమీదనించి ఎవడో బొంగురుగొంతుకతో అన్నాడు.

"అందుచేత ఇప్పుడు మనకర్తవ్యం ఏమిటి!" అని దేవిడోవ్ పైమాటలు ఏమీ వినిపించుకోకుండా, మొదలుపెట్టేడు. "కమ్యూనిస్టుపార్టీ, దేశములోని రైతులందర్నీ సమిష్టివ్యవసాయ క్షేత్రాలలోనికి ఆకర్షించి, వాటిద్వారా ట్రాక్టర్లను ఉపయోగములోనికి తెచ్చి. ప్రజల దరిద్రం పోగొట్టడానికి నిశ్చయించింది. కామ్రేడ్ లెనిన్ చచ్చిపోయేముందు 'దేశములోని రైతుల దరిద్రం పోవాలంటే సమిష్టివ్యవసాయ క్షేత్ర నిర్మాణం జరగాలి. లేకపోతే, రైతులు ఇంకా అధోగతిపాలవుతారు. కులకులు బీదరైతుల రక్తమాంసాలు పీల్చి పిప్పిచేస్తారు,' అని చెప్పేడు. అందుచేత మీరంతా లెనిన్ చూపించిన మార్గం అనుసరించాలి. కూలీలు బీదరైతులు కలసి సమిష్టివ్యవసాయ క్షేత్రాలు ఏర్పాటుచేసుకుంటే పెద్దరైతుల్ని అతిసులభంగా నాశనంచెయ్యగలుగుతారు. నేను చెప్పేదానిలో అతిశయోక్తి ఏమీలేదు. ఇక అసోసియేషన్ విషయంచూడండి. మన అసోసియేషన్ ఇంకా ప్రారంభస్థితిలోనే ఉంది. దానివల్ల నష్టమేకాని, లాభం ఏమీ రావడంలేదు. అందుచేత ఈ అసోసియేషన్, సమిష్టివ్యవసాయక్షేత్రంలో కలిపేస్తే వీలుగా ఉంటుంది. క్రమక్రమంగా సాధారణరైతులుకూడా ......"

"ఒక్కసారి ఆగండి— మీ మాటలకి అడ్డం వచ్చేను." అంటూ అసోసియేషన్‌లో పూర్వం సభ్యుడుగానున్న డీమ్కా ఉషాకోవ్ లేచాడు, మెల్లచూపు చూస్తూ.

చీల్చుతున్నారు.

"ముందు అనుజ్ఞతీసుకొని తరువాత మాట్లాడాలి. అంతే కాని ఎవరి ఇష్టంవచ్చినట్లు వారు లేచి మాట్లాడడానికి వీలు లేదు" అని డేవిడ్జోవ్ పక్కన కూర్చునియున్న నగుల్నోవ్ మందలించేడు.

"అడక్కుండా లేచి మాట్లాడుతూన్నందుకు క్షమించండి. అసోసియేషన్‌వల్ల నష్టమేకాని లాభంలేదని, మన సోవియట్లు ప్రభుత్వానికి ఇది గుదిబండలాఉందని, అంటే, అది ఎవరి లోపమంటారు? ముష్టివాళ్ళవలె మేము ప్రభుత్వం ఇస్తూన్న అప్పులవల్లనే బ్రతకడానికి కారకులెవరు! అసోసియేషన్ అధ్యక్షుడయిన అర్కాష్కాయే దీనికి ముఖ్యకారకుడు. ప్రతి చిన్నవిషయంలోను పికాలాడి బేరంచేసే అతని స్వభావమూ లాన్నే ఇంతవరకు వచ్చింది."

"మంచీ చెడ్డా లేకుండా నోటికి వచ్చినట్లల్లా పేలకు" అని హాలు మూలనుంచి ఒక కీచుధ్వని వినిపించింది. అర్కాష్కా, వంగి సభికుల్ని తప్పించుకుంటూ సభావేదిక దగ్గరకు దారి తీసేడు.

"అవసరం అయినట్లయితే ఆ విషయం రుజువు చేస్తాను." అని డెమ్కా ఎనుకున్నాడు. రజ్మెట్నోవ్ బల్లమీద గుద్దుతూ, గోలచెయ్యవద్దని సభికుల్ని కోరేడు. కాని ఆమాటలు వినిపించుకోకుండా డెమ్కా అర్కాష్కావైపు తిరిగేడు "లేవని బొంకుతే ఎక్కడికి పోతుంది— చేసినపని, 'చెరపడా

నికి చేటుపెయ్యాలు,' మావంటివాళ్ళు ఎంతమందిఉంటే మాత్రం ఏంలాభం, నీవంటివాడు ఉన్నతరువాత. మొదటి నుంచీకూడా అపోసిషన్ పాడుచెయ్యడానికే చూసేవు నువ్వు. మాతో ఎవరితోను ఆలోచించకుండా, ఆబోతును ఇచ్చేసి, ఎందుకూపనికిరాని మోటారుసైకిలు పుచ్చుకోలేదూ నువ్వు! గుడ్లుపెడుతూన్న జాతైన కోడిపెట్టల్ని అమ్మి వాటికి............"

"ఇందులో ఒక్కటీ నిజంలేదు. అంతా అబద్ధమే!" అని అర్కాష్కా తనని సమర్థించుకున్నాడు.

"మూడు గొర్రెల్ని, ఒక ఆవును ఇచ్చి, పాతబండి ఒకటి తీసుకోవడానికి కారకుడవు నువ్వుకాదూ! నువ్వు ఏ పని చేస్తే బాగుపడింది!" అంటూ డెమ్కా చప్పట్లు కొట్టేడు.

"ఏమిటిది; కోడిపుంజుల్లా అల్లా పోట్లాడుకొంటున్నారు!" అన్నాడు నగుల్నోవ్.

"కొంతసేపు మాట్లాడడానికి అవకాశం ఇయ్యండి నాకు." అని అర్కాష్కా వేదికదగ్గిర నిలబడి, ఎర్రటిగడ్డం గుప్పెటలోకి తీసుకొని, ఏదో మాట్లాడబోయేడు. ఇంతలో డేవిడోవ్ అతని మాటకి అడ్డంవచ్చి "డెమ్కా ఉషాకోవ్ మాట్లాడడం పూర్తిఅవనియ్యండి మధ్య అడ్డంరాక. సరే, బాగానే ఉంది. కామ్రేడ్స్! మీ దరిద్రం పోవాలంటే, సమిష్టివ్యవసాయక్షేత్రాల్ని నిర్మించి వాటిద్వారా............"

బీళ్ళుదున్నేరు.

"ఈ విషయమై మీరు ఇన్నిసార్లు చెప్పనవసరంలేదు. మనః పూర్వకంగా మేమంతా సమిష్టివ్యవసాయక్షేత్రాల్లో చేరుతాము." అన్నాడు తలుపు దగ్గర కూర్చున్న Red partisan పావెల్ లుబిష్కిన్.

"సమిష్టివ్యవసాయక్షేత్రాల్లో మేమంతాకూడా చేరడానికి సిద్ధంగా ఉన్నాము." అంటూ ఇంకొకడు లేచేడు.

"మనం ఇంతకిత్రమే సమిష్టివ్యవసాయక్షేత్రాలు ఏర్పరచుకొని ఉన్నట్లయితే, దరిద్రం ఇన్నేళ్ళ కాలం ఉంటుందా!"

"అయితే—ఒకటి ఉంది. దాన్ని సరియైన పద్ధతులమీద నడిపించాలి" అన్నాడు లుబిష్కిన్ గట్టిగా. అతడు కుర్చీలోనుంచి లేచి, తల మీది, నల్లటి ఉన్నిటోపి తీసి చేతితో పట్టుకొని, దగ్గరనున్న తలుపుని జేరపడ్డాడు.

"మీరు సోవియటు ప్రభుత్వం తరఫున, మాలో ప్రచారం చెయ్యడానికి వచ్చినట్లు తోస్తూంది. కాదూ? సోవియటుప్రభుత్వ నిర్మాణంకోసం పాటుపడ్డవాళ్లం-మేము అది పడిపోకుండా, సమస్తం ధారపోసి, దాన్ని నిలబెట్టినవాళ్ళం-మేము. సమిష్టివ్యవసాయక్షేత్రం అంటే మాకు తెలుసును. అది కావాలని కోరేవాళ్ళలో మేమే మొదటివాళ్ళం. మాకుకావలసిన యంత్రాలు ఇయ్యండి. ఇంక ఏమీ అవసరంలేదు." అతడు పిడికిలి బిగించి చెయ్యి పైకి ఎత్తేడు. "ట్రాక్టర్లవల్ల చాలా లాభం వుంటుందని మాకు తెలుసును. అయితే మాత్రం ఏం

లాభం! మాకు సరిపడినన్ని యంత్రాలు మీరు తయారు చెయ్యడంలేదు. అందుచేత వెనుకటిమాదిరిగానే ఒకచేత మేడి తోక పట్టుకొని, రెండవచేతితో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ జీవితాలు గడిపేస్తున్నాము. మీరు సమిష్టివ్యవసాయక్షేత్రాల విషయమై ఈ ఉద్యమం ప్రారంభించకముందే, రైతుల అభివృద్ధికి తగినంత శ్రద్ధ తీసుకొనవలసినదని సోవియటుప్రభుత్వాన్ని కోరుతూ ఒక మహజరు పెట్టేము. సోవియటు ప్రభుత్వం వచ్చిన తరువాతకూడ కొన్ని సం||ల వరకు మా పరిస్థితులు వెనుకటి మాదిరిగానే వుండేవి. ఇవ్వవలసిన పన్నులు ఇచ్చెయ్యడం— మా దరిద్రమూ, క్షేమమూ మిగలడం. ఎల్లకాలమూ ఈ విధంగానే వుండేటట్లయితే ఈ సోవియటు ప్రభుత్వం వచ్చిన లాభం ఏమిటి! అంతర్యుద్ధంలో మనం గెలిచేము. బాగానే వుంది; కాని తరువాత విషయం ఏమిటి? తిరిగి వెనుకటి మాదిరిగానే భూమి వున్నవాడు దున్నుకొని బ్రతకడం, లేనివాడు.........వాళ్ళంతా ముష్టికి బయలుదేరాలా! లేకపోతే, దుడ్డుకర్ర చేతపుచ్చుకొని, దారులు కాచి, సోవియటు ప్రభుత్వాన్నే దోచుకోవాలా! భాగ్యవంతులు వెనుకటి మాదిరిగానే భూములు అమరకముచేసుకొనియు, కూలీలనుపెట్టి పని చేయించుకొనియు జీవిస్తూన్నారు. 1918 వ సం||లో ఎంతో వ్యయప్రయాసలకోర్చి తీసుకొని వచ్చిన విప్లవానికి ఫలితం ఇదేనా? అసలు విషయం మీరు మరచిపోయినట్లుతోస్తూంది.

నేమనుకునే 'ఎందుకోసం ఇంతత్యాగం చేసేము.' అని అడుగుతే, శరీరంకూడా కదుపుకోనవలసిన అవసరంలేకుండా సౌఖ్యంగా జీవించే పెద్దపెద్ద ఉద్యోగస్థులు,—వారు చెప్పిన ప్రతిదానికి వంతతాళంవేస్తూ వారి దయ సంపాదించుకోవడానికి ప్రయత్నంచేసే భావదాస్యులు వెనక పకపక నవ్వుతూండగా —'దానిని గురించి మీరు అంతగా చెప్పవలసిన అవసరం లేదు. మాకు ఆమాత్రం జ్ఞానం వుంది' అని సమాధానం చెబుతారు మేము అటువంటివాళ్ళని అనేకమందిని చూసేము. క్రెడిటుమీద కాని, లేక ధాన్యం తీసుకొని కాని ఒక ట్రాక్టరు ఇవ్వాలండి. ఎటువంటిదో ఎరుగుదురా? ఇప్పుడు మీరు చెప్పేరే— అటువంటిది; ఒకటోరకం ట్రాక్టరు. ఇది మాకేమీ వుచితంగా ఇవ్వడంలేదు; ఎందుకో ఎరుగుదురా!" అంటూ అతను, చిరిగి మాసిపోయివున్న బ్రీజరుగుండీలు తీస్తూ తిన్నగా డేవిడోవ్ దగ్గిరకి వెళ్ళి, చొక్కా పైకిలాగి గడ్డంకింద నొక్కిపట్టి, పొట్టమీద, తొడలమీదనున్న పెద్ద పెద్ద గాయపుమచ్చలు చూపించేడు.

"ఈ గాయాలన్నీ నేను ఎందుకు తిన్నాననుకుంటావు!"

"నీకేమీ సిగ్గులేదూ? బ్రీజర్లు పూర్తిగా తీసిపారెయ్యి. కొంతకొంత తియ్యడం ఎందుకు." అంది డెమ్కా వుషాకోవ్ పక్కనే కూర్చున్న ఎనీషా కోపంగా.

"నీకు అల్లా బాగుంటే మొదటనే సలహా ఇచ్చి వుండవల

సింది; పాపం'" డెమ్యాన్ మెల్లిచూపువాస్తూ తిరస్కారంగా అన్నాడు

"ఎనీషా! అనవసరంగా వాగక నోరుముయ్యి! నా గాయాలు ఒక శ్రామికుడికి చూపించడానికి, సిగ్గుపడవలసిన పనిలేదు. ఈవిధంగానే జీవితం గడపవలసివస్తే గాయాలు కప్పడానికి ఈ చింకిరిగుడ్డలుకూడా వుండవు. ఇప్పటికే, గుడ్డలన్నీ చిరిగి పేలికలు అయిపోయేయి. పగలు ఆడపిల్లలు ఈ గాయపుమచ్చలూ, నన్నూ చూస్తే హడలిపోతారు. వెనక బెంచీలమీద నున్నవారు నవ్వడం మొదలుపెట్టేరు. సభలో గోల బయలుదేరింది. లుబిమ్కిన్ సభికులకేసి, తీవ్రంగా చూసేడు. క్రమంగా సభలో సద్దుమణిగింది.

"కాన్‌స్టిట్యూషనల్ డెమాక్రాట్లతో యుద్ధంచేసినది భాగ్యవంతులు, పేదలు, అనే రెండువర్గాలు వుండటానికేనా! భాగ్యవంతులు అజీర్ణంచేసేలాగ తెగతిని బలుస్తూంటే, గంజినీళ్ళకుకూడా ముఖంవాచి చస్తున్నాము కామ్రేడ్స్! ఇది అబద్ధమా? మకార్! నేను ఇల్లా నిర్మొహమాటంగా అంటున్నానని కష్టంగావుందా! సాధారణంగా ఎప్పుడో కాని నేను మాట్లాడనే మాట్లాడను. మాట్లాడడం అంటూ వస్తే ఇల్లాగే మాట్లాడుతాను."

"బాగానే వుంది. కానియ్యండి." డేవీడోవ్ తలవూపేడు.

"ఈ సం॥ నేను 8 ఎకరాల భూమిమాత్రం సాగుచేసేను

ముగ్గురు పిల్లలు, ఒక కుంటి చెల్లెలు, రోగిష్టిభార్యని నా ఒక్క చేతిమీదా పోషించాలి. రజ్మెటోస్నేవ్! ఈ సం॥ నేను ఇవ్వవలసినదంతా చెల్లించేసేను కాదూ!"

"ఆ— ఇచ్చేవు కాని— దాన్ని గురించి అంతగా పొగుడుకో నక్కరలేదు."

"పొగుడుకుంటే తప్పులేదు! పెద్దరైతు ఫ్రోల్ ఇచ్చేడా! సాధారణంగా ఇచ్చేరకం కాదు అతను."

"వినండి! వినండి!" అంటూ నకులోస్నేవ్ బల్లమీదగుద్దేడు.

"ఫ్రోల్ ఇవ్వవలసినదంతా ప్రభుత్వానికి చెల్లించేడా? చెల్లించలేదు"

"కోర్టువారు అతనికి జుల్మానా విధించి వసూలుచేసేరు." రజ్మెటోస్నేవ్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

అప్పుడు డేవిడోవ్ కు జిల్లా కమిటీ సెక్రెటరీమాట జ్ఞాపకం వచ్చి, "ఇప్పుడు వుండవలసింది, నవ్వు." అనుకున్నాడు.

"అయితేమాత్రం అతనికి పోయిందేముంది. మళ్ళీ తోలకరించగానే నాబోటివాళ్ళని నలుగుర్ని కూలికి పెట్టుకోవడానికి తయారవుతాడు." అంటూ లుబిష్కిన్ చేతిలోనున్న నల్లటి వున్నిటోపీ డేవిడోవ్ కాళ్ళమీద పడేసేడు. "సమిష్టివ్యవసాయ క్షేత్రాల్నిగురించి మాదగ్గిర వర్ణించడం ఎందుకు? ఈ భాగ్యవంతుల్ని అందరిని గొంతుకలు నులమండి— మేమంతా సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో చేరడానికి సిద్ధంగా వున్నాం. వాళ్ళ

సాధనసంపత్తి అంతా మాకియ్యండి. అప్పుడు మనం అందరం హెచ్చుతగ్గులు లేకుండా సమానంగా వుండేటందుకు అవకాశం కలుగుతుంది. అంతేకాని ఇప్పుడు ఓ వైపున మీరు వేదిక లెక్క నొంటుకలు పోయేటట్లు 'భాగ్యవంతుల్ని నాశనం చెయ్యాలి.' అని బల్లలుగుద్ది వుపన్యాసాలు ఇస్తూనేవున్నారు— అవతలవాళ్ళు రోజురోజుకు భాగ్యవంతులవుతూనే వున్నారు, మాబోటివాళ్ళందర్నీ కిల్చిపిప్పిచేస్తూ.."

"ఆ ఘోగ్రిల్ సంపత్తి అంతా మాకిచ్చినట్లయితే, నిముషంలో దానికి బదులు ఒక విమానం కొనుక్కొనివస్తాడు. అర్థాపాక్" అని డేమ్మాక్ అందుకున్నాడు.

"హా—హా—హా—హా"

"ఓ! అందుకేమీ సందేహంలేదు. అంతపని చెయ్యగలడు."

"చూసేరా! ఇంతమందిలో నన్ను ఎల్లా అవమానం చేస్తు న్నారో" అంటూ అర్నాక్ పాక్ లేచేడు.

"అబ్బా! ఊరుకోండి. చెవులు తడకలు కడుతూన్నాయి."

"ఒకరి తరువాత ఒకరు మాట్లాడకోడదూ— కుక్కల్లా పోట్లాడకపోతే?"

కొంతసేపటికి డేవిడ్సోన్ వాళ్ళని అందర్నీ మాట్లాడకుండా చెయ్యగలిగేడు.

"ఇదే మన పార్టీయొక్క నీతి." అన్నాడు అతడు. మీరు అందరు ఆనీతిని అర్థంచేసుకోలేక అనవసరంగా కంగారుపడు

తూన్నారు. భాగ్యవంతుల్ని అందర్నీ నాశనం చెయ్యండి! వాళ్ల ఆస్తిఅంతా సమిష్టివ్యవసాయ క్షేత్రాలకి దఖలు చెయ్యండి. ఏమోయ్! కామ్రేడ్ లుబిష్కిన్! టోపీ కేబుల్ క్రింద అనవసరంగా పారేశేవు. ఇంకా దాని అవసరం వుంది నీకు. భూములను అమ్ముకోనడం, కూలీలను పెట్టుకోనడం, ఇకపైని మనం ఎంతమాత్రం సహించి ఊరుకోకూడదు. మనం ఇంతవరకు మన అవసరంకోసం భాగ్యవంతుల్ని చూసీచూడనట్లు ఊరుకోనవలసి వచ్చింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకంటె వాళ్ళే ఎక్కువ పంట పండిస్తూన్నారు. కాని ఇకపైని వాళ్ళని అల్లా అని ఊరుకోకూడదు. గోటితో పోయేదాన్ని గొడ్డలితో నరకవలసివస్తుంది. ఈవిషయమై కామ్రేడ్ స్టాలిన్, సైద్ధాంతుల ఆస్తి అంతా లాగెయ్యండి. ఆ ఆస్తిఅంతా సమిష్టివ్యవసాయ క్షేత్రాలవశం చెయ్యండి.' అని చెప్పేడు. వీరంతా యంత్రాలు కావాలని ఆందోళన చేస్తూన్నారు. మన ప్రభుత్వం ఈ సంవత్సరం సమిష్టి వ్యవసాయాభివృద్ధికి 50 కోట్ల డాలర్లు మంజూరు చేసింది. ఈవిషయం మీకు తెలుసునా? ప్రస్తుతం మన కర్తవ్యం ఏమిటి? సమిష్టివ్యవసాయ క్షేత్రాలు నిర్మించడం. తరువాత, మనకి కావలసిన యంత్రసామగ్రికోసం ప్రయత్నం చెయ్యడం. కాని మీరు గుర్రాన్ని కొనకముందే జీను కొంటాం అంటూన్నారు. ఏం! నవ్వుతారెందుకు? నేను చెప్పేది అబద్ధమా!"

"లుబిష్కిన్ కి తడావిడి ఎక్కువ."

"మేమంతా సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో చేరుతాం"

"మా పేర్లు తీసుకోండి. మేమంతా ఇప్పుడే చేరుతాం."

"నడిపించేవాడు లేక ఊరుకున్నాం. లేకపోతే పెద్ద రైతుల్ని ఈపాటికే నాశనం చేద్దుం."

"సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేరదలచినవాళ్ళంతా చేతులు పైకి ఎత్తండి." అన్నాడు నగుల్నొవ్. 33 చేతులు లెక్కపెట్టేరు. పరధ్యాన్నంగా ఒకడు రెండు చేతులూ కూడా ఎత్తేడు పైకి.

ఉక్కభరించలేక దేవిడోవ్ కోటు విప్పి కుర్చీకెతగిల్చి, చొక్కా బొత్తాలు కూడ ఊడతీసి కోలుసమాలుతో విసురుకుంటూ, చిరునవ్వుతో, సభికులందరు నిశ్శబ్దంగా వున్న తరువాత మాట్లాడవచ్చునన్నట్లుగా చూస్తున్నాడు.

"మీ అందరికి వర్గచైతన్యం వుంది. బాగానే వుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో చేరడం ఒక్కటే మీ పని అనుకుంటున్నారేమో. అది ఒక్కటే కాదు. ఇంకా చాలాపని వుంది. మన సోవియటు ప్రభుత్వం బీద రైతులమీదనే ఆధారపడి వుంది. మీ అంతట మీరు సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో చేరడమే కాకుండా, 'చేరుదమా వద్దా' అని సంకోచిస్తూన్న బీద రైతుల్ని కూడా చేర్చవలసిన బాధ్యత మీమీదే వుంది."

"ఇష్టంలేనివాళ్ళని చేర్చడం ఎల్లాగ? వాళ్ళేం పశువులా ఏమిటి — ఇష్టం వున్నా లేకపోయినా మెడమీద కాడిపెట్టి

తోలడానికి!" అన్నాడు అర్కాష్కా.

"వాళ్ళకి నచ్చచెప్పి చేర్పించాలి. ఒక్కొక్కన్ని కూడా ఒప్పించి చేర్చలేకపోతే, మీకు ఎన్ని విషయాలు తెలిసివుంటేమాత్రం లాభం ఏముంది? రేపుకూడా మళ్ళీ ఒక మీటింగు ఏర్పాటు చేద్దాం. అప్పుడు సమిష్టి వ్యవసాయక్షేత్ర నిర్మాణం విషయంలో ఓట్లు తీసుకొనేటప్పుడు, అనుకూలంగా మీరు ఓటు చెయ్యడమే కాకుండా, మీ దగ్గరనున్నవారిని కూడా ప్రోత్సహించండి. ఇంక ఆ విషయం కట్టిపెట్టి పెద్దరైతులవిషయం ఆలోచిద్దాం. వాళ్ళనందర్నీ ఉత్తరకకేషియాలో ఎక్కడా వుండకుండా తరిమివెయ్యాలని ఒకతీర్మానం Pass చేద్దమా!"

"ఆ—మా అందరికి అంగీకారమే."

"ఈ చుట్టుపక్కల ఎక్కడా వుండకుండా తరిమెయ్యాలి"

"తరమడమే కాదు; తరిమినాశనం చెయ్యాలి." అని ఛలోక్తిగాఅని దేవిడోవ్ రజ్మెట్నోవ్ వైపు తిరిగి "కువ్వాల్లో వున్న పెద్దరైతుల జాబితా తయారుచేసి చదవండి. అప్పుడు 'వాళ్ళందరు పెద్దరైతులవడంచేత వారి ఆస్తులు జప్తుచేసి, దేశములోనుంచి వెళ్ళగొట్టాల'ని స్థిరపరుద్దాం." అన్నాడు.

అండ్రీ రజ్మెట్నోవ్, డాక్యుమెంటు కేసులోనుంచి ఒక కాకితం పైకితీసి దేవిడోవ్ చేతికిచ్చేడు.

"'ఫ్రోల్ డెమాస్కోవ్' మనం విధించబోయే శిక్షకి ఇతడు అర్హుడేనా?" అని అడిగేడు దేవిడోవ్.

వెంటనే అందరూ చేతులెత్తేరు. ఓట్లు లెక్క పెట్టేటప్పుడు ఎవరో చటుక్కున చెయ్యి దించెయ్యడం చూసి దేవిడోవ్ "దీనికి నువ్వు వ్యతిరేకుడవా?" అని అడిగేడు.

"నేను వోటు చెయ్యడంలేదు" అని కొంచెం అమాయకుడులా కనిపించే, ఆ చెయ్యి దించేసిన కోసక్కు జవాబు చెప్పేడు.

"ఏం? ఎందుచేత?" అని అడిగేడు దేవిడోవ్.

"అతడు మా ఇరుగుపొరుగువాడు. అప్పుడప్పుడు నాకు సహాయంకూడా చేస్తూంటాడు. అందుచేత అతనికి వ్యతిరేకంగా ఓటు చెయ్యడం నాకు ఇష్టంలేదు."

"వెంటనే సభలోంచి వెళ్ళిపో!" అంటూ నగుల్నోవ్ లేచేడు.

"కామ్రేడ్! అంత తొందరపాటు ఎందుకు! మీరు కూర్చోండి." అని దేవిడోవ్ అడ్డంవచ్చేడు. "వెళ్ళిపోకండి; ఇల్లారండి. మీ కష్టసుఖాలు పూర్తిగా తెలియచెయ్యండి. డెమాస్కోవ్ పెద్దరైతు అవునంటారా, కాదంటారా? మీ ఉద్దేశ్యం ఏమిటో చెప్పండి"

"మీరు చెప్పేది నాకేమీ అర్థంఅవడంలేదు. నేనేమీ చదువుకోలేదు. ఈసభలోనుంచి నన్ను వెళ్ళిపోనివ్వవలసిందని కోరుతూన్నాను."

"అల్లా కాదు. డెమాస్కోవ్ మీకు ఏవిధమైన సహాయం

చేస్తూన్నాడో చెప్పండి."

"దున్నుకోడానికి అప్పుడప్పుడు ఎడ్లని ఇస్తూంటాడు, అవసరమైనప్పుడు ధాన్యం బదులు ఇస్తూంటాడు. నావంటి వాడికి అంతకంటె కావలసినది ఏమిటి? కాని అంతమాత్రం చేత నేను దేశద్రోహిని కాను......... సోవియట్లమీద నాకు సంపూర్ణమైన అభిమానం వుంది."

"ఆయన తన తరఫున నిలబడమని మిమ్మల్ని అడిగేడా; ధన సహాయం కాని మరి యేతరయి సహాయంకాని చేస్తూంటాడా? మీరు భయపడవలసిన అవసరం లేదు. నిజం చెప్పండి"

ఇంతలో, రజ్మెటోన్నవ్ "డెమాస్కోవ్ ఏమి ఇచ్చాడో చెప్పెయ్యి." అని వెటకారంగా నవ్వేడు.

"అతను నాకేమీ ఇవ్వలేదు; ఇస్తానని వాగ్దానమూ చెయ్య లేదు. ఆ విషయం మీ అందరికి తెలియనే తెలుసును."

"టిమోఫీ! అబద్ధం ఆడుతూన్నావు నువ్వు. నీకు కొంత లంచం యిచ్చి అతని వైపు తిప్పగున్నాడు. అందుచేత నువ్వు అతనిని సమర్థిస్తూన్నావు." అని ఎవడో వెనకబల్లమీద కూర్చు న్నవాడు అందించేడు.

"మీ ఇష్టంవచ్చినట్లు అనండి........."

"ఏమండీ! మీరు సోవియటు ప్రభుత్వం తరఫునా, లేక భాగ్యవంతుల పక్షమా? ఒక్క ముక్కలో తేల్చెయ్యండి! బీదవాళ్ళలో పుట్టి అవర్గానికి అప్రతిష్టమాత్రం తేకండి"

"అనవసర విషయాలు చర్చించడంతో కాలం అంతా వృథా చేస్తూన్నారు." అంటూ లుబిష్కిన్ విసుక్కున్నాడు.

"ఒక జత పాతబట్టలు, తాగడానికి ఒక వోడ్కాసీసా, ఇస్తే మీపక్షానికి తిరుగుతాడు. టిమోఫీ! నిన్ను చూస్తే తల నొప్పి వస్తూంది నాకు."

టిమోఫీ బోర్షెవ్‌కి ఎటుతప్పించుకోడానికి అవకాశం లేక పోయింది. "నేను ఎప్పుడూకూడా ప్రభుత్వపక్షమే. కాని ఇందాకా పొరపాటుపడ్డాను."

తిరిగి రెండవపర్యాయం ఓట్లు తీసుకొన్నప్పుడు అతను కూడా చెయ్యి ఎత్తేడు; కాని అయిష్టత ముఖములో స్పష్టంగా కనిపిస్తూనే వుంది.

దేవిడోవ్ నోటుబుక్కు తీసి "టిమోఫీబోర్షెవ్ కూలీఅయి నప్పటికి భాగ్యవంతుల పక్షం. అతనిని ఒకకంట కనిపెట్టి చూస్తూండాలి." అని వ్రాసుకున్నాడు.

తరువాత మరినలుగురు పేర్లు చదివారు. సభికులందరు ఏక గ్రీవంగా వాళ్ళు 'భాగ్యవంతులని' ఓటు చేసేరు. దేవిడోవ్ మళ్ళీ చదివేడు:

"టిట్రాక్ బొరొడిన్"

"ఇతనికి అనుకూలంగా ఎవరేనా ఉన్నారా?" అన్నాడు.

"ఎవ్వరు మాట్లాడలేదు. రజ్మెట్నోవ్, నగుల్నోవ్‌లు ఒకరి ముఖంకేసి ఒకరు చూసేరు. లుబిష్కిన్ నుదుటిమీది చెమట

టోపీతో తుడుచుకుంటూ నిలబడ్డాడు.

"ఎవరిమటుకువాళ్ళే మాట్లాడక ఊరుకున్నారు ఎందుచేత?" అని దేవిడోవ్ సభికులందరి ముఖాలవంక కలయచూసేడు. కాని ఎవ్వరూ మాట్లాడకపోవడంచేత పక్కనఉన్న నగుల్నోవ్ కేసి చూసేడు.

"చూసేరూ!" నగుల్నోవ్ నిశ్చయంగా చెప్పడం మొదలెట్టేడు. "ఈ బొనోడిన్ — అతనిని సాధారణంగా మేము టిటాక్ అని పిలుస్తూంటాము. — 1918 వ సం||లో మాతో కూడ బోల్షివిక్ సైన్యాల్లో ఐచ్ఛికభటుడుగా చేరేడు. ఇతని తండ్రి ఒక బీద కోసక్కు. ఇతడు చాలా ధైర్యసాహసాలతో యుద్ధంచేసి చివరకు గాయపడ్డాడు. ఇతని ధైర్యసాహసాలకి మెచ్చి ప్రభుత్వం ఇతనికి ఒక వెండి గడియారం బహుమతిగా ఇచ్చింది. కామ్రేడ్! ఈవిధంగా ఇతడు అందరిచేత మంచి వాడని అనిపించుకున్నాడు. సైన్యము వదలి ఇంటికి వచ్చిన తరువాత, రాత్రింబగళ్ళు విడవకుండా కష్టపడి పనిచేసి క్రమంగా డబ్బు కూడబెట్టడం మొదలెట్టేడు. మేమందరం ఎన్ని విధాలచెప్పినా వినక, ఒంటిగుడ్డతో సం|| పొడుగునా కాలక్షేపంచేసి, క్షవరం చేసుకోవడానికైనా ఒక్క డబ్బు ఖర్చుపెట్టక పైస దగ్గరనుంచి కూడబెట్టడం మొదలెట్టేడు. అతనికి 3 జతల ఎడ్లు వున్నాయి. ముగ్గురు జీతగాళ్ళని పెట్టుకొని ఆ 3 జతల ఎడ్లతోటి రాక్షసుడిలా పనిచేసేడు. అతనికి ఒక చిన్న

మిల్లు ఉండేది. అది అమ్మేసి, పెద్దఇంజను ఒకటి కొని, నూనె మిల్లు నడిపించడమే కాకుండా, పశువుల వర్తకంకూడా సాగిస్తూండేవాడు. తను కడుపునిండా తిండి తినకపోవుట సరికదా- పైగా తన జీతగాళ్ళకికూడా జీతం ఇవ్వడానికి ముప్పతిప్పలు పెడతాడు. వాళ్ళచేత 24 గంటలుకూడ పని చేయించుగుంటాడు. అనేకసార్లు గ్రామసోవియటుసంఘం, కమ్యూనిస్టు పార్టీల ద్వారా చెప్పిచూసేము. కాని ఏమీ లాభంలేకపోయింది. 'టిటొ! ఈవ్యాపారం మానెయ్యి. మన సోవియటు ప్రభుత్వానికి అడ్డురాకు. అంతర్యుద్ధకాలంలో అనేక యుద్ధరంగాల్లో విప్లవద్రోహులతో యుద్ధంచేసి సోవియటు ప్రభుత్వానికి సహాయం చేసేవు. నీ వ్యాపారం మానకపోతే నీమీద చర్య తీసుకోవలసివస్తుంది....' అని అనేకసార్లు చెప్పేము. కాని ఇవిఏవీకూడా అతని తలకి ఎక్కలేదు. తెలిసియుండికూడా పెద్ద పులి నోట్లో చెయ్యిపెడతానంటూంటే ఏంచెయ్యాలంటే! మేము మళ్ళీ పిలిచి అంతర్యుద్ధంలో మేమనుభవించిన బాధలు, చేసిన త్యాగం అవీ చెప్పి, అతనితో చాలా తర్కవితర్కాలు చేసేము. అప్పటికీ వినకపోతే, తుదకు, 'పెట్టుబడిదారుడవయి, విప్లవస్ఫూర్తి లేకుడ నయేవంటే నాశనం చేసేస్తాము సుమా' అని కూడా బెదిరించేము. కాని ఏమీ లాభంలేకపోయింది."

"ఈ అనవసరపు గొడవఅంతా ఎందుకు?" అన్నాడు దేవిడోవ్ విసుటుతో.

"ముఖ్యవిషయాలే చెబుతూన్నాను. ఇంతకంటె తగ్గించి చెప్పడం నా సాధ్యంకాదు. ఇన్నివిధాల నచ్చచెప్పినా అతని బుద్ధికి ఎక్కలేదు. 'సోవియటుప్రభుత్వం, పంటలు వృద్ధి చెయ్యవలసిందని హెచ్చరిస్తూంది. ఆప్రకారమే నాశక్తి కొలది నేను పండించడానికి ప్రయత్నిస్తూన్నాను. అందువల్ల ఏమీ తప్పలేదు. కొద్దిమంది కూలీలనుకూడ పెట్టుకొనవచ్చునని ప్రభుత్వం అంగీకరించింది. నా భార్య ఆడవాళ్ళకు వచ్చు జబ్బుతో బాధపడుతూండడంచేత, కూలీలను పెట్టుకోవలసి వచ్చింది. మొట్టమొదట నేనూ దరిద్రుణ్ణే. క్రమంగా నా స్వశక్తిచేత ఆస్తి సంపాదించుకొన్నాను. పైగా నేను యుద్ధం చేసిందికూడా ఇందుకే. తీర్మానాలు Pass చేసి, కాకితాలు నలుపుచెయ్యడం తప్ప మీరు పీసం ఎత్తు పనేనా చెయ్యరు. నా వంటివాళ్ళు కష్టపడి పనిచేసి పంటలు పండించడంచేతనే ఇంత వరకు సోవియటు ప్రభుత్వం నిలిచి ఉంది. లేకపోతే యీపాటికే కూలిపోను." అని సమాధానం చెబుతూండేవాడు. అందు చేత ఇక గత్యంతరంలేక అతని ఓటింగుహక్కు తొలగించేము. వెంటనే అతడు జిల్లాఅధికారులకి, మాస్కోకి అర్జీలు పెట్టేడు. కాని అక్కడనున్న అధికారులందరూకూడ చిరకాలానుభవం కలిగిన బోల్షివికులవడంచేత, 'ఒకప్పుడు ఎంతత్యాగము, సేవ చేసి ఉన్నప్పటికి, వాడు ద్రోహం చేస్తే. శత్రువుగా పరిగణించి, వానిని దయాదాక్షిణ్యాలు చూడక అణిచి

వెయ్యాలి' అనే విషయం అనుభవంమీద తెలుసుకొన్నవాడు అవడంచేత, అతని అర్జీలన్నీ బుట్టదాఖలు చేసేరు."

"ముఖ్యమైన విషయాలు ఏవో చెప్పి ముగించండి."

"అయిపోవచ్చింది. వోటింగుహక్కు పోయినప్పటికీ అతను పూర్వపు పద్ధతులేమీ మార్చుకోలేదు. కూలీలను పెట్టుకోడం మాత్రం............."

"అసలు విషయం వదిలేసి ఈ అనవసరపు గొడవ అంతా ఎందుకు?" అని డేవిడోవ్ నగుల్నోవ్ కేసి చూసేడు.

"ఎవరినటుకువాళ్ళే, మాట్లాడక ఊరుకోడానికి కారణం ఇదే! టిటాక్‌ను గురించి మీకు అన్నివిషయాలు వివరంగా చెబుతూన్నాను."

డేవిడోవ్ పెదవులు బిగించేడు. ముఖం నల్లబడింది.

"ట్రాటీస్కని ఏం చేసేను చెప్పండి?— ఈ విషయాలన్నీ ఎందుకు చెప్పడం నాకు? అతడు ఒకప్పుడు గొప్పత్యాగం చేసేడు; మనం ధన్యవాదాలు అర్పించవలసిందే. కాని ఇప్పుడు భాగ్యవంతుడయేడు, దేశానికి ప్రజలకి శత్రువు అయేడు; అతన్ని నాశనం చెయ్యవలసిందే! ఈమాత్రం దానికి ఇంత ఉపోద్ఘాతం ఎందుకు?"

"కామ్రేడ్! ఇదంతా అతనిమీద జాలిచేత కాదు చెప్పడం. ............"

"బొరోడిన్ భాగ్యవంతుడవడంచేత, అతనిని నాశనం

చెయ్యడానికి అంగీకరించేవాళ్ళు ఎంతమంది?" దేవిడోవ్ సభికులవంక చూసేడు. నెమ్మదిగా, ఒకరి తరువాత ఒకరు—అందరూ చేతులెత్తేరు.

మీటింగు అయిపోయింది. దేవిడోవ్‌ను ఆ రాత్రికి తన ఇంటికి రమ్మని నగుల్నోవ్ పిలిచేడు. "రేపు ఉదయం మీకు బస ఏర్పాటు చేస్తాను." అన్నాడు నగుల్నోవ్, దేవిడోవ్‌తో కలసి సోవియట్ ఆఫీసు దాటి వెడుతూ. ఒకరిపక్క ఒకరు నెమ్మదిగా మంచుమీద నడిచి వెడుతూన్నారు. సన్నని స్వరంతో నెమ్మదిగా నగుల్నోవ్ చెప్పడం మొదలెట్టేడు.

"కామ్రేడ్! మీరు, భూమి అంతా కూడా సమిష్టివ్యవసాయక్షేత్రాల కిందికి తీసుకొని రావాలని చెప్పినప్పటినుంచి, నాకు చాలా ఉత్సాహంగా ఉంది. చిన్నతనం నుంచీ కూడా నాకు స్వంత ఆస్తి అంటే కిట్టదు. మార్క్సు, ఏంగిల్సులు చెప్పినట్లు. ఈ ప్రపంచములో ఈ దుస్థితికంతకీ, ఈ ప్రత్యేకపు ఆస్తే కారణం. సోవియటు ప్రభుత్వం వచ్చిన తరువాత కూడా ప్రజలు ఇంకా ప్రత్యేకపు ఆస్తులు పోగుచెయ్యడం మానడంలేదు. అదొక అలవాటైపోయింది. ఇప్పుడే ఇల్లా అనిపిస్తూంది. జారు ప్రభుత్వపు రోజుల్లో ఎంత ఘోరంగా ఉండేదో? ఆ విషయం తలుచుకోడానికి కూడా భయం వేస్తుంది. మాతండ్రి ఒక కోసక్కు. కుటుంబం చాలా పెద్దది. అంతా శ్రమపడి పనిచేసేవాళ్ళు. ఆ స్థితికూడా బాగా ఉండేది. 4 జతల ఎడ్లు

5 గుఱ్ఱాలు ఉండేవి. 300 ఎకరముల భూమి ఉండేది. పెళ్ళి అయిన అన్నగార్లు ముగ్గురు ఉండేవారు. ప్రత్యేకపు ఆ స్త్రీఅంటే అసహ్యం కలిగించిన ఆ విషయం ఇంకా జ్ఞప్తివుంది. ఒకరోజున మా పక్క ఇంటివాళ్ళ పందిఒకటి వచ్చి మా దొడ్లోపడి, బంగా శాదుంపలు బుడ్డగించి తినెయ్యడం మొదలెట్టింది. మా అమ్మ వచ్చి వడిగుమ్మముచాటున నిలబడి, నన్ను పందిని తోలమంది. నేను వెళ్ళి పందిని తరిమేను. అది పారిపోతూంటే మా అమ్మ సలసలాకుతున్న తాను దానిమీద పోసింది. అబ్బ! ఆతారు పడేవంతోటే, అంత మేర తొక్కు ఊడిపోయింది. అది వేసవి కాలం. క్రమంగా ఆపుండు పెద్దదై పుచ్చి, పురుగులు పట్టింది. ఆఖరికి అది చచ్చిపోయింది. మేము పందిని చంపేసినప్పటికి ఆ పంది స్వంతదారుడు మాట్లాడక ఊరుకున్నాడు. తరువాత ఒక వారంరోజులకి పొలంలో మా గడ్డివాము అంటుకొనిపోయింది. అది ఎవరు అంటించేరో మా తండ్రికి తెలిసింది. వెంటనే కోర్టులో దావా పడేసేరు. అదే పేచీలకి ప్రారంభం. ఒకరిని చూస్తే ఒకరికి కట్టేదికాదు. ప్రతిరోజు ఏదో ఒక చిన్నవిష యానికి దొమ్ములాడుకుంటూండేవారు. ఈవిధంగా 5 సం॥లు గడిచింది. ఒకరోజున, అకాత్తుగా అతని కొడుకుని ఎవరో పొడి చి చంపేసేరు. అనేక కారణాలనిబట్టి, ఆ చంపినవాళ్ళు మా అన్నలే అయివుంటారని ఊహించేను. పోలీసులు వచ్చి, ఆచోకీ తీసేరు. కాని ఏమీ తేలలేదు. అందుచేత తప్పతాగ్రి కొట్టు

కొనడంలో చచ్చిపోయేడని వ్రాసుకొని వెళ్ళిపోయేరు. కాని ఆరోజు మొదలు మావాళ్ళమీద నాకు అసహ్యం కలిగి, ఇల్లు వదలి వెళ్ళిపోయేను. ఒక మిల్లులో కూలీగా చేరి జీవితం గడుపుతూన్నాను. ఇంతలో యుద్ధంలో చేరవలసివచ్చింది. జర్మనులు ఎడతెరిపిలేకుండా కాలుస్తూన్న ఫిరంగిగుళ్ళు నాపక్కనపడి బద్దలై పొగలులేస్తూంటే, కందకాలలో నిలబడి 'ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని, ఇక్కడ నేను యుద్ధం చెయ్యడం ఎందుకు? ఇదంతా ఎవరి ఆస్తి రక్షించడంకోసం?' అని ఆలోచిస్తూండేవాడిని. అక్కడ యుద్ధరంగాలలో కూడ అనేకమంది, ఈ యుద్ధాలన్నీ ఎవరిలాభంకోసమో, ఈ యుద్ధాలు లేకుండా ఉండాలంటే ఏం చెయ్యాలో, బోధిస్తూండేవారు. అవి అన్నీ విని కొంతకాలానికి నేను బోల్షివిక్కుని అయిపోయేను. తరువాత అంతర్యుద్ధంలో అనేకమంది ద్రోహుల్ని ఈ చేతితో వెనక ముందు ఆలోచించకుండా చంపేసేను. చివరికి ఒక యుద్ధంలో దెబ్బతగిలి, అప్పటినుంచి మూర్ఛరోగం పట్టుకుంది. కాని, ఇది చూసేరూ." అంటూ ఒక పతకం చూపించేడు సంతోషంచేత కంఠం పులకించింది. "ఇది చూస్తే వెనుకటి అంతర్యుద్ధపు రోజులు జ్ఞాపకంవస్తాయి.

"అవును కాని— కామ్రేడ్! బొగోడిన్ను మీరు బాగా ఎరుగుదురా?"

"ఆహా ఎరగకేమి! మే మిద్దరం చాలా స్నేహంగా ఉంటూం

దేవాళ్ళం; కాని అతనికి ప్రత్యేకప్రటూష్ఠి అంటే విపరీతమైన ఆశ. అందుచేత ఆ విషయాన్ని గురించి మేము అస్తమానూ వాదోపవాదాలు చేస్తూండేవాళ్ళం. 1920 వ సం॥లో డోనెట్సుబేసిన్‌లో జరిగిన యుద్ధంలో వందలకొలది యుక్రేనియనులు చచ్చిపోయి గుట్టలు గుట్టలుగా పడిపోయిఉన్నారు. ఆరాత్రి టిటాక్ బస్తాలలో ఏవో కట్టి, తీసుకొనివచ్చేడు. అక్కడ ఆ బస్తాలన్నీ తెరగపోసేటప్పటికి తెగకొట్టిన 8 కాళ్ళు క్రిందపడ్డాయి. 'నీకేమీ మతిపోలేదుకదా!' అని అడిగేడు ఒక కామ్రేడ్. "వెంటనే వాటిని తీసుకొని అవతలికిపో!" అప్పుడు టిటాక్, 'చచ్చిపోయినవాళ్ళకి ఈ బూట్లు ఎందుకు ఉపయోగిస్తాయి? ఈ 4 జతల బూట్లు ఉంటే నాకు అధమం 10 సం॥లు అయినా గడిచిపోతాయి." అన్నాడు. అతడు ఆరాత్రి అంతా కూర్చుని స్టౌదగ్గర వాటిని వెచ్చబెట్టి జాగ్రత్తగా బూట్లుఅన్నీ విప్పి దాచుకొన్నాడు. ఆ కాళ్ళు తీసుకొనిపోయి గడ్డిక్రింద పారేసి తిరిగివచ్చి ఆ కాళ్ళన్నిటిని గొయ్యితీసి పాతిపెట్టేసని చెప్పేడు. ఈవిషయం నాకు అప్పుడే కనక తెలిసినట్లయితే వెంటనే కుక్కని కాల్చినట్లు కాల్చిపంపేసి ఉందును. అతని కామ్రేడ్లు ఆవిషయం చెప్పకుండా దాచేరు. తరువాత కొంత కాలానికి తెలిసి అతన్ని అడిగేను. అతడు 'ఆహా—నిజమే. ఇంకోవిధంగా బూట్లు వచ్చేలా కనిపించలేదు. చలిచేత ఆ కాళ్ళు బిగుసుకొనిపోయి ఉండడంచేత బూట్లు ఊడిరాలేదు. అందుచేత

తీర్చుమన్నారు.

నాకత్తితో కాళ్ళు తెగకొట్టి తీసుకొనిరావలసివచ్చింది. శుభ్రమైన బూట్లు వృధాగాపోతూంటే చూసి ఊరుకోలేకపోయాను అన్నాడు. ఇదిగో! ఇదే మాయిల్లు." నగుల్నోవ్ ఒక ఇంటి ఆవరణలోపలికి వెళ్ళి తలుపుతట్టేడు.



# అయిదో ప్రకరణము.

## ఆండ్రీ రజ్మటోవ్స్కీవ్.

ఆండ్రీ రజ్మటోవ్స్కీవ్ 1913 వ సంవత్సరంలో సైన్యంలో చేరేడు. అప్పటి నియమముల ప్రకారం సైన్యములో చేరు ప్రతికోసక్కు గుఱ్ఱమును, సైనికదుస్తులను తెచ్చుకొనవలసి వచ్చేది. కాని రజ్మటోవ్స్కీవ్ కడుబీదరికముండెను. తండ్రి చచ్చిపోయేటప్పటికి అతనికి సంక్రమించిన ఆస్తి అంతా, తుప్పుపట్టియున్న తాతలనాటి కత్తి ఒక్కటే. అందుచేత గ్రామస్తులంతా కలసి అతనిని కోసక్కు సంఘపు ఖర్చు మీద సైన్యములో చేర్పించుటకు నిశ్చయించి, ఒక గుఱ్ఱపుపిల్లను, దానిమీదికి కావలసిన సామాను, రెండు పెద్దకోట్లు, రెండుజతల ట్రౌజర్లు, బూట్లు కొనియిచ్చి "ఆండ్రీ! నిన్ను సైన్యంలోకి పంపించడానికి అయే ఖర్చుఅంతా మన సంఘం భరించి పంపిస్తూంది. తరతరాలనుంచి ప్రసిద్ధి చెందిన మన కోసక్కు పౌరుషం నిలబెట్టు. జారుచక్రవర్తి సేవలో ప్రాణాలు అర్పించడానికి కూడా వెనుతియ్యకు." అని చెప్పి పంపించేరు.

ఆండ్రీ సైన్యంలోచేరిన కొద్ది నెలలకే యుద్ధం ప్రారంభం అయింది. జారుచక్రవర్తియొక్క సామ్రాజ్యాన్ని విస్తరింప

చెయ్యడానికి,— కొద్ది జీతానికి జీవితమును అమ్ముకొన్న ఆండ్రీ- ఒక యుద్ధరంగంలోనుంచి మరియొక యుద్ధరంగంలోకి తిరుగుతూ, నిరంతరం యుద్ధం చేసేడు. ఆ యుద్ధములో అతడు చూపించిన సాహసానికి, 3 సెంటు జార్జిపతకాలు బహూకరింపబడ్డాయి. ఈ సెంటు జార్జిపతకాలకి ఇచ్చే అదనపు జీతం ఇంటికి పంపించేవాడు. ఆండ్రీ పంపించిన ఈ సొమ్ముతోనే అతని భార్య, ముసలితల్లి జీవితం గడపేవారు.

యుద్ధం సమాప్తి కావస్తూంది. ఆండ్రీ ఉన్న 11 వ డాన్ కొసక్కు రెజిమెంటు యుద్ధరంగమునుంచి వెనుకకు వచ్చి విశ్రాంతి తీసుకుంటూంది. ఆండ్రీ భార్య కూలిచేసి మిగుల్చుకున్న సొమ్ముతో టిక్కెట్టుకొని యుద్ధరంగంలో ఆండ్రీని కలుసుకొని అతనితో కొన్నిరోజులు సౌఖ్యంగా గడిపింది. ఆ రోజులు వారికి నిమిషాలవలె గడిచిపోయేయి. కొద్దిరోజుల తరువాత ఆమె స్వగ్రామం బయలుదేరి వెళ్ళిపోయింది. అక్కడ తొమ్మిది నెలలు నిండిన తరువాత వర్షకాలం వెళ్ళిపోయే ముందు సుఖప్రసవమై ఆండ్రీ పోలికగల కుమారుణ్ణి కంది.

1918 వ సం॥లో ఆండ్రీ స్వగ్రామమైన గ్రిమాచీలాగ్ కు తిరిగి వచ్చేడు. చిమికి పోతూన్న నాగలి మరమ్మత్తుచేసి, 5 ఎకరాల భూమి దున్ని, విత్తులు చల్లేడు. ఆపని పూర్తి అయిన తరువాత ఒక రోజు అంతా కొడుకుని ఎత్తుకుని ముద్దాడుతూ కాలక్షేపంచేసేడు. ఎప్పుడూ, తీక్ష్ణంగా ఉండే అతను కొంచెం

విచారంగా ఉండడం చూసి అతని భార్య "ఆంద్రీ! మళ్ళీ నన్ను ఒంటరిగా విడిచిపెట్టి, సైన్యంలోకి వెళ్ళిపోతున్నారా?" అని అడిగింది. "అవును, రేపు బయలు దేరాలి; దోవలో తినడానికి ఏదైనా చేసిపెట్టు" అన్నాడు.

ఆ మరువాడుదయం అతను, మకార్ నగుల్నోవ్, అటమాన్ రెజిమెంటులోని, లుబిష్కిన్, టిట్ బొరోడిన్, ఇంకా ఎనమందుగురు ఇతర కోసక్కులు కలసి అతని గుడిసెముందర సమావేశమయేరు. వారంతా గుర్రాలు ఎక్కి బయలుదేరి, గ్రామం దాటి గుర్రపుడెక్కల తాకుడుకు లేస్తూన్న ధూళిలో క్రమంగా అదృశ్యమైపోయేరు.

కొమన్‌షా దగ్గర ఆంద్రీ మిగిలి వాళ్ళతో విడిపోయేడు వొరోషిలోవ్ డివిజనులో పనిచేస్తూన్న మరియొకనితో కలసి. మరొజొవిస్కీ మీదుగా జారిట్జిన్‌కు వెళ్ళిపోయేడు. మకార్ నగుల్నోవ్, లుబిష్కిన్ మొదలైనవాళ్ళంతా 'వొరోనిజోజ్' వైపుకు వెళ్లేరు. మూడు నెలలు అయిన తరువాత ఒక షెల్లు బ్రద్దలయి ఆంద్రీకి చిన్న గాయం తగలడంచేత వైద్యశాలలో చేరవలసి వచ్చింది. అక్కడ అతని పరిచయస్తుడు ఒకడు కనిపించి, 'పొడిల్‌కోవ్' డిటాచ్‌మెంటు హతమైపోయిన తరవాత, గ్రిమాచీలాగ్‌లోని కోసక్కులు కొందరు, ఆంద్రీ బోల్షివిక్కులలో చేరినందులకు, అతని భార్య 'ఇవ్డోకియా' మీద భయంకర ప్రతీకారము సలిపేరనియు, ఆమె ఆ అపమా

సం భరించలేక ఆత్మహత్య చేసుకుందనియూ చెప్పేడు.

*   *   *   *

శీతకాలం డిశెంబరు నెల. పొగమంచు దట్టంగా వ్యాపించివుంది. గ్రిమాచీలాగ్ లోని ఇళ్ళు, చెట్లు, నేల, అంతాకూడా మంచుతో కప్పబడి ఎటుచూసినా తెల్లగా కనిపిస్తూంది గ్రామానికి వెనక కొద్దిదూరంలో ఉన్న గుట్టల వెనక యుద్ధం జరుగుతూంది. ఫిరంగుల మోత ప్రతిధ్వనిస్తూంది.... సాయంకాలం అయింది. నురగలు కక్కుతూన్న గుఱ్ఱాన్ని దౌడు తీయిస్తూ ఆండ్రీ గ్రామంలోకి వచ్చేడు. అతనికి ఈ రోజుకు కూడా కళ్ళకికట్టినట్లు ఆ వెనకటి సంగతులన్నీ.........కర్రలతో కట్టిన కడితలుపు విరిగిపోయింది. అతను ఒగరుస్తూ కళ్లెము బిగించి గుఱ్ఱమును ఆవరణలోపలికి నెమ్మదిగా పోనిచ్చేడు. అతని తల్లి గుడిసెలోనుంచి పరుగెత్తివచ్చింది.

విచారాన్ని వెలిగ్రక్కే, దిక్కులేని ఆ ముసలితల్లిని చూడగానే ఆండ్రీ కళ్ళనీళ్ళు తిరిగేయి.

“అన్నోయ్! ఆండ్రీ! అదిమనల్ని వదలిపెట్టి వెళ్ళిపోయిందిరా-నాయనా.........!”

ఆండ్రీ ఏమీ మాట్లాడకుండా గుఱ్ఱం దిగి, కళ్ళెం, దడి రాటకు చుట్టబెట్టి, తిన్నగా లోపలికి వెళ్ళేడు. లోతుకుపోయి నిర్జీవంగా వున్న కళ్ళతో వంటయిల్లు, ఉయ్యాల కలయచూసేడు.

“వంటిపిల్లాడేడీ?”

బట్టతో ముఖం కప్పుకొని అతని తల్లి వెక్కి వెక్కి ఏడవసాగింది.

"అసలు జరిగిన విషయం ఏమిటో చెప్పకుండా ఏడుస్తే ఎల్లాగ."

"ఒంటిపిల్లాడినేనా దక్కించుకో లేకపోయాను. ఎడ్డాకియా వచ్చిపోయిన వారంరోజులకి వాడుకూడా పారి వచ్చి చచ్చిపోయేడు."

"ఏడవకు......ఏం చేస్తాం......ఎడ్డాకియాను చెరిపిన వాడెవడు?"

"ఎనిమీడివ్యటిక్స్ క్రిందపడేసి ఈడ్చుకొనిపోయి...... చేతిలోనున్న కొరడాతో నన్ను కొట్టి బయటకి గెంటేసేడు, మిగిలిన వాళ్ళందర్నీ పిల్చేడు. తెల్లటి ఆ చేతులమీద, శరీరం అంతటాకూడా వాళ్ళ ఇష్టంవచ్చినట్లు కొట్టేరు. బయటికి వచ్చేటప్పటికి దెబ్బలచేత శరీరం అంతా కదుములు కట్టి నల్లబడి పోయింది......ఒక్క కళ్ళు......"

"వాడు ఇంటిదగ్గర ఉన్నాడా, ఇప్పుడు?"

"లేదు, పారిపోయేడు."

"వాళ్ళవాళ్ళెవరేనా ఉన్నారా ఇంటిదగ్గర?"

"భార్య, తండ్రి వున్నారు. ఆండ్రీ వాళ్లని చంపదు. ఎవళ్ళో చేసిన దానికి వాళ్లేంచేస్తారు......"

"నాకు నీతులు నేర్పుతూన్నావా, నువ్వు?" అన్నాడు కను

బొమలుముడేస్తూ. కోపంచేత శరీరం వణికింది. తొడుగకొని యున్న పెద్దకోటు, షర్టు లాగిపారేసేడు. పక్కఎముకలన్నీ బయాలుపడి వున్నాయి. మనిషి పాలిపోయేడు. నడుముని కిగించబడియున్న తాబేటికాయ తీసి అంచు కరిచి పెట్టి నీళ్ళు తాగి లేచేడు. తల్లివైపు తిరగకుండగనే "అమ్మా! చచ్చిపోయీ ముందు నాతో ఏమైనా చెప్పగుందా?" అని అడిగేడు.

ఆమె ఒక మూలకు వెళ్ళి, క్రీస్తు శిలువ వెనుకనుంచి ఒక చిన్న కాగితంముక్క తీసుకొనివచ్చి ఇచ్చింది.

"నా ప్రియమైన ఆండ్రీ! ఆ దుర్మార్గులు నన్ను అతి ఘోరంగా హింసించేరు. మీమీద నాకుగల అచంచల ప్రేమ చూసి సహించలేక ఆవిధంగా ప్రతీకారంచేసి తృప్తిపొందేరు. బహిరంగంగా, అందరిలోనూ.........తలుచుకుంటే ఒళ్ళు గగుర్పొడుస్తూంది....... భయంకరమైన అవమానం పొంది ఇంకా జీవించడానికి నాకు ఇష్టంలేదు. ఆండ్రీ! ఈ రాత్రులన్నీ కంటిమీద కునుకేనా లేకుండా ఎంతవిచారించానో ఆ భగవంతుడికే తెలుసును. కన్నీళ్ళతో తలగడా అంతా తడిసిపోయింది. మీరాకకి ఎదురుచూస్తూ, రోజులు లెక్కపెడుతూ, అనేకవిధాల ఆలోచిస్తోండేదానిని. కాని ఆఆలోచనలన్నీ ఆలోచనలుగానే ఉండిపోయేయి. మళ్ళీ ఈ కళ్ళతో మిమ్మల్ని చూస్తాననే ఆశ పోయింది. మన ఇరువురం సౌఖ్యంగా గడిపిన ఆరోజులు, ఈలోకంలో కాదు సరిగదా పరలోకంలోకూడ

మరుపురావు. ఇక్కడ నేను విచారపడవలసినవాళ్లు ఎవరూ లేరు— మీరు, మన బిడ్డ తప్ప. కొద్దికాలమైనా మన ఇద్దరం కలిసి సుఖంగా గడపలేకపోయేమని మాత్రం నాకు మనస్సు బాధిస్తూంది. కాని, అయిపోయిన దానికి విచారిస్తే ఏం లాభం? మీరు మళ్లీ పెళ్ళి చేసుకొన్నట్లయితే, మన బిడ్డనిమాత్రం జాగ్రత్తగా చూడమని చెప్పండి. ఈ దిక్కులేని బిడ్డని మీరు ఎల్లా చూస్తారో! నా బట్టలు మా చెల్లెలికి ఇయ్యమని చెప్పండి మీ అమ్మతో. అది ఈమధ్య పెళ్ళిచేసుకొంటే, అవసరం అవుతాయి.........."

ఆండ్రీ వెంటనే గుఱ్ఱంమీద పడి డెవ్యాట్కిన్ ఇంటివైపుకి పరుగెత్తేడు. అక్కడ గుఱ్ఱం మీదనుండి ఉరికి, కత్తిదూసి ఇంట్లోకి జొరబడ్డాడు. తల నెరిసి, గడ్డికూడా కొంచెం వంగియున్న డెవ్యాట్కిన్ తండ్రి, ఆండ్రీని చూడగానే భయంచేత కాళ్లు తడబడ్డాయి. నిలువునా క్రిందకూలబడ్డాడు.

"ఆండ్రీస్టిఫినోవిచ్" అంటూ, అతను ఆండ్రీపాదాలముందు నేలమీద ఒరిగేడు.

"నీ కొడుకు చేసినదానికి ప్రతిఫలం నువ్వు అనుభవిద్దువుగాని! ఎవ్వడొచ్చి నిన్ను రక్షిస్తాడో చూస్తాను. నీ క్రీస్తుని ప్రార్థించుకో" అని గర్జిస్తూ, ఎడమచేతితో ఆ ముసలివాని జుట్టుపట్టుకొని బరబరా లోపలికి ఈడ్చుకొనిపోయేడు. ఈ గందరగోళం అంతా చూచి అతని భార్య పొయ్యి దగ్గర సొమ్మ

సిల్లి పడిపోయింది. అనికీ డెవ్యాట్కిన్ భార్య మాత్రం ఏడుస్తూ, పక్కనే వున్న పిల్లల్ని అందర్నీ రెండుచేతులతోను పోగుచేసి, ఆండ్రీ ఉన్నచోటికి పరుగెత్తుకొని వచ్చింది. ముసలివానిని చం పెయ్యడానికి ఆండ్రీ కత్తి ఎత్తేడు. ఇంతలో చీమిడికారుతూ వడ్డిఓడుతూన్న పిల్లలు ఏడుస్తూవచ్చి ఆండ్రీ కాళ్ళమీద పడ్డారు.

"వాళ్ళందర్నీ కూడా చంపిపారెయ్యి. వాళ్లంతా ఎవరి పిల్లలే! వాళ్లతోపాటు నన్నుకూడా చంపిపారెయ్యి" అని భార్య ఏడుస్తూ, చొక్కాబొత్తాలు లాగిపారేసి, ఎండిపోయి వేళ్లాడుతూన్న గుండెలతో తిన్నగా ఆండ్రీ దగ్గిరికి వెళ్లింది. చిన్నా, పెద్దా—పిల్లలందరు ఏడుస్తూ ఆండ్రీ కాళ్లకి చుట్టుకున్నారు. ఆండ్రీ చేతిలోనున్న జుట్టు వదలి వెనకకు తప్పుకున్నాడు కత్తి ఒరలోపెట్టి, తూలుతూ వాకట్లోకి వచ్చేడు. డెవ్యాట్కిన్ తండ్రికూడ, కళ్ల నీరు కారుస్తూ వచ్చి. ఆండ్రీ కాళ్లమీద పడ్డాడు. ఆండ్రీనిరసనతో వెనుకకు తప్పుకొన్నాడు.

"అదృష్టం బాగుంది.........ఆ పిల్లలు......"

తరువాత మూడురోజుల వరకు ఆండ్రీ ఇంట్లోనుంచి బయటకు రాలేదు. ఏడుస్తూ. వోడ్కా తాగుతూ, మతిపోయిన వానివలె, అల్లాగే పడివున్నాడు. రెండవరోజు రాత్రి, ఎద్దోకియా ఉరిపెట్టుకొని చచ్చిపోయిన పాక అంటించేసేడు. నాలుగవ రోజున, వాడిపోయి, వికారముగానున్న ముఖముతో వచ్చి

తల్లిదగ్గర సెలవు తీసుకొన్నాడు. ఆమె కొడుకు తల గుండెల కదుముకొని రెండు అశ్రుబిందువులు రాల్చింది.

రెండు సం॥లు అయిన తరువాత ఆండ్రీ పోలిషు యుద్ధరంగం నుంచి ఇంటికి తిరిగి వచ్చేడు. ఒక సం॥పాటు ఎగువ డాన్ పరగణాలో ఆహారపదార్థాలు పోగుచేసే దళంలో చేరి తిరిగేడు. అక్కడినుంచి ఇంటికి వచ్చిన తరువాత వ్యవసాయం చేసుకుంటూ, అక్కడే ఉండిపోయేడు. తల్లి ఎన్నిసార్లు, పెళ్ళి చేసుకోమని చెప్పినా, ఏమీ సమాధానం చెప్పకుండా ఊరుకొనేవాడు కాని చివరకు ఒకరోజున నిర్బంధించి అడిగింది.

“ఆండ్రీ! ఇంక నువ్వు పెళ్ళి చేసుకొనకపోతే వీలులేదు. నాకు — వెనకటి బలంలేదు. ఇక్కడ చెంబు అక్కడ పెట్టలేకుండా ఉన్నాను. నీవంటివాడిని పెళ్ళిచేసుకొనడానికి ఎవళ్ళు ఇష్టపడరు! ఎవర్ని పెళ్ళిచేసుకోవాలని ఉందో చెప్పు!”

“నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు. ఇంతటినుంచి ఆ మాట నాదగ్గిర తలపెట్టకు.”

“ఏమాట అంటే అదేకాని, కొంచెం ఆలోచన మంచి, చెడ్డ, ఏమీ లేవాఏమిటి! చూడు! జుట్టు అప్పుడే ఎల్లా నెరిసిపోతూందో! ఇంకా ముసలితనం వచ్చిన తరువాతా ఏమిటి పెళ్ళి చేసుకొనడం! పెద్దవాళ్లు ఎందుకు చెబుతున్నారో అని కొంచెం ఆలోచించాలి. ఎన్నాళ్లనుంచో మనమల్ని ఎత్తుకోవాలని ఉంది. కాని ఆమాత్రం మొహమూనాది! మనమలకి ఉంటాయని, పే

జోళ్లు కుట్టి సిద్ధంచేస్తూన్నాను. వాళ్లకి నీళ్లుపోయ్యడం అంటే సరదా నాకు. ఈ ఆవుని పాలు పితగలేక చస్తూన్నాను. కోడలు వస్తే ఈ భారం తగ్గుతుందని చూస్తూన్నాను." అని కళ్లనీళ్లు పెట్టుకుంది. "ఏం పుణ్యంచేసుకుంటే దొరికేడో ఇంత చెప్పిన వినని కొడుకు! వేపుకు తినేస్తూన్నాడు. ఎన్ని చెప్పినా జెల్లం కొట్టిన రాయిలా మాట్లాడడు."

ఆండ్రీ టోపీ తీసుకొని ఇంట్లోంచి వెళ్లిపోయేడు. అతని తల్లి అంతటితో ఊరుకోక. ఇరుగుపొరుగు ఇళ్లకు వెళ్లి వాళ్ళతో చెప్పడం మొదలెట్టింది.

"ఎవ్డోకియా పోయింది. ఇంక నేను ఎవరినీ పెళ్లిచేసుకోనదలుచుకోలేదు." అని ఆండ్రీ తల్లితో ఖండితంగా చెప్పేసేడు. అందుచేత క్రమంగా ఆండ్రీమీది కోపం, చచ్చిపోయిన కోడలుమీదికి తిరిగింది.

"ఆ ముండ మావాడికి మందుపెట్టింది. ఉరిపోసుకొని, బలవంతంగా చచ్చి, పిశాచమై మావాణ్ణి పీక్కుతింటూంది. ఇంక ఎవరినీ, పెళ్లిచేసుకోనంటాడు. తల్లిప్రాణాన్ని నేను బ్రతికి ఉండి, వాడు ఒంటరిగా వుంటూంటే చూస్తూ ఊరుకోగలనా! మీరు చెప్పండి! మొన్న నా కళ్ళ ఎదుట ఎదిగి వాళ్ళంతా, మనమల్ని, మునిమనమల్ని ఎత్తుగుంటూన్నారు. ఇన్నేళ్లు వచ్చినా నాకు మనుమలు లేకపోవడంచేత నలుగురిలోను తల ఎత్తుకొని తిరగడానికి సిగ్గేస్తూంది. ప్రతీవాళ్లు, చిలకల కదు

పులా ఉండడం ఏమిటి— నేనొక్కతెను, తోడు దిక్కూ నా లేకుండా ఒంటెర్రిబుడతలా వుండడం ఏమిటి! నా ఖర్మం కాకపోతే!" అని కనిపించిన వాళ్లతో అందరితోనూ చెబుతూండేది.

ఆ సం॥మే ఆండ్రీ, నొవొచెర్కాస్ యుద్ధంలో చచ్చిపోయిన సార్జెంటు 'మైకేల్ పొయార్కొవ్' భార్యతో తిరగడం మొదలెట్టేడు. అప్పటికి ఆమెకి 40 ఏళ్లు నిండాయి కాని దృఢమైన శరీరము, అందమైన ముఖము చూస్తే, అంత వయస్సు వున్న దానివలె కనిపించదు.

అక్టోబరు నెలలో ఒకరోజున ఆండ్రీ ఆమె ఇల్లు వేస్తూన్నాడు. సాయంకాలం. మసక చీకటివేళ ఆమె అతనిని ఇంట్లోకి పిలిచింది. త్వరగా ఒక కప్పు సూప్ తీసుకొనివచ్చి అతనిదగ్గర టేబిలుమీద పెట్టింది. బుటేదారిపని చేసిన శుభ్రమైన తుండుగుడ్డ ఒకటి తీసుకొనివచ్చి అతని తొడలమీద కప్పి, యెదట మరొక కుర్చీలో కూర్చుంది. ఆండ్రీ సూప్ తింటూ, తుమ్మెద రెక్కల్లా నల్లగా, దట్టంగా ఉన్న ఆమె జుట్టు, అందమైన ఆమె ముఖం చూడడం మొదలెట్టేడు. ఆమె కూడా తదేక దృష్టితో ఆండ్రీకేసి చూస్తూ, "ఇంకొంచెం తీసుకురానా?" అని అడిగింది.

"నాకోసం అనవసరంగా శ్రమపడుతూన్నావు" అని మీసం సవరించుకొని, మళ్ళీ సూప్ తినబోతూన్నాడు. మెరీనా అత

బిక్కుదున్నారు.

నికి ఎదురుగా కూర్చుని ఆండ్రీవైపు చూస్తూంది. ఆమె చూపుల్లో ఒకవిధమైన ఉద్వేగం, ఆశ కనిపిస్తూన్నాయి. ఆండ్రీ, తెల్లటి ఆమె మెడమీద, రక్తనాళాలు ఉబికి వుండడం చూసేడు. అతని మనస్సుకి ఏమి తోచిందో, వెంటనే స్పూన్ అక్కడ పెట్టేసేడు.

“అదేమిటి!” అంది ఆశ్చర్యంతో.

“ఏమీ లేదు. కావలసినంత తిన్నాను ఇంక అక్కరలేదు. రేపు ఉదయాన్నే వచ్చి మిగిలిన పని పూర్తి చేసేస్తాను ”

మరీనా చిరునవ్వు నవ్వుతూ లేచి, అతనిదగ్గరకు వచ్చి, వెనకనుంచి అతనిమీదకు వంగి,

“నీకు ఇష్టంఅయితే ఈ రాత్రికి నాతోకూడ ఇక్కడ ఉండకూడదు!” అంది నెమ్మదిగా.

“ఉంటే, ఉండచ్చు. దానికేం.”

“నాకోరిక నువ్వు అంగీకరిస్తావనుకోలేదు.......” అంటూ ఆమె పక్కనే వెలుగుతూన్న కొవ్వవత్తి ఆర్పేసి, పక్క సవరించి, వీధితలుపు ఘడియ వేసింది.

“నీలో కోసకు లక్షణాలేవీ లేవు. వట్టి పిరికివాడవు.”

“ఏం, అల్లా అంటున్నావేమి!” అన్నాడు ఆండ్రీ, కొంత వరకు విప్పినబూట్లు వదిలేసి,

“నేను చెప్పేదాల్లో అబద్ధం ఏమీలేదు. నువ్వు అందరివలెనే మామూలుగానే ఉన్నావు; అందుకేమీ లోపంలేదు. కళ్లలో

కూడ చురుకుదనం కనిపిస్తుంది. కాని ఆడవానిదగ్గిర కూడా నీ కోరిక వెల్లడించలేనంత పిరికివాడవు. ఇంత పిరికివాడవు నువ్వు యుద్ధంలో సెంటు జార్జి పతకాలు సంపాదించేవంటే ఆశ్చర్యంగా ఉంది." అంది అస్పష్టంగా— తలపిన్నులు పళ్ళతో పట్టుకొని జుట్టు దువ్వుకుంటూ "మా మిష్కా-ని ఎరుగుదువా నువ్వు? నా కంటె కొంచెం పొట్టి. నువ్వు సరిగ్గా నాయెత్తే వున్నావు. అయితే... అంత సాహసం యెక్కడా చూడం. అతన్ని నేను ప్రేమించింది కూడా అందుకే. పేచీ వచ్చిందంటే వెనక తియ్యడంఅంటూ లేదు— ఎదటివాడు ఎంతబలమయినవాడయినా! చివరకి ఆ చొరవే ప్రాణాలు తీసింది."

మెరీనా భర్తతో కలిసి సైన్యంలో పనిచేసి, అతని చావు స్వయంగా చూచిన కోసక్కులు చెప్పిన విషయాలన్నీ ఆంద్రీకి జ్ఞాపకం వచ్చేయి. అతడు తన అధీనములోనున్న కొద్దిమంది సైనికులతో, బోల్షివిక్ కాపలా సైనికులమీద అకాత్తుగా దాడులు సలుపుతూండేవాడు. ఒక దాడిలో బోల్షివిక్ కాపలా సైనికులు లూయిస్ మరఫిరంగితో వాళ్ళని చెదరగొట్టి, తరిమి పట్టుకొనడానికి నలుగురు ఆశ్వికుల్ని పంపించేరు ఆ గందరగోళములో మిగిలిన సైనికులనుంచి, మైకేల్ షాయాకోవ్ విడిపడి పోయేడు. వెనకనుండి తరుముకొని వస్తూన్న నలుగురు బోల్షివిక్ సైనికులలో ముగ్గురిని కాల్చి చంపేసేడు. వెనకనుంచి వాళ్ళు కాలుస్తూన్న గుళ్ళు తగలకుండా అతి చాకచక్యంతో

గుఱ్ఱాన్ని పరుగెత్తిస్తున్నాడు. కొద్దిసేపటిలో అతడు శత్రువు లకి చిక్కకుండా పారిపోయి వుండును. కాని ఆ గుఱ్ఱము కాలు ఒక నెరియలో పడి ఇరుక్కొనిపోయి క్రింద పడిపోవ డంలో మైకేల్ పొయాగ్రేవ్ కాలు ఒకటి విరిగిపోయింది. ఇంతలో వెనుకనించి తరుముకొని వస్తూన్న మిగిలిన బోల్షివిక్ సైనికుడు అతనిని కాల్చి చంపేసేడు.

ఈ విషయాలన్నీ జ్ఞప్తికి వచ్చి ఆండ్రీ చిరునవ్వు నవ్వేడు. మెరీనా నిట్టూర్పు విడుస్తూ ఆండ్రీని దగ్గరిగా లాక్కొని పడు కుంది. ఒక అరగంట అయిన తరువాత వెనుకటి తరవాయి సంభాషణ సాగించేరు.

"మిషాన్ని, అతని క్రైస్తవ సాహసాలు చూసి ప్రేమించేను... నిన్ను కూడా ప్రేమిస్తున్నాను...... కాని ఎందుకో నాకే తెలియదు." అంది అతని కళ్ళలోకి చూస్తూ. తూర్పు తెల్ల వారుతూండగా ఆమె "నేత పూర్తిచెయ్యడానికి రేపు ఉద యం వస్తావా?" అంది.

"ఏం! ఎందుకురాను!"

"సోనీ— మానెయ్యి."

"ఎందుచేత?"

"ఇల్లు నెయ్యడం నీకు బాగా చేతనవునే! 'భూకర్'కూడా నీకంటె నయం." మెరీనా నవ్వింది. "అయితే నిన్ను పిలవడా నికి ఒక కారణం వుందిలే. ఈవంక నెట్టునిదే ఎందుకొస్తావు

నువ్వు ఇక్కడికి? నీచేత నేయించడంచేత వెనకటి గోడు కాస్తా కూడా పోయింది. ఇల్లంతా పూర్తిగా మళ్ళీ నేయించాలి."

రెండురోజులు పోయిన తరువాత 'ఘూంకర్' వచ్చి, ఆండ్రీ రెల్లు అంతా చిక్కు చేసి పాడుచేసినందుకు విసుక్కుంటూ ఆ ఇల్లు అంతా మళ్ళీ నేసేడు.

ఆండ్రీ ఆ రోజు మొదలు ప్రతి రాత్రి మెరీనాదగ్గరకి వస్తూండేవాడు. ఆమె ఆండ్రీ కంటె 10 సం॥ పెద్దది అయినప్పటికి ఆమెమీద ఆండ్రీకి విపరీతమైన ప్రేమ కలిగింది.

ఈవిషయం క్రమంగా గ్రామం అంతటా పాకింది. ఎవరికి తోచినట్లు వాళ్ళు అనేక విధాల చెప్పుకున్నారు. "అఖరుకు ఇంత కాలం వుండి ఆ ముసలిముండని చేరతీసేడు. ఎవరేనా వింటే సిగ్గుకూడాను." అని ఇరుగుపొరుగువాళ్ళ అందరితోను చెప్పి ఏడ్చింది ఆండ్రీ తల్లి. కాని క్రమంగా దానికే సంతృప్తి పడి ఊరుకుంది. ఆండ్రీ చాలా కాలంనుంచి అంత క్రితంవరకు న్యూరా అను ఒక యువతితో సరసాలాడుతూ కలిసి తిరుగుతూండేవాడు. కాని మెరీనాతో పరిచయం ఏర్పడినప్పటినుంచి, న్యూరా కంటపడకుండా తప్పించుకొని తిరగడం మొదలెట్టేడు. ఒకరోజున అతను పొలంలో రుప్పలు కొడుతూండగా న్యూరా వచ్చింది. ఆమెని చూడగానే ఆండ్రీ వెలవెలపోయేడు.

"ఆండ్రీ! ఎవత్తైనో ఒక ముసలిదాన్ని పెళ్ళి చేసుకున్నావుట కాదూ నువ్వు?" అంది వణుకుతూన్న పెదవులతో. కళ్ళు

చెమ్మగిల్లేయి.

"ఊపిరి పీల్చడానికి కూడా తీరుపడి ఉండడంలేదు" అంటూ ఆండ్రీ సంభాషణ మార్చడానికి ప్రయత్నించేడు.

"ఇంత కాలం తిరిగి ప్రయత్నం చేసినా, ఆ ముసలిదే కాని, పడుచుపిల్ల లెవరూ దొరకలేదూ నీకు?"

"నేను మాత్రం పడుచువాడినా ఏమిటి? చూడు!" అని నెత్తిమీది టోపీ తీసి అక్కడక్కడ నెరుస్తూన్న జుట్టు చూపించేడు.

"కాని, నిన్ను నేను ప్రేమించాను. ఆ విషయం నీకు తెలిసీ ఈ నాటకం ఆడేవు. నాదే బుద్ధి తక్కువ. సరే! వెడతాను." అని మళ్ళీ వెనక తిరిగి కూడా చూడకుండా వెళ్ళిపోయింది. మకార్ నగుల్నోవ్ "ఆండ్రీ! నాకేమీ నచ్చలేదు. మెరీనాని పెళ్ళి చేసుకుంటే నీకు స్వంత ఆస్తి పోగుబడుతుంది. కమ్యూనిస్టుపార్టీ మెంబరువైయుండీ, ఇన్ని కబుర్లూ చెప్పి, చివరకు ఇదా నువ్వు చేసేపని! నేను వేళాకోళానికి చెప్పడంలేదు. కొద్దిరోజుల్లో నీకే తెలుస్తుంది ఆ విషయం. ఏం, తెలియదూ?" అని హెచ్చరించేడు.

"ఆండ్రీ! మెరీనాని శాస్త్ర ప్రకారం పెళ్లేనా చేసుకో." అంది ఒకరోజున అతని తల్లి.

"శాస్త్రోక్తంగా పెళ్ళి చేసుకోనకపోతే పనికిరాదా?" అన్నాడు ఆండ్రీ.

ఆండ్రీగ్రజ్మటోస్నేవ్.

మెరీనా 20 సం॥ల యువతిలా వుంది. ప్రతి అవయవంలోను యౌవ్వనం తొణికిసలాడుతూంది. ప్రతిరోజు, రాత్రి ఆండ్రీ వచ్చినది మొదలు మరునాడు ఉదయం బాగా ఎండవచ్చేవరకు అతన్ని వదిలేదికాదు. ఆమెకు వెనుకటి యవ్వనపు రోజులు వచ్చినట్లు ఉంది. అతనికి రకరకాల సిల్కు దుస్తులు కుట్టించి ఇస్తూ, అనుక్షణం అతని ప్రవర్తన కనిపెడుతూ వుండేది. క్రమంగా, ఆండ్రీ తనని వదలిపెట్టి వెళ్ళిపోతాడేమోనని భయంకూడా కలిగింది, మెరీనాకి. అందుచేత ప్రతి మీటింగులకు వెళ్ళి, అతడు ఏ పడుచుపిల్లతో కలిసి తిరుగుతున్నాడో, ఏ యువతిమీద కన్నేసిచూస్తున్నాడో అని అదేపనిగా పరిశీలించడం మొదలెట్టింది. ఆండ్రీ ఇదంతా చూసి చిన్నపుచ్చుకొని, ఆమెను తిట్టేడు. అప్పటికీ వినకపోతే అనేకసార్లు కొట్టేడు. కాని ఏమిచేసినా లాభంలేకపోయింది. చివరకు విసుగెత్తి ఊరుకున్నాడు. ఆండ్రీని సంతోషపెట్టడానికి చచ్చిపోయిన తన భర్త దుస్తులన్నీ యిచ్చింది. అంతవరకు అతడు ఎన్నడూ, అంత ఖరీదైన బట్టలు కట్టుకోనకపోవడంచేత, ఉప్పొంగిపోయి, సార్జింటు ట్రౌజర్లు, పొట్టిగా బిగువుగానున్న చొక్కాలు తొడుగుకొని, తిరుగుతూండేవాడు.

ఆండ్రీ మెరీనాకు వ్యవసాయపు పనల్లో సహాయంచేస్తూ, వేటకి వెళ్ళి, ఏ దుప్పినో, కుందేలునో, చంపి తీసుకొనివచ్చి ఇస్తూండేవాడు. మెరీనాకి ఆండ్రీ తల్లిమీద క్రోధం వున్నప్ప

టికి, ఆమెతో పేచీపడక, ఆండ్రీ వేటాడి తెచ్చిన మాంసం ఆమెకికూడా పంపేస్తూ, మంచిమాటలతో కాలక్షేపం చేస్తూండేది.

వ్యవసాయంలో మొగదక్షత అక్కరలేకుండగనే ఆమె సమస్తం స్వయంగా చేసుకోగలదు. ఆమె, అమాంతంగా, రెండవవాళ్ల సహాయం అవసరం లేకుండా పెద్ద పెద్ద బరువులు ఎత్తుకోనడం, కొడవలి చేతపుచ్చుకొని పండిన పదును ఎత్తకుండా, ఒక్కర్తె, ఇద్దరిపని చెయ్యడం ఆండ్రీ చాటునుండి చూసి, ఆమె బలానికి నవ్వుకొనేవాడు. మొత్తంమీద మెరీనా చాలా బలమయిన మనిషి.

సంవత్సరాలు గడిచిపోయేయి. ఆండ్రీకి మెరీనా మీది ప్రేమ నాటుకొని స్థిరపడింది: అప్పుడప్పుడు మొదటిభార్య జ్ఞాపకం వొచ్చినా వెనకటిలాగ విచారపడేవాడు కాడు. ఒకపర్యాయము —సారిస్సుకు ప్రవాసము వెళ్ళిన అనికేడెవ్యాట్కిన్— పెద్ద కొడుకు కనిపించేడు. అతను అచ్చంగా తండ్రిపోలికే. అతనిని చూడగానే ఆండ్రీ తెల్లబోయేడు. కాని తరువాత, తరువాత సంసార చిక్కుల్లోపడి క్రమంగా ఆధోరణి పోయింది.

బీదరైతుల సమావేశం పూర్తి అయినతరువాత ఆండ్రీ తిన్నగా మెరీనా ఇంటికి వెళ్ళేడు. లోపల గదిలో, రాట్నం తిప్పుతూన్న చప్పుడు వినిపిస్తూంది. లోపలికి వెళ్లేటప్పటికి చిన్న మేకపిల్ల ఎగిరి గంతులువేస్తూంది.

ఆండ్రీ చిరాకుతో ముఖం చిట్లించి "ఒకసారి రాట్టం ఆపేద్దూ!" అన్నాడు.

మెరీనా రాట్టం ఆపేసి, బద్ధకంతో నడ్డి విరుచుకొంది.

"మీటింగు విశేషాలేమిటి?"

"భాగ్యవంతుల ఆస్తులన్నీ జప్తు చెయ్యడానికి నిశ్చయం అయింది. రేపే పని ప్రారంభిస్తాము."

"ఆ! నిజంగానే!"

"బీద రైతులంతా సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరేరు."

ఆ బట్టంతోనే పక్కనే ఉన్న మంచంమీద పడుకొని పేక పిల్లని పట్టుకొన్నాడు.

"నువ్వుకూడా దరఖాస్తు పెట్టు రేపు, సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరడానికి."

"దరఖాస్తు ఏమని?"

"సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేర్చుకోమని."

ఎదుటనున్న రాట్టం దూరంగా గెంటిపారేసింది.

"నీకేదేనా మతిపోయిందా ఏమిటి? ఎందుకూ చేరడం?"

"మెరీనా! అనవసర వాగ్వాదం ఎందుకు? ఏమైనా సరే, నువ్వు చేరక తప్పదు. లేకపోతే అందరూ కూడ నా మెరీనాని మాత్రం దూరంగా అట్టేపెట్టి మిగిలినవాళ్ళని అందరిని చేరమంటున్నానని ఆక్షేపిస్తారు. ఆమాటమాత్రం నేను సహించలేను."

"ఏమైనాసరే! నేను మాత్రం చేరదల్చుకోలేదు. ఆపైన నీ

యిష్టం" అంటూ లేచింది.

"అయితే, మనం విడిపోవలసివస్తుంది"

"బెదిరిస్తావా ఏమిటి?"

"బెదిరించడం లేదు నేను. అంతకంటె గత్యంతరంలేదు."

"సరే, నాకు ఉన్న ఒక్క ఆవునీ తీసుకొని చేసుకోవాలనుకో. మళ్ళీ మనకి ఏం వస్తుంది, దానివల్ల? పాలులేకుండా మనం ఎల్లాగ గడుపుతాము?"

సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరిన వాళ్ళందరు ఆ పాలన్నీ సమంగా ఎవరికి కావలసినవి వాళ్లు తీసుకోవచ్చు"

"అయితే ఆడవాళ్ళనికూడా అంతేనా? అందుచేత నేలా వుంది నన్ను విడిచిపెడతానని బెదిరిస్తూన్నావు"

"నీకూ మంచిదే కాదూ అల్లాచేస్తేను? అనేకమందితో ఉండచ్చు" అండ్రీ చేతిలోని మేకపిల్లను నేలమీద పారేసి, ఊలు రుమాలు బుజంమీద వేసుకొని, టోపీ చేతపుచ్చుకొని "ప్రతి చేతకాని వెధవ, సమస్తం తెలిసినట్లు, వాదించి ప్రాణం విసిగిం చేస్తూన్నారు. ఆఖరికి మెరీనాకూడా, ఎదిరిస్తూందే సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరడాన్ని గురించి! రేపు జరిగే గ్రామ స్థుల సమావేశంలో పర్యవసానం ఏమని తేలుతుందో! భాగ్య వంతులకి బాగా ఒత్తిడి కలగచేస్తే తిరగపడతారు." అను కుంటూ కోపంతో ఇంటికి వెళ్ళిపోయేడు.

చాలా సేపటివరకు నిద్రపట్టక ఇటు, అటు దొర్లుతూనే

ఉన్నాడు. అతనితల్లి పడుకొన్నతరువాత ఏదో పనిమీద రెండుసార్లు లేవడం చూస్తూనే, పడుకున్నాడు. కొంతసేపటికి ఒక కోడి అదేపనిగా కుయ్యడం మొదలెట్టింది. ఆండ్రీకి, వ్యవసాయ పునర్నిర్మాణాన్ని గురించిన అనేక విషయాలు, బుర్రలో గిర్రున తిరిగిపోయేయి. డేవిడోవ్ తొందరపడి, ఏదో పొరపాటు పనిచేసి, సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరుదమా-వద్దా-అని ఊగిసలాడుతూన్న మధ్యరకపు రైతుల్ని బెదరకొడతాడేమోనని భయపడ్డాడు. కాని ఇంతలో- కుదిమట్టంగా, దృఢంగా ఉన్న అతని విగ్రహం, తెలివితేటలు ఉట్టిపడే ముఖం ఆచురుకైన కళ్ళు, కళ్ళకి కట్టినట్లు కనిపించేయి. లుబిష్కిన్ మీటింగులో మాట్లాడుతూంటే వెనక వైపున డేవిడోవ్ నగుల్నోవ్ కేసి తిరిగి, "చూసేరూ, అతనికి సరియైన శిక్షణ ఇస్తే అతడు వృద్ధిలోకి వచ్చి మనకి చాలా ఉపయోగిస్తాడు. మీరు అశ్రద్ధ చేసి ఊరుకున్నారు. ఇకమీదఅయినా ఊరుకోక అతని విషయంలో శ్రద్ధతీసుకోవాలి" అని అన్న మాటలు చెవుల్లో ప్రతిధ్వనించేయి. ఈమాటలు జ్ఞాపకం రావడంతోటే ఉత్సాహంతో "అతడు తొందరపడి లేనిపోని చిక్కులు తెచ్చేరకం కాదు. మకార్‌ను మాత్రం అదుపులో వుంచాలి. లేకపోతే ఉద్యమం జోరుగా సాగుతూన్న సమయంలో వుద్రేకం పట్టలేక తొందరపడి, వ్యవహారం అంతా పాడుచేస్తాడు. సారథ్యం అతనికి ఇస్తే, కిందు, మీద చూడకుండా రథం ఎక్కడో బోల్తాకొట్టించేస్తాడు

బీళ్ళుదున్నేరు.

మ కార్......టిటాక్......రేపు......" క్రమంగా అతనికి తెలియకుండగనే నిద్ర ఆవహించింది. పెదవులమీద చిరునవ్వు, సూర్యరశ్మికి మంచు కరిగిపోయినట్లు కరిగి అదృశ్యమైపోయింది.



# ఆరో ప్రకరణము.

## ఉద్యాసన.

మరునాడుదయం, డేవిడోవ్ సోవియటు ఆఫీసుకు వచ్చేటప్పటికి 3 గంటలయింది. అప్పటికప్పుడే 14 గురు బీద రైతులు అతనికోసకు ఎదురుచూస్తో కూర్చునియున్నారు.

"సూర్యోదయం అయినప్పటినుంచి, 'మీరు ఎప్పుడు వస్తారా' అని ఎదురుచూస్తోన్నాము."

"ఇప్పటికే పొద్దుఎక్కింది. ఇంక ఏమీ ఆలస్యంచెయ్యడానికి వీలులేదు." అన్నాడు ముసలి ఘూకర్.

డేవిడోవ్ వచ్చిన రోజు సాయంకాలం, ఆడవాళ్ళు కట్టుకొనే— తెల్లటి గొర్రె చర్మంతో చేయబడ్డ దుస్తులు ధరించి అతనితో పరిహాసంగా మాట్లాడిన ముసలివాడు, ఈ ఘూకరే. ఘూకర్ అంత క్రితంవరకు డేవిడోవ్‌ను ఎరగక పోయినప్పటికి, అతిపరిచయంగా మాట్లాడడం మొదలెట్టేడు. డేవిడోవ్ సోవియట్ ఆఫీసుకు వచ్చేముందే, ఘూకర్ "ఇప్పుడు చెయ్యవలసిన పనిని గురించి అతడు, నేను కలిసి ఆలోచించాలి. రెండురోజుల క్రితం, అతడు నన్ను కలుసుకొని అనేక విషయాలు చర్చించేడు. పూర్వపరిచయంచేత మేము ఒకరినొకరు వేళాకోళం చేసుకో

న్నా, ముఖ్యమైన విషయాలు వచ్చినప్పుడు మాత్రం తీవ్రంగా ఆలోచిస్తాము. నాలాగే అతడు కూడా వేళాకోళం మనిషి." అంటూ కోతలు కోసేడు.

డేవిడోవ్, ఘూకర్ వేసుకొన్న దుస్తులను బట్టి అతన్ని ఆనవాలుపట్టి, "ఆ! తాతా! దోవలోకి వొస్తోన్నావు నువ్వు! అల్లా ఉండాలి! రెండురోజుల క్రితం నేను సమిష్టివ్యవసాయ క్షేత్రం ఏర్పాటుచెయ్యడానికి వచ్చేనని వినగానే కంగారుపడి వెళ్ళిపోయేవు. అల్లాంటివాడవు నువ్వు ఇప్పుడు సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరడానికి అందరికంటే ముందే, నడుంకట్టి సిద్ధం అయేవు." అన్నాడు. ఘూకర్ కి కోపం వచ్చింది. "మొన్న ఆగడానికి తీరుబడి లేక వెళ్లిపోయేను. అంతకంటె మరేమీ లేదు." అని, సణుగుతూ అక్కడినుంచి వెళ్లిపోయేడు.

అక్కడికి చేరిన కోసక్కులందరు, రెండుదళాలుగా విడిపోయి మొదటి దళం మెరక వీధికి, రెండవ దళం పల్లపువీధికి వెళ్ళి, భాగ్యవంతుల ఆస్తులు స్వాధీనం చేసుకొనడానికి నిశ్చయం అయింది. డేవిడోవ్ నగుల్నోవ్ ను మొదటి దళంతో వెళ్ళమని చెప్పగా అతడు నిరాకరించాడు. అనుమానంతో డేవిడోవ్ నగుల్నోవ్ కేసి చూడసాగేడు. నగుల్నోవ్ కంగారుపడి అతనిని దూరంగా రమ్మని సౌంజ్ఞచేసేడు.

"మొదటిదళంతో వెళ్ళనన్నా రెందుచేత మీరు?"

"రెండవదళంతో పల్లపు వీధికి వెళతాను."

"ఎక్కడికయితే ఏమి?"

మకార్ పెదవులు కొరుకుతూ, ముఖం పక్కకి తిప్పుకొని,

"ఎక్కడికయినా...... అంటే ...... మీకు ఏదయినా ఒకటే. కాని ఫ్రోల్ డెమాస్కోవ్ కొడుకు టిమోఫీకి నా భార్యకి సంబంధం వుంది. నేను అక్కడికి వెడితే ఈ విషయం ఏదో వస్తుంది. అందుచేత అక్కడికి వెళ్ళడం నాకు ఇష్టంలేదు. నేను రెండోదళంతో వెడతాను. మొదటిదళంతో రజ్మెటోన్నోవ్ వెడితే బాగుంటుంది." అన్నాడు.

"కామ్రేడ్! అక్కడికి వెడితే ఏదో మాటవస్తుందని భయపడుతున్నారా! సరే! మీ యిష్టం; బలవంతంలేదు. నాతో కూడా రెండోదళంతో రండి.

ఇంతలో, ఉదయం నగుల్నోవ్ భార్య కణతమీద చూసిన గాయం సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆతనికి. "ఆవిడని కొట్టి గాయపరచినది మీరేనా? కొడుతూంటారా ఏమిటి మీరు?"

"కాదు! నేను ఎప్పుడూ కొట్టను."

"ఎవరు మరి?"

"ఆతడే."

"ఎవరు ఆతడు?"

"టిమోఫీ, ఫ్రోల్ కొడుకు."

"అబ్బా! అంతటివాడా! రండి వెడదాం. ఆ విషయం తరవాత ఆలోచిద్దాం." అన్నాడు డేవిడోవ్ కోపంగా.

బీష్కునున్నారు.

నగుల్నోవ్, డేవిడోవ్, లుబిష్కిన్, మకార్ ఇంకొక ముగ్గురు కోసక్కులు కలిసి బయలుదేరేరు. పైసంభాషణ జరిగిన తరువాత డేవిడోవ్ నగుల్నోవుల మనస్సులు ఎల్లాగో ఉన్నాయి.

"ఎక్కడినుంచి ప్రారంభంచేద్దాం?" అన్నాడు డేవిడోవ్.

"'టిటాక్' దగ్గరనుంచి." అన్నాడు మకార్.

మాట్లాడకుండ నిశ్శబ్దంగా వీధులవెంట వెళుతున్నారు. వీళ్ళవైపు, కిటికీలలోనుంచి ఆడవాళ్లు తొంగిచూడడం మొదలెట్టేరు. కొంతమంది పిల్లలు పోగయి, అల్లరిచేస్తూ వీళ్ళ వెనక బయలుదేరేరు. కాని లుబిష్కివ్ దడికర్ర ఒకటి ఊడలాగి, వాళ్ళని తరుముకొని వెళ్ళేటప్పటికి నాలుగువైపులా పారిపోయారు. వాళ్ళందరు టిటాక్ ఇంటిదగ్గరికి వచ్చేటప్పటికి "సమిష్టివ్యవసాయక్షేత్రి కార్యాలయముగా ఉపయోగించుకోనడానికి బాగుంటుంది, ఈ ఇల్లు. మంచి విశాలంగా వుంది. దొడ్లో వున్న పాకలలో పశువుల్ని, గుఱ్ఱాల్ని కట్టుకోనడానికి వీలుగా వుంది." అన్నాడు మకార్.

ఆఇల్లు చాలా విశాలంగా ఉంది. 1922 వ సం॥పు కరువు రోజుల్లో టిటాక్ ఒక ఆవుని, 4 బస్తాల ధాన్యం ఇచ్చి, కొద్ది దూరములోనున్న 'టుబన్‌స్కో' అనే ఊళ్ళో ఒకని దగ్గర కొన్నాడు, ఆ ఇల్లు. కాని ఆ కుటుంబం అంతా నాశనం అయిపోవడంచేత, అంత చవకగా కొనినప్పటికీ, టిటాక్‌ను అడిగే

వాడెవడూ లేకపోయేడు. అతను ఆ ఇల్లంతా ఊడపీకి, సామాను గిరిమాచీకి మోసుకొనివచ్చి, అక్కడ ఇల్లు కట్టుకున్నాడు. దొడ్లో దూడల్ని కట్టుకొనేటందుకు పాకలు, తబేలా మొదలైనవి వేసేడు. వీధి గోడమీద 'టి. కె బొగోడిన్. 1923' అని చెక్కి ఉంది.

డేవిడోవ్ ఇంటికేసి పరీక్షగా చూసేడు. అందరికంటె ముందుగా నగుల్నోవ్ ఆవరణదాటి లోపలికి వెళ్ళేడు. మనుష్యుల అలికిడి వినగానే గాదిపక్క పడుకొనియున్న పెద్ద, బూడిదిరంగు కుక్క ఒకటి బరువైన ఇనపగొలుసు ఈడుస్తూ, పరుగెత్తుకొని వచ్చింది. గొలుసు రెండవవైపు ఒక రాటుకు కట్టి ఉండడంచేత, ముందుకురాలేక వెనక కాళ్ళమీద లేచి మొరుగుతూ, గొలుసు తెంపుకొని మీద ఉరకడానికి ప్రయత్నించింది. కాని గొలుసు చాలా బలంగా ఉండడంచేత సాధ్యపడక గొలుసు కీచుమంటూ తబేలావైపు వెళ్లిపోయింది.

"అది మీదపడితే, మళ్ళీ వదిలిపెట్టదు." అనుకుంటూ ఛూకర్ దృష్టిఅంతా ఆ కుక్కమీదే ఉంచి, అపాయం వస్తే తప్పించుకొని పారిపోవడానికి వీలుగా ఉండేటట్లు దడి దగ్గర నిలబడ్డాడు.

మిగిలినవాళ్ళంతా తిన్నగా లోపలికి వెళ్లి వంటయింట్లో ప్రవేశించేరు. సన్నంగా, పొడుగ్గా ఉన్న టిటాక్ భార్య దూడకి నీళ్ళు పెడుతూంది. అకాత్తుగా వీళ్ళందరు ఇంట్లోకి

బిక్కుమన్నారు.

రావడంతోటే అనుమానపడి వాళ్లవైపు కోపంగా చూసింది.

"టిటాక్ ఇంటిదగ్గర వున్నాడా?" అని అడిగేడు నగుల్నోవ్.

"లేదు"

"ఎక్కడికి వెళ్లేడు?"

"నాకు తెలియదు." అని నిరసనగా సమాధానం చెప్పింది.

"మేము ఇక్కడికి ఎందుకు వచ్చినది మీకు తెలిసే ఉంటుంది. మీరు........." అంటూ ఘూకర్ ఇంకా ఏదో చెప్పబోతూండగా నగుల్నోవ్ అతనికేసి ఎర్రిమారి చూడ్డంచేత మాట పూర్తిచెయ్యకుండా, గుటకలు మింగుతూ అక్కడే బెంచీమీద చతికిలపడ్డాడు.

"గుర్రాలన్నీ తబేలాలో వున్నాయా?" అన్నాడు నగుల్నోవ్ ఏమీఎరగనట్లు.

"ఆ-ఉన్నాయి"

"ఎడ్లు?"

"లేవు. అంతపరీక్షగా అడుగుతున్నారెందుకు?"

"మేము చెప్పడానికి వీ......" అని ఘూకర్ మళ్ళీ ఏదో చెప్పబోతూండగా లుబిష్కిన్ విసవిసావచ్చి, అతని మెడ పట్టుకొని వరండాలోకి గెంటేసేడు.

"అయితే ఎడ్లు ఏమయ్యేయి?" అంటూ నగుల్నోవ్ మళ్ళీ ప్రారంభించాడు.

"ఎక్కడికో తోలుకుపోయేరు"

"ఎక్కడికి?"

"ఏమో! నాకు తెలియదు."

నగుల్నోవ్ దేవిడోవ్‌కు సంజ్ఞచేసి బయటకి వెళ్ళిపోయేడు. ఘూకర్‌ని దాటివెడుతూ, పిడికిలి బిగించి బెదిరిస్తూ, "మాట్లాడమనని దే, అనవసరంగా వాగక నోరుమూసుకో." అని దేవిడోవ్ వైపు తిరిగి "మనం చేసిన ప్రియత్నం అంతా వృధా అయింది. ఆ ఎడ్లని ఎక్కడికి తోలుకొని పోయేడో చూడాలి ఇప్పుడు. వాట్లని మనకి దొరకకుండా చెయ్యాడుకదా అని అనుమానంగా వుంది నాకు." అన్నాడు.

"పోనీ, ఆ ఎడ్లు దొరకకపోతే....."

"ఏమిటి?" అని నగుల్నోవ్ ఆందోళనగా అన్నాడు. "ఈ ఊరి మొత్తంమీద అటువంటి ఎడ్లులేవు. మనం చెయ్యి ఎత్తితే కూడ అందవు కొమ్ములు; అంత ఎత్తైనవి. అశ్రద్ధచేసి ఒదిలెయ్యడానికి వీల్లేదు! ఎల్లాగయినా టిటాక్‌ను ఎడ్లను పట్టుకోవాలి."

నగుల్నోవ్ లుబిష్కిన్‌లు కొంతసేపు గుసగుసలాడి దొడ్లో దూడలపాక వైపు వెళ్ళేరు. దూడలపాక, దొడ్డి, అంతా చూసేరు. 5 నిముషాలైనతరువాత లుబిష్కిన్ దూడల్ని కట్టేగుంజ ఊడపీకి కుక్కని బయటకి దూరంగా తరిమేసేడు. నగుల్నోవ్ తబేలాలోనుంచి, మంచి ఎత్తరిఅయిన గుజ్జుము నొకదానిని

బయటికి తీసుకొనివచ్చి నిలబెట్టేడు. నోట కళ్ళెంతగల్చి, జూలు పట్టుకొని, జీనులేని గుఱ్ఱముమీద ఎగిరి కూర్చున్నాడు.

"మకార్! అడగకుండా పరాయివాళ్ల సొత్తు నీ ఇష్టం వచ్చి నట్లు తీసుకొనిపోవడం ధర్మమేనా?" అని కేకవేస్తూ టిటాక్ భార్య వసారామీదికి పరుగెత్తుకొని వచ్చింది. "ఇంటికి తిరిగి వచ్చిన తరువాత ఆయనతో చెప్పకపోతే అను! ఈసారితో ఏదో తేలిపోతుంది."

"ఆట్టే వాగకు! టిటాక్ ఇక్కడ ఉంటే ఈపాటికి నేనే తేల్చేసి వుందును. కామ్రేడ్ డేవిడోవ్! ఒక్క పర్యాయం ఇల్లా వస్తారా?"

నగుల్నోవ్ పరివర్తన ఏమీ అర్థం అయిందికాదు, డేవిడోవ్‌కి. ఏమీ మాట్లాడకుండా అతని దగ్గరికి వెళ్ళేడు.

"అదిగో! ఆమూల కళ్ళెంలోనుంచి రోడ్డుమీదికి ఎడ్లగిట్టల జాడలు కనిపిస్తూన్నాయి." అని నగుల్నోవ్ చెయ్యి జాపి చూపించేడు. "టిటాక్ మనం వస్తామన్న విషయం గ్రహించి వాటిని అమ్మడానికి ఎక్కడికో తోలుకొనిపోయేడు. బళ్లుఅన్నీ పాకలోనే వున్నాయి. టిటాక్ భార్య అబద్ధం ఆడుతూంది. మీరు 'క్లాఫిటోవ్' ఆస్తి జప్తుచేస్తూండండి. నేను టుబన్‌స్కోవ్ వైపు వెడతాను. అతను తప్పకుండా అక్కడికే వెళ్ళి ఉంటాడు. గుఱ్ఱాన్ని తోలడానికి చిన్నజువ్వ ఒకటి అందుకోండి."

నగుల్నోవ్ కళ్ళెంలోనుంచి ఎడ్ల జాడ వెంబడినే గుఱ్ఱాన్ని

పోనిచ్చేడు. కొంతదూరం వెళ్ళేటప్పటికి, ఎడ్లగిట్టల జాడలు, పక్కనే కనిపిస్తూన్న గుట్టపు డెక్కల అడుగులు అదృశ్యం అయేయి. అక్కడినుంచి నగుల్నోవ్ 'టుబన్స్కో' వైపుకు మళ్ళేడు. దోవలో అక్కడక్కడ, మంచుదిబ్బలమీద పేడ పిడకల్కు, వెనకటి మాదిరిగానే జాడలు కనిపించడంచేత, టిటాక్ ఎడ్లను తోలుకొని వెళ్ళిన మార్గం అదే అయి వుంటుందని నిశ్చ యించి గుర్రాన్ని వేగంగా పోనిచ్చేడు. సుమారు ఒక మైలు దూరం వెళ్లిన తరువాత ఒక వాగు అడ్డంవచ్చింది. వెనుకటి జాడలు మాయమయేయి. మంచుదట్టంగా పడడంచేత కనిపించ డంలేదేమోనని, గుఱ్ఱం దిగి పరిశీలనగా చూసేడు. కాని, ఆ తెల్లటి మంచుమీద ఎక్కడా, జాడలు కనిపించలేదు. వాగు లోపల కాటుకపట్టి నడిచివెళ్లిన జాడలుమాత్రం స్పష్టంగా కని పిస్తూన్నాయి. విసుక్కుంటూ మళ్లీ గుఱ్ఱం ఎక్కి, నెమ్మ దిగా వచ్చిన దోవనే నడిపిస్తో, నలువైపులా చూస్తూ బయలు దేరేడు. కొంతదూరం పోయేటప్పటికి జాడలు మళ్ళీ కనిపిం చాయి. అందుచేత అతడు రోడ్డువదలి బీట్లోంచి తోలుకొని వెళ్లిఉంటాడని ఊహించి, గుర్రాన్ని వేగంగా పోనిచ్చేడు. కొంతదూరం వెళ్లిన తరువాత, టిటాక్ గుట్టలమధ్యనుంచి 'వెస్కావాయు' గ్రామంవైపు తోలుకొని వెళ్లేడని కనిపెట్టి "ఎవరో స్నేహితుల దగ్గరికి వెళుతూన్నట్లున్నాడు." అను కొంటూ, జాడవెంబడినే గుర్రాన్ని పోనిచ్చేడు. గుట్టలమీదుగా

వెడుతూండగా కొద్దిదూరములోనున్న లోయదగ్గిర పేడ కనిపించడంచేత గుర్రాన్ని ఆపేడు. పేడ అంతకిత్రితమే వేసినట్లు వుంది. నగుల్నోవ్ గొర్రెచర్మపు దుస్తులలోని రివాల్వరు తడిమి చూసుకొన్నాడు. అక్కడినుంచి గుర్రాన్ని లోయవైపు తిప్పేడు. ఒక అరమైలు దూరం పోయిన తరువాత దూరమున ఆకులు రాలిపోయివున్న ఓకుచెట్ల తోపువారనుంచి, ఒకడు గుర్రము నెక్కి, ఎద్దును తోలుకొని వెడుతూండడం చూసేడు.

"ఏయ్! ఆగు! ఆగు!" అని గట్టిగా కేకవేసేడు నగుల్నోవ్. టిటాక్ కళ్లెం బిగిస్తూ, నాలుగువైపులా చూసి, నోట్లో సిగరెట్టు పారేసి, గుర్రాన్ని ఎద్దుముందుకు పోనిచ్చి, "ఎందుకు ఆగమన్నావు?" అన్నాడు.

నగుల్నోవ్ వేగంగా ముందుకు వచ్చి కలుసుకొన్నాడు. టిటాక్ అతనికేసి చూస్తో నిలబడిపోయేడు.

"ఎక్కడికి వెళుతున్నావు?"

"పిటిని అమ్మడానికి వెడుతూన్నాను. మకార్! నీదగ్గర దాచడం ఎందుకు?" టిటాక్ చీది బొద్దుగా పెరిగి ఎఱ్ఱగానున్న మీసాలు తుడుచుకున్నాడు. గుర్రాలు ఒకదానిని ఒకటి చూసి సకిలించేయి. వాళ్ళిద్దరు ఒకరికొకరు ఎదురుగా గుఱ్ఱాల మీదే కూర్చున్నారు. చలిగాలి తగిలి నగుల్నోవ్ ముఖం ఎఱ్ఱబారింది. కోపంగా వున్నాడు. టిటాక్ మాత్రం పైకి గంభీరంగాను శాంతంగాను కనిపిస్తూన్నాడు.

"ఎడ్లని వెనకకు నడిపించి ఇం[illegible]" ఆజ్ఞాపించేడు నగుల్నోవ్ గుఱ్ఱాన్ని అదలిస్తూ.

టిటాక్ కొంచెంసేపు అనుమానించేడు. కళ్ళెం వేళ్లకి చుట్టబెడుతూ, విచారంగా తల వ్రేలాడవేసి, రెప్పలు వాల్చి, అర్ధనిమీలిత నేత్రాలతో, స్వంతంగా వడికి తయారుచేసుకొన్న ముతక కోటుతో, టోపీ చెవులనుకూడా కప్పునట్లు పెట్టుకొనిన అతడు, కునికిపాట్లు పడుతూన్న డేగలా వున్నాడు. "కోటు లోపల ఆయుధం ఏదైనా ఉన్నట్లయితే ఇంత చులకనగా చిక్కిపోయి వుండును." అనుకొంటూ, నగుల్నోవ్, కదలకుండా నిశ్చలంగా కూర్చున్న టిటాక్ కేసి చూస్తూన్నాడు. కాని టిటాక్ ఏమి ఆలోచించుకొన్నాడో నిద్రనుంచి మేల్కొన్నవానివలె, హఠాత్తుగా ఎడ్లని అదిలించి వెనక్కి మళ్లించేడు.

"నా ఆస్తిఅంతా కూడా లాగేసుకుంటారా! నన్ను భాగ్యవంతులలో చేర్చి నాశనం చేసేస్తారా?" అన్నాడు టిటాక్ నుదురు కూడా కప్పియున్న టోపీ అంచు కింద నుంచి చూస్తూ.

"ఇంతవరకు స్వేచ్ఛగా నీఇష్టంవచ్చినట్లు చేసేవు. ఇకనైని నీ ఆటలు సాగవు!" అన్నాడు నగుల్నోవ్ కోపం పట్టలేక.

టిటాక్ గుట్టదగ్గరికి వచ్చేవరకు మాట్లాడక ఊరుకున్నాడు.

"అయితే, నన్ను ఏమిచేద్దాం అని— మీ వుద్దేశ్యం!" అన్నాడు.

"ఈ జిల్లానుంచి వెళ్ళగొట్టేస్తాం. నీ కోటుకింద అక్కడ

ఎత్తుగా వుంది ఏమిటి?"

"తుపాకీ" అని, నగుల్మోవ్ కేసి చూసి కోటు విప్పేడు. నాటురకపు తుపాకీ ఒకటి కనిపించింది.

"అది ఇల్లా ఇచ్చెయ్యి" అంటూ మకార్ చెయ్యిజాపేడు. కాని టిటూక్ మట్లాడకుండా తుపాకీ కోటులోపల జాగ్రత్త పెట్టేసేడు. "అయితే, ఇదంతా నాకోసం కాదన్నమాట" పొగాకు వెయ్యడంచేత గారపట్టి నల్లగానున్న పళ్ళు ఇకిలిస్తూ నవ్వేడు. నగుల్మోవ్ కేసి తీక్ష్ణంగా, చులకనగా చూసేడు. ఆస్తే కాకుండా ఈ తుపాకీకూడా పుచ్చేసుకుంటారా? భాగ్యవంతులందరు తుపాకులు జాగ్రత్తచేసేరని పత్రికలన్నీ రాస్తూనే వున్నాయి. నిజంకూడా అంతే, ఆస్తి పోతేపోయింది— ఈ తుపాకీతో వేటాడేనా జీవిస్తారని తోచక్కర్లేదూ నీకు?" నవ్వుతూ తల పంకించేడు. నగుల్మోవ్ తుపాకీ స్వాధీనం చెయ్యమని టిటూక్‌ను బలవంత పెట్టకుండా ఊరుకున్నాడు. "ఊళ్ళోకి వెళ్లేసీ నీపని చెబుతాను." అనుకున్నాడు.

"వీడు తుపాకీతో తిరుగుతూన్నాడేంమిటు, అని ఆలోచిస్తూన్నావా, ఏమిటి? ఇది, యుక్రెయినియాలో విప్లవం అణిచేసి, తిరిగి వచ్చేటప్పుడు, కూడా తీసుకువచ్చేను. నీకు జ్ఞాపకంలేదూ? అప్పటినుంచి. అల్లాగే ఒకమూలపడేసి వుంచడంచేత తుప్పు పట్టింది. ఎందుకేనా, అవసరంవస్తుందని ఈమధ్యనే తుప్పు దులిపి బాగుచేసేను. నువ్వు భాగ్యవంతుల్ని అందరిని నాశనం

చెయ్యడానికి ప్రయత్నాలు చేస్తోన్నావని నిన్ననే తెలిసింది. ఈరోజునదే ప్రారంభిస్తావని తెలుస్తే. నిన్న రాత్రే తోలుకొని పోయి వుందును........."

"ఎవరు చెప్పేరు, నీకు'"

"ఒకరు చెప్పేదేమిటి! ఎవరినోటు విన్నా అదేమాట. అందు చేత రాత్రి నా భార్యతో ఆలోచించుకొని ఈ ఎద్దు స్నేహితులు ఎవరిదగ్గరేనా భద్రపరచడానికి నిశ్చయించుకున్నాము. తుపాకీకూడా మీకు దొరకకుండా ఎక్కడేనా దాచవచ్చునని ఉద్దేశించి తీసుకొనివచ్చేను: ఈపాటికే ఎక్కడైనా దాచేసి ఉండవలసింది. అశ్రద్ధచేసేను. ఇంతలో నువ్వు వచ్చేసేవు. చూడు! చెయ్యిలాగుతూంది కూడాను" అన్నాడు ఉల్లాసంతో. వికటంగా కళ్లు చిగిలిస్తో, తన గుఱ్ఱాన్ని నగుంగోన్నెవ్ గఱ్ఱింమీదికి పోనిచ్చేడు.

"టిలాక్, తరువాత వేళాకోళం చెయ్యచ్చులే! ముందు ఇంటికి నడు."

"అల్లాకాదు— ఏమేనా వేళాకోళం చేస్తే ఇప్పుడే చెయ్యాలి. నామటుకు లోపంలేకుండా ఇంత ఆస్తి సంపాదించుకున్నాను—ప్రభుత్వాన్ని అన్నివిధాలా సమర్థించేను. అటువంటిది ఇప్పుడు నన్ను నాశనం చేస్తోన్నారు!" అతని కంఠం రుద్ధమైపోయింది. అది మొదలు అతను మళ్ళీ మాట్లాడలేదు. కాని మ కార్‌ని ముందుపోనిచ్చి, కళ్ళెం బిగించి క్రవక్రమంగా

బీస్పృకున్నారు.

అతను వెనకపడడం ప్రారంభించేడు. కాని టిటాక్ వెనకవుంటే ఏమిచేస్తాడోనన్న భయంతో మకార్ కూడా గుఱ్ఱాన్ని నెమ్మదిగా తోలడం ప్రారంభించేడు. ఎడ్లు చాలదూరం ముందు వెళ్ళిపోయేయి.

"తొందరగానడు, తొందరగానడు!" నగుల్నోవ్ టిటాక్ని తొందరపెడుతూ, జేబులోని రివాల్వరు చప్పుడుచేసేడు. టిటాక్ సంగతి అతనికి బాగా తెలుసును. "నావెనక ఉండడానికి వీల్లేదు. అఠాత్తుగా కాల్చడానికి చూస్తోన్నావేమో— అదేమీ లాభం లేదు."



# ఏడో ప్రకరణము.

## ఆక్రమణ.

ఆండ్రీగజ్మటోవ్ దళం 'ఫ్రోల్ డెమాస్కోవ్' ఇంటికి వెళ్ళేటప్పటికి వాళ్లు మధ్యాహ్నం భోజనాలు చేస్తోన్నారు. టేబులు దగ్గిర, వయసున్నముళ్ళి, రోగంతో తీసుకుంటూన్న ఫ్రోల్, స్థూలంగా, గంభీరంగానున్న అతని భార్య, 22 ఏళ్ళ వయస్సుగల టిమోఫీ అను అతని కొడుకు, పెళ్ళి ఈడువచ్చిన కూతురు కూర్చొని వున్నారు.

టిమోఫీ అచ్చంగా తల్లిపోలికే. మంచి అందమైనవాడు. కొంచెం పొడగరి. మూతి తుడుచుకుంటూ బల్లదగ్గిరనుంచి లేచి, "ఈవేళ పెద్దలంతా వచ్చేరు! దయచెయ్యండి." అని పక్కన వున్న కుర్చీలకేసి చెయ్యిజాపి ఆహ్వానించాడు.

"కూర్చోడానికి తీరుబడి ఎక్కడ!" అంటూ ఆండ్రీ రజ్మటోవ్ డాక్యుమెంటు కేసులోనుంచి ఒక కాగితం పైకి తీసేడు. "డెమాస్కోవ్! మొన్న పేద రైతులంతా సమావేశమై మీ స్థిర చరాస్తులన్నీ స్వాధీనము చేసుకొని, మిమ్మల్ని ప్రవాసమునకు పంపించాలని తీర్మానించేరు. మీ భోజనం త్వరగా ముగించండి. ఈలోపుగా ఆస్తి జాబితా తయారుచేస్తాం."

"ఏమిటి.....ఎందుకు?" ఫ్రోల్ చేతిలోని న్యూస్ క్రింద పడేసి లేచి నిల్చున్నాడు.

"మీవంటి భాగ్యవంతుల్ని అందరిని తొలగించడానికి నిశ్చయించేము." అన్నాడు, డిమ్కా ఉషాకోవ్.

ఖరీదైన తోలుతో ముడతబడిన ఫెల్టు బూట్లు కిరకిర చప్పుడు చేస్తూ, ఫ్రోల్ పక్కగదిలోకి వెళ్లి ఒక కాగితం పట్టుకొని వెంటనే తిరిగి వచ్చేడు.

"రజ్మెట్నోవ్! ఇదిగో నా సర్టిఫికెట్టు. దీనిమీద నువ్వు స్వయంగా దస్కతు చేసేవు."

"ఏమిటా సర్టిఫికెట్టు?"

"నేనివ్వవలసిన ధాన్యం అంతా ప్రభుత్వానికి చెల్లించినట్లు."

"నువ్వు ధాన్యం చెల్లించడానికి, దీనికి సంబంధం లేదు."

"అయితే, నా ఆస్తి స్వాధీనం చేసుకొని, నన్ను ఇంట్లో నుంచి గెంటెయ్యడానికి కారణం ఏమిటి?"

"గ్రామంలోని పేద రైతులంతా అల్లా నిశ్చయించేరు. ఆ విషయం మొదటే చెప్పేను."

"అల్లా చెయ్యమని ఎక్కడా శాసనం లేదు. ఇది పట్టపగటి బందిపోటు. స్వయంగా జిల్లా ఎగ్జిక్యూటివ్ కమిటీకి పోయి చెప్పుకుంటా, నాన్నా! జీను ఎక్కడవుంది." అన్నాడు, టిమోఫీ.

"జిల్లా ఎగ్జిక్యూటివ్ కమిటీకి వెళ్ళదల్చుగుంటే నడిచివెళ్లు.

గుత్రాన్ని మాత్రం ఇయ్యం." అండ్రి ఆక్కడ వున్న బల్లఅంచు అని కూర్చుని, కాగితం పెన్సిలు పైకితీసేడు.

కోపంచేత ఫ్రోల్ శరీరం వణకసాగింది. ముక్కుపుటా లదిరేయి. హఠాత్తుగా నిల్చున్నచోటనే కూలబడిపోయేడు. నాలిక తడబడింది. "పిశాచాలు! దోచుకోనండి! తడి గుడ్డలతో గొంతుకలు కోసే రకం. చంపెయ్యండి, మన్మల్ని." అని మూలిగేడు.

"నాన్నా! లే! దేవుడు చూస్తాడులే!" ఏడుస్తూ అతని కూతురు ఫ్రోల్‌ను జబ్బపట్టుకొని లేవతీసింది. అతడూ—కొంచెం స్థిమితపడి, బల్లమీద పడుకొని, డెమ్కా—ఉపాకోవ్, మైకేల్ ఇగ్నటినోవ్‌లు, చెబుతూంటే రజ్మటొన్నోవ్ రాస్తూండడం చూస్తోన్నాడు.

"ఒక ఇనప మంచం. మూడు తలగడాలు, రెండు కంబళ్లు"

"రెండు పట్టిమంచాలు."

"వంటసామగ్రితోనున్న 'కప్‌బోర్డు' ఒకటి. వివరంగా ఆ సరుకుల పేర్లన్నీ చెప్పాలా ఏమిటి! చచ్చేం!"

"పన్నెండు కుర్చీలు, ఒక సోఫా.

"పియానో ఒకటి."

"నా 'పియానో' మాత్రం నేనివ్వను." అన్నాడు టిమోఫీ—డెమ్కా చేతుల్లోని 'పియానో' లాక్కుంటూ.

"దూరంగా వుండి మరీ మాట్లాడు! లేకపోతే చంపేస్తాను."

అని డెమ్కా గర్జించేడు. "ముసలమ్మా! పెట్టెల తాళంచెవు లన్నీ ఇల్లా పారెయ్య."

"అమ్మా! ఏమయినాసరే— తాళంచెవులు మాత్రం ఇవ్వను. చేతనయితే పెట్టెలు బద్దలుకొట్టి తీసుకువెళ్ళనీ."

"వాటిని బద్దలుకొట్టడానికి అధికారం వుందా మనకి?" అన్నాడు మూగ డైమిడ్. అతడు సాధారణంగా ఎప్పుడో కాని మాట్లాడడు. మాటా, మంతీ లేకుండా, తన పని తను చేసుకోవడం,— తీరిక సమయాల్లో మిగిలిన కోసక్కులతో కూర్చున్నా, మాట్లాడకుండా చుట్ట కాలుస్తో, వాళ్ళు చెప్పుకొనే మాటలు వింటూండడం — మీటింగులకు వెళ్ళినా మాట్లాడక ఏమూలనో కూర్చోవడం అతనికి మామూలు. అందుచేత ప్రజలంతా అతనిని 'మూగ డైమిడ్' అని పిలుస్తారు. డైమిడ్‌కి ప్రజలంతా మాట్లాడుకొనేది అనవసరంగా కనిపిస్తుంది. గడబిడ అతనికి ఏమాత్రము కిట్టదు. అందుచేత గ్రామంతో సంబంధంలేకుండా దూరంగా ఒక చిన్న గుడిసె వేసుకొని కష్టపడి పనిచేసుకొని జీవిస్తాడు. ఆ ప్రాంతంలో అంతటి బలవంతు డెవడూ లేడు. కాని దుర దృష్టవశాత్తు, అతనికి జీవితం పొడుగునా అన్నీ నష్టాలే. మొదట 8 సం॥వరకు ఫ్రోల్ డెమాస్కోన్ దగ్గర కూలిపని చేసేడు. తరువాత పెళ్ళి చేసుకొని, కౌలుకొండ్రిలు చెయ్యడం మొదలెట్టేడు. వరుసగా 2 సం॥లు పైరు కుప్పమీద వుండగా ఎవరో అంటించేసేరు. అందుచేత అతని శ్రమ అంతా వృథా

అయింది. తరువాత కొద్ది రోజులకు అతని భార్య, "రెండు సం॥లనుంచి నీతో కాపరం చేస్తోన్నా. నాతో ఒక్కసారికూడా నోరు విప్పి మాట్లాడలేదు. ఇంక నేను నీతో వుండను. నీ దగ్గర వుండేకంటె అడవిలో వుంటే నయం. అక్కడ, ఆఖరికి ఏ జంతువుల అరుపులేనా వినిపిస్తాయి. ఇక్కడ వుంటే ఇంక పిచ్చి కూడా ఎత్తేలా వుంది." అని అతనిని వదలిపెట్టి వెళ్లిపోయింది.

మొదట డైమిడ్ మీద ఆమె చాలా ప్రేమగా వుండేది. "డైమిడ్! నాతోనైనా మాట్లాడు! ఒక్కమాట మాట్లాడితే చాలు." అని బ్రతిమాలి ఏడుస్తోండేది. దానికి సమాధానంగా డైమిడ్ చిరునవ్వు నవ్వి ఊరుకొనేవాడు. కాని డైమిడ్ మోసగాడని, ఎవరు ఎన్ని చెప్పినప్పటికి, స్వతంత్రంగా ఆలోచించి, బుద్ధికి ఎంత తోస్తే అంత చేస్తాడనీ వాడుక. కొంతవరకు అది నిజం అయితే అవనూవచ్చు.

ఎప్పుడూ, మాట్లాడని డైమిడ్ మాట వినిపించగానే. ఆండ్రి తల ఎత్తి చూసేడు.

"అధికారం వుందా, అంటావా!" డైమిడ్‌ను అంత క్రితం ఎప్పుడూ చూడనట్లు ఆశ్చర్యంగా చూసేడు.

"ఆ! మనకి అధికారం ఉంది!"

బాగా చిరిగిపోయిన బూట్లతో పెద్దపెద్ద అంగలు వేస్తూ, డైమిడ్, పెట్టెలు వున్న గదిలోకి వెళ్ళేడు. ద్వారబంధం కమ్ములు పట్టుకొని గదిగుమ్మానికి అడ్డంగా నిలబడ్డ టిమోఫీని

వీళ్ళుమున్నేరు.

మెడ పట్టుకొని గెంటేసి, చిందరవందరగా నేలమీద పడియున్న సామాను తొక్కుకుంటూ తిన్నగా పెట్టెల దగ్గిరికి వెళ్ళేడు. అక్కడ కూర్చొని, పెట్టెకి తగిల్చియున్న తాళంకప్ప పట్టుకొని త్రిప్పి, ఘుడియ విరిచి లాగేసేడు. అర్కా షా డైమిడ్ బలానికి నిర్ఘాంతపోయి, "అంత బలం నాకుంటే బాగుండును." అనుకున్నాడు.

ఆండ్రీ వ్రాసిన లిస్టు ప్రకారం సామానంతా దొరకలేదు. గదిలోనుంచి డెమ్కా ఉషాకోవ్, అర్కా షా, ఆండ్రీ దళంతోకూడా వచ్చిన 'అవ్ డైవెసిలీసా' అను ఒక యువతి, ఒకరి కంటె ఒకరు గట్టిగా, చెప్పడం మొదలెట్టేరు.

"ఆడవాళ్ళు తొడుగుకొనే ఉన్నికోటు ఒకటి."

"8 జతల కొత్తబూట్లు."

"ఒక అరతాను గుడ్డ."

"ఆండ్రీ! ఈ సామానంతా ఒక బండిమీద వెళ్ళడం కష్టం. రెండు పట్టుబట్టలు, గౌనులు, ఇంకా చాలా సరుకు వుంది."

ఆండ్రీకూడ లేచి గదిలోకి వెళ్ళేడు. ఇంతలో బయట వసారామీదనుంచి, ఫ్రోల్ కూతురు ఏడ్పు, ఇంకొక స్త్రీ కేకలు, ఇగ్నటియోనక్ మాటల సందడి వినిపించి గభాలున తలుపులు తెరిచేడు.

"ఏమిటి, ఈ గొడవ!"

కళ్ల నీళ్లు కారుస్తూ, ఒకమూల చేతులు ముడుచుకొని, ముందు

కవంగి ఫ్రోల్ కూతురు ఏడుస్తోంది. ఆమె తల్లికూడ అక్కడే తిరుగుతూ ఇగ్నటియోనక్‌ను తిట్టిపోస్తోంది. కందగడ్డలా ఎర్ర బడ్డ ముఖంతో ఇగ్నటియోనక్ చిరునవ్వు నవ్వుతూ ఫ్రోల్ కూతురు తొడుగుకొనిన చొక్కా పట్టుకొని లాగుతూన్నాడు.

“ఏమిటిది?......నీకేమేనా మతిపోయిందా?” అంటూ అసలు విషయం తెలుసుకోనకయే, అతికోపంతో ఇగ్నటియోనక్‌ను చెక్కిలి కొట్టేసేడు. అతడు వెల్లకితలం పడిపోయేడు. “చాలాబాగుంది.” అని ఆండ్రీ గర్జించేడు. “అక్కడ మేము సామాన్లు జప్తు చేస్తోంటే, ఈమూల నువ్వు ఆడపిల్లల్ని బలాత్కారం చేస్తున్నావా! కోర్టులో దీనికి సమాధానం చెబుదువు గానిలే......”

“ఆగండి! అసలు విషయం ఏమిటో తెలుసుకోకుండా తొందరపడకండి” ఇగ్నటియోనక్ కంగారుతో లేచి నిలబడ్డాడు. “ఆడపిల్లల్ని బలాత్కరిస్తున్నానా? చూడండి! ఎనిమిది చొక్కాలు తొడిగి తొమ్మిదవది తొడుగుతూండగా అడ్డగిస్తే ఇదా వీరు అనేది?”

అప్పుడు, హాలులో గందరగోళం జరుగుతూన్న సమయంలో ఎవ్వరు చూడకుండా ఫ్రోల్ కూతురు ఇంట్లోని విలువైన బట్టలన్నీ తీసుకొనిపోయి ఒకదానిమీద ఒకటి తొడుక్కుందని, ఆండ్రీ గ్రహించేడు. చొక్కాలు, గౌనులు అడావిడిగా ఒకదానిమీద ఒకటి తొడిగేసుకొని గడ్డిబొద్దులా మూలనిలబడి పై

చొక్కా బొత్తాలు పెట్టుకుంటూంది. కన్నీళ్ళు చారలుకట్టి, దీనంగా ఉన్న ఆమె ముఖం చూడగానే ఆంద్రీకి జాలికలిగింది. "తొడుక్కున్నవేవో తొడుక్కుంది. అవి లాక్కోకు. కాని ఆ మిగిలినవేమీ ఇక్కడ వుండనియ్యక తీసుకొనిపో." అని తలుపులు వేసి లోపలికి వచ్చేసేడు.

మరికొంతసేపటికి ఇంట్లోని వస్తువులన్నీ జాబితా తయారు చేసి, ఒకచోటికి చేర్చడం పూర్తిఅయింది.

"ధాన్యపుకొట్టు తాళంచెవులు కూడా ఇచ్చెయ్యి." అని ఆంద్రీ అడిగేడు.

ఫ్రోల్ ముఖం మాడిపోయినట్లు నల్లబడిపోయింది. "మా దగ్గిర లేవు" అంటూ చెయి తిప్పేడు.

"వెళ్ళి తాళం బద్దలు కొట్టెయ్యి." అని ఆంద్రీ డైమిడ్‌కి ఆజ్ఞాపించేడు. ఒకమూలపడియున్న గొడ్డలి తీసుకొని, డైమిడ్ బయలు దేరేడు. రెండు పీశల బరువైన ధాన్యపుకొట్టు తాళం బద్దలు కొట్టేటప్పటికి డైమిడ్‌కి వొళ్ళంతా ముచ్చెమటలూ పోసేయి.

"జాగ్రత్త! తలుపు కమ్మికి దెబ్బ తగలనియ్యకు. ఇప్పుడు అది మనసొమ్ము. పాడుచెయ్యకు." అన్నాడు డెమ్కా చెమటలు కక్కుతూన్న డైమిడ్‌తో.

ధాన్యపుతూకం ప్రారంభం అయింది. "ఈ ధాన్యం ఇప్పుడే తీసుకుపోతే బాగుంటుందేమో, ఇక్కడినుంచి! ధాన్యం బాగు

చెయ్యడానికి జల్లెడకూడా సిద్ధంగా ఇక్కడే వుంది." అన్నాడు ఇగ్నటిమోసక్ సంతోషం పట్టలేక. అంతా పకపకా నవ్వారు.

"వంద బస్తా పైగా వుంటుంది." అన్నాడు డెమ్యాక్ లోపలికి దిగి ధాన్యం తోడుతూ. గుప్పెడు గింజలు తీసి, చేతితో తూస్తూ, "గింజ మంచి తూకంగా ఉంది బంగారంవంటి ధాన్యం. పనమీద బాగా ఎండకపోవడంచేత కొంచెం ముక్క వాసన మాత్రం వేస్తోంది" అన్నాడు. అగ్గాప్కా ఇంకొకనతో కలిసి దొడ్లో పచారుచేస్తోన్నాడు. ఎర్రటి గడ్డం నిమురుకుంటూ, పేడలో కనిపిస్తూన్న అరగని జొన్నగింజలు చూపిస్తూ "బాగా పనిచేసేయంటే, చెయ్యవూ; జొన్నలు, ఉలవలు తెగ తిని! గడ్డి అయిపోతుందని భయంతో, రండేసి పరకలు వేసి పొద్దస్తమానం కట్టిపెట్టి, పనిచెయ్యమంటే ఎల్లాచేస్తాయి మన ఎడ్లు!" అన్నాడు.

ధాన్యపుకొట్టు దగ్గరనుంచి నవ్వులు, పరిహాసాలు వినిపిస్తున్నాయి. ధాన్యపు గాబు ఎగురుతూంది. అక్కడినుండి ఆంద్రీ ఇంట్లోకి వెళ్ళేడు. తల్లీ, కూతురు వంటసామానంతా సంచీలో వేసి మూట కడుతూన్నారు. కాళ్లను బూట్లు లేకుండా, ఫ్రోల్ గుండెలమీద చేతులు వేసుకొని బెంచీమీద చచ్చిపోయినట్లు పడి వున్నాడు. ఆండ్రీని చూడగానే టిమోఫీ అసహ్యంతో వెనక తిరిగి కిటికీలోనుంచి బయటకి చూస్తూ నిల్చున్నాడు.

బీళ్ళుదున్నేరు.

ఆండ్రీ గదిలోకి వెళ్ళేటప్పటికి డైమిడ్ కూర్చుని ఉన్నాడు. అతని కాళ్ళని, అంతక్రితం ఫ్రోల్ తొడుక్కొనియున్న కొత్త ఫెల్టు బూట్లు ఉన్నాయి. పెద్ద స్పూన్‌తో బాల్చీలోని తేనె తీసి నోట్లో పోసుకొని తాగుతూన్నాడు. కళ్ళు సంతోషాన్ని వెలిగ్రక్కుతూన్నాయి.



# ఎనిమిదో ప్రకరణము.

## ప్రతిఘటన.

నగుల్నోవ్ టిటాక్‌ను తీసుకొని ఊళ్ళోకి వచ్చేటప్పటికి రెండుఝాము లయింది. ఈలోపుగానే దేవిడోవ్ ఇద్దరు భాగ్యవంతుల ఆస్తులను జప్తుచేసి వారిని కుటుంబాలతో సహా బయటికి వెళ్లగొట్టేడు. తరువాత టిటాక్ ఇంటికి తిరిగి వచ్చి, లుబిష్కిన్ సహాయంతో ధాన్యం తూకంవేసి, బస్తాలలోకి పట్టేడు. పనికి రాని అడుగుధాన్యం పోగుచేసి, ఘూకర్ గొఱ్ఱెలకి పోస్తూంటే టిటాక్ కనిపించేడు.

బొరోడిన్ గుఱ్ఱాన్ని దొడ్లోకి పోనిచ్చేడు. బొత్తాలు ఊడిపోయి అతని కోటు గాలికి ఎగురుతూంది. నెత్తిమీద టోపీ కూడా లేదు. అతడు తిన్నగా కళ్లంవైపు దారితీసేడు.

“టిటాక్! ఆగు! చెప్పినమాట వినకపోయేవంటే ఇప్పుడే బేడీలు వేయిస్తాను.” అని కేక వేసేడు నగుల్నోవ్.

మకార్ చాలా కోపంగా ఉన్నాడు. టిటాక్ తిరిగివస్తే

అతని చేతిలోని తుపాకీ నగుల్నోవ్ చూడకుండా ఎక్కడో పారేసేడు. ఊళ్ళోకి వచ్చిన తరువాత నగుల్నోవ్, "నీదగ్గర తుపాకీ ఇచ్చేస్తావా? బలవంతంగా అయినా సరే, నీ దగ్గరనుంచి ఎలాగా లాక్కుంటాం." అన్నాడు.

"ఈ వేళ కోశాలు కట్టినట్టు" టిటాక్ నవ్వేడు. "నాదగ్గర తుపాకీ ఉందని కలగన్నావేమో."

తీరా చూసేటప్పటికి టిటాక్ దగ్గర తుపాకీ లేకపోయింది. ఆ తుపాకీకోసం, వెనక్కి వెడితే లాభం ఉండదు; యే రుప్పలలో పారేసేడో వెతికి పట్టుకోవడం అసంభవం. అందుచేత తన తెలివి తక్కువకి తననే నిందించుకుంటూ, నగుల్నోవ్ ఈ విషయం యావత్తూ దేవిడోవ్ కి తెలియచేసేడు.

వెంటనే దేవిడోవ్ టిటాక్ దగ్గిరికి వచ్చి, "మీదగ్గిర వున్న తుపాకీ ఇచ్చెయ్యండి. మీ బాగు కోరి చెబుతూన్నాను." అన్నాడు.

"అసలు నా దగ్గిర తుపాకీయే లేదు. ఇదంతా నగుల్నోవ్ కల్పించి చెప్పేడు, నామీద కోపంచేత." టిటాక్ నవ్వేడు.

"మిమ్మల్ని అరెస్టుచేసి, ఖైదులో ఉంచవలసి వస్తుంది. జాగ్రత్త."

"అరెస్టు చేస్తారా నన్ను?"

"అవును. అరెస్టు చేస్తాం. ఇంక ఏమి చెయ్యగలం చెప్పండి! ఇంతవరకు మీరు చేసిన పనలు జ్ఞప్తికి తెచ్చుకోండి! పరిభా

త్యానికి ధాన్యం బకాయి పెట్టేరు. ఇంతక్రితమే మీరు...”

“ఎన్నో!” ‘మీదకు ఉరుకుతాడా’ అన్నట్లు ముందరికి వంగి తీవ్రంగా అన్నాడు.

ఇంక కోపం అణుచుగోలేకపోయేడు. అంతవరకు అతనిలో అణగివుండిన కోపం దేవిడోవ్ మాటలతో ఒక్కసారి ఉప్పొంగింది. ఎదర నిలబడియున్న దేవిడోవ్‌ని తోసేసి, పరుగెత్తుకొని వెళ్లి క్రిందపడియున్న ఇనపసీల చేతపుచ్చుకొన్నాడు. దేవిడోవ్ సహాయంకోసం నగుల్నోవ్, లుబిష్కిన్‌లు పరుగెత్తుకొని వచ్చేరు. ఇదంతా చూసి ఖూంకర్ వెనుతిరిగి చూడకుండా వీధులోకి పరుగెత్తేడు. ఆ కంగారులో చీలమండల వరకు వేలాడుతూన్న కోటు కాళ్ళకి అడ్డుపడి,

“అయ్యో! హత్య! హత్య! సహాయంరండి!” అని అరుస్తూ చాపచుట్టగా క్రిందపడిపోయేడు.

దేవిడోవ్, మీదికి వస్తూన్న టిటాక్‌ని ఎడమచేతి గుత్తి పట్టుకొని ఆపేడు. కాని టిటాక్ కుడిచేతనున్న ఇనుపసీలతో దేవిడోవ్ నెత్తిమీద సత్తువకొలది ఒక్కదెబ్బ కొట్టేడు. దేవిడోవ్ కళ్లు చీకట్లుకమ్మేయి. కాళ్ళు తేలిపోయేయి కాని నిలతొక్కుకున్నాడు. నెత్తిమీది గాయములోనుంచి రక్తము కారి కళ్లు మూసుకుపోయేయి. టిటాక్ చెయ్యి వదలివేసి రెండు చేతులతోను కళ్ళు మూసుగున్నాడు. ఇంతలో టిటాక్ కొట్టిన రెండవదెబ్బతో క్రింద పడిపోయేడు. వెంటనే లుబిష్కిన్

టిటాక్‌ను కౌగలివేసి పట్టుకున్నాడు. అతన్ని విదల్చిపారేసి టిటాక్ అతివేగంగా కళ్లంవైపు పారిపోయేడు. నగుల్నోవ్ అతనిని తరుముకొనిపోయి గుమ్మముదగ్గర అందుకొని రివాల్వరు మడమతో ముచ్చిలిగుంటమీద ఒక్క దెబ్బ కొట్టేడు.

లుబిష్కిన్, నగుల్నోవ్‌లు తన భర్తను పట్టుకొనడానికి పరుగెత్తడం చూసి, టిటాక్ భార్య గాది దగ్గరకు పరుగెత్తుకొని వెళ్ళి, కుక్కని వదిలేసింది. భయంచేత వెర్రికేకలు వేస్తోన్న ఘూకెర్‌ని, చూడగానే కుక్క అటువైపు, పరుగెత్తి, తెల్లటి అతని కోటుమీదపడి పళ్ళతో కరిచి లాగడం మొదలెట్టింది. కోటునుంచి పింజపింజలుగా ఊలు, అనేక సందులనుంచి ఆశ్రియించియున్న దుమ్ము ఎగరడం మొదలెట్టింది. ఘూకర్ గభాలున లేచి. కుక్కని కాలుతో తన్ని కోటు వదల్చుకొనడానికి ప్రయత్నించేడు. కాని కుక్క వదలకుండా, ఇంకా గట్టిగా కరిచిపెట్టి వెనక్కి లాగడం మొదలెట్టింది. కొంతసేపటికి ఘూకర్ అతి ప్రయత్నముమీద 4, 5 గజముల దూరములోనున్న దడివరకు ఈడ్చుకొని వెళ్లి దడికర్ర ఒకటి లాగేడు. కుక్క పట్టువదలి మొరుగుతూ పారిపోయింది. కాని పారిపోయేముందు ఒకకొస కాళ్ళతో త్రొక్కిపట్టి రెండవకొస నోట కరిచిపెట్టి సత్తువకొద్ది లాగడంలో కోటు నిలువునా రెండు చీలిక లయిపోయింది.

కుక్క పారిపోవడంతోటే ఘూకర్‌కి కొంత ధైర్యం

చిక్కింది "మకార్! ఆ రివాల్వరు ఇల్లా ఇయ్యి. ఈ కుక్కని, దీని యజమానురాలిని కూడా కాల్చిపారేస్తాను." అని ఆర్చేడు.

ఈలోపుగా లుబిష్కిన్, మకార్. కలిసి దేవిడోవ్ ను చేతులమీద ఇంట్లోకి తీసుకొనిపోయి, నెత్తిమీద గాయం తగిలిన చోట జుట్టు కత్తిరించేసేరు. ఇంకను నల్లటిరక్తం ఏకధారగా కారుతూనే వుంది. లుబిష్కిన్ పాకెలోనున్న స్లెడ్జిబండి ఒకటి పైకి తీనుకొనివచ్చి గుడ్రాలని వూనేరు. నగుల్నోవ్ త్వరగా ఒక ఉత్తరం వ్రాసి లుబిష్కిన్ కి ఇచ్చేడు.

"జిల్లా పోలీసుశాఖాధికారికి.

"కామ్రేడ్ జఖరింకో! [ఓగ్ప్యూశాఖకి జిల్లాప్రతినిధి.] మోసగాడు, విద్రోహి, పెద్దరైతు అయిన 'టిటాక్ కాన్‌స్టాంటినోవిచ్ బొరోడిన్' అనే ఇతనిని మీ స్వాధీనం చేస్తూన్నాను. ఇతని ఇంటికి పోయి ఆస్తిని స్వాధీనం చేసుకుంటూ వుండగా, ప్రభుత్వముచేత ఇక్కడకు పంపబడిన కామ్రేడ్ దేవిడోవ్ నెత్తిమీద ఇనుపఖడ్డీతో రెండుసార్లు కొట్టి అతనిని చంపడానికి ప్రయత్నించేడు.

అంతే కాదు. ఇతనివద్ద నాటురకపు తుపాకీ ఒకటి చూసేను. ఆ సమయంలో మేమిద్దరం ఒక కొండవారనే నడిచి వస్తూన్నాము. అప్పుడే లాక్కుందుకు ప్రయత్నిస్తే పరిస్థితులు ఏలాగ పరిణమిస్తాయో అనీ, తరువాత తీసుకోనవచ్చుననీ ఊహించి ఊరుకున్నాను. కాని దోవలో ఎక్కడనో నా కంటపడకుండా

దానిని దాచేసేను. అది దొరికిన తరువాత, దానిని సాక్ష్యం కోసం మీ ఎదుట దాఖలు చేస్తాను.

"మకార్ నగుల్నోవ్."

అఖిల రష్యన్ కమ్యూనిస్టుపార్టీయొక్క గ్రెమ్యాచీలాగ్
శాఖకి కార్యదర్శి

Member of the order of the red banner.

వారిద్దరు టిటాక్‌ను స్లెడ్జిబండిలోకి ఎక్కించేరు. కొంతసేపటికి అతడు మంచినీళ్లు కావాలనీ, ఒక్కసారి నగుల్నోవును తీసుకొనిరమ్మనీ కబురంపేడు.

మకార్ వసారామీదికి వచ్చి,

"ఏం కావాలి?" అని కేకవేసేడు.

"మకార్! జాగ్రత్త! జ్ఞాపకంఉంచుకో." సంకెళ్ళు చప్పుడయేలాగ బొరోడిన్ చేతులు ఊపుతూ కేకపెట్టేడు.

"మళ్ళీ మనం కలుసుకోనకపోము. ఇప్పుడు నన్ను అథఃపాతాళానికి తొక్కేసేవు. దీనికి తగిన ప్రతీకారం చేసి తీరుతా! ఆ ప్రతిక్రియ ఏమిటో తెలుసునా? హత్య. నిన్ను ఖూనీచెయ్యకపోతే నాకు మారు పేరు పెట్టు."

"పోరా, ద్రోహీ! నువ్వు చేసేదేమిటి?" అంటూ నగుల్నోవ్ చెయ్యి ఊపేడు.

బండి కదిలి వెళ్ళిపోయింది.

# త్రొమ్మ్రవో ప్రకరణము.

## విషయ నిర్ధారణ.

జప్తు చేసిన 'గెయూవ్' ఆస్తి అంతా బళ్లమీద 'టిటాక్' ఇంటికి చేర్చి, రోజంతా విశ్రాంతి లేకుండా పనిచేసి అలసి యున్న బీదకోసక్కులను ఇళ్ళకు పంపేసి, రజ్మెట్నోవ్ సోవియటు ఆఫీసుకు వచ్చేటప్పటికి కనుచీకటి పడుతూంది.

చీడీలు ఎక్కుతూంటే గదిలో ఒకమూల వెలుగుతోన్న దీపం కనిపించింది.

రజ్మెట్నోవ్ తలుపులు తోసుకొని గదిలోకి వెళ్ళేడు. నోటు పుస్తకం చూస్తోన్న దేవిడోవ్ తలుపు చప్పుడు విని, తెల్లటి గుడ్డతో కట్టుకొనియున్న తల ఎత్తి చూసి చిరునవ్వు నవ్వేడు.

"కామ్రేడ్ రజ్మెట్నోవ్! రండి! ఈవేళ భాగ్యవంతుల దగ్గిరనుంచి స్వాధీనం చేసుకొన్న ధాన్యం మొత్తం ఎంతో లెక్క చూస్తూన్నాం. మీరు వెళ్ళిన పని ఎంతవరకు అయింది?"

"అంతా బాగానే అయింది. కాని తలకి కట్టు కట్టేరెందుకు?"

దీపం వెలుతురు కళ్ళకి తగలకుండా ఒక కాగితం అడ్డం పెనుతో, నగుల్నోవ్ "టిటాక్ కొట్టేడు, ఇనుప ఖడ్డీపుచ్చుకొని. అతన్ని అరెస్టుచేసి పోలీసుస్టేషనుకి పంపించేము." అన్నాడు.

"ఒక్క నిమిషం ఆగండి. ఆ విషయాన్ని గురించి తరవాత చెబుతాము." అంటూ డేవిడోవ్, పక్కన వున్న పూసలచట్రం టేబులు మధ్యకి లాగేడు. "నూటపదిహేను కలపండి, అయిందా? నూటఎనిమిది........."

"ఆగండి! నింపాది." అంటూ నగుల్నోవ్ పూసలు లెక్క పెడుతోన్నాడు.

ఆంద్రీ పెదవులు చలిస్తూన్నాయి. ఆందోళనతో వాళ్ళ వైపు చూస్తూ, "ఇంతటినుంచి నేను కలగచేసుకోను." అన్నాడు.

"ఏమిటి కలగచేసుకోకపోవడం?" అన్నాడు, నగుల్నోవ్ పూసలచట్రం పక్కకితోస్తూ.

"ఈ భాగ్యవంతుల ఆస్తులు జప్తుచేసి, వాళ్లని ఇళ్లలోనుంచి బయటికి గెంటెయ్యడం నాకల్లకాదు. ఏం అల్లా చూస్తావెందుకు? మతిపోయిందా ఏమిటి?"

"తాగివచ్చినట్లు అల్లా మాట్లాడతున్నావేమిటి?" అన్నాడు డేవిడోవ్, కోపాన్ని వెలిగ్రక్కుతూన్న ఆంద్రీ ముఖంకేసి చూస్తూ. "అసలు విషయం ఏమిటో చెప్పండి. మీ ఉద్దేశ్య మేమిటో బోధపడుటలేదు."

"నేను ఇంతవరకు ఎప్పుడు, అమాయకులైన పిల్లల్ని చంపడం నేర్చుకోలేదు. యుద్ధంలో సంగతి వేరు. అక్కడ కత్తిపుచ్చుకొని శత్రువుల్ని, మనకి తోచినవాళ్ళని చంపుతాము...... మీ ఇష్టం; మీరు ఏమి చేసుకొన్నా సరే. నేను మాత్రం కల

గచేసుకోను." అతని కంఠస్వరం అంతకంతకు తీవ్రం అయింది. నిట్టూర్పు విడిచి ఆరాత్తుగా కంఠస్వరం తగ్గించి నెమ్మదిగా చెప్పడం ప్రారంభించేడు.

"అది న్యాయం అంటారా? హంతకుడిని అనుకుంటున్నారా నన్ను? నాకు కూడ హృదయం అనేది వుంది. ఇదివరకు చేసినది చాలు........." మళ్ళీ గట్టిగా అరుస్తూ చెప్పడం మొదలెట్టేడు. "గెయీవ్ కి పదకొండుగురు పిల్లలున్నారు. మేము వాళ్ళని బయటికి గెంటేసేటప్పుడు ఎంతవికారంగా ఏడ్చేరు! ఆ ఏడుపు చూచి నా గుండెలు నీరయిపోయేయి. అంత మందిని బయటికి గెంటేసి, నిలువ నీడకూడా లేకుండా చేసేము... ఆ దృశ్యం చూడలేక లోపలికి వెళ్ళిపోయేము. ఆడవాళ్ళ ముఖాలమీద కత్తివేస్తే నెత్తురుచుక్క లేదు. అతని కోడలు మూర్ఛ.........పిల్లలు......అబ్బా! మీకు మాత్రం......"

"ఆ ఏడ్చేది ఏదో గట్టిగా యేడు! బరువు తగ్గుతుంది." అన్నాడు నగులోన్లేవ్, ఆండ్రీకేసి చూస్తూ.

"ఏడుస్తూనే వున్నాను. పాపం, పుణ్యం ఎరగని పసిపిల్లలు........." ఆండ్రీ కంఠం రుద్ధమైపోయింది. నోరు తెరిచి వెనుదిరిగి బల్లనానుకొని నిలబడ్డాడు.

అంతా నిశ్శబ్దం.

డేవిడోవ్ నెమ్మదిగా లేచి నిలబడ్డాడు. ఆండ్రీ దగ్గరికి వెళ్ళి, అతని జబ్బపుచ్చుకొని తన వైపుకి త్రిప్పుకొన్నాడు. భారంగా

ఊపిరి పీలుస్తూ, ఆండ్రీ ముఖంలోకి చూస్తూ మాట్లాడడం మొదలెట్టేడు.

"వాళ్ళకోసం విచారిస్తున్నారు.........వాళ్ళని దయదలచాలంటారు. వాళ్లు మనల్ని ఏనాడైనా దయదల్చేరా? మన పిల్లల కన్నీళ్లు చూసి, శత్రువులు ఎన్నడేనా ఏడ్చేరా? వాళ్ళ క్రౌర్యానికి బలియైన వాళ్ళ అనాథ శిశువుల్ని చూసి ఒక కన్నీటిబొట్టుకూడా రాలేదే వాళ్ళకి! సరే! ఒక్కవిషయం చెబుతా. వినండి. ఒకపర్యాయం సమ్మెలో పాల్గొన్న నేరమునకు మా తండ్రిని సైబీరియా ప్రవాసానికి పంపించేరు నలుగురు పిల్లల్ని పోషించవలసిన భారం మా అమ్మమీద పడింది. అందరికంటె నేనే పెద్దవాణ్ణి. తొమ్మిది సం॥లు కూడా నిండాలేవు. ఒక్కపూటకూడా గడచీవెత్తు లేదు. అందుచేత ధనసంపాదన కోసం మా తల్లి......... నాకేసి చూడండి!.........మేము ఆకలిచేత చచ్చిపోకుండా, ఇంత గంజేనా పోసి ప్రాణాలు నిలబెట్టడానికి, సిగ్గు చంపుకొని వీథులవెంట బయలుదేరి వెళ్లేది. తిరిగి, తిరిగి, ఎవరినోకూడా తీసుకొని ఇంటికి వచ్చేది, అప్పుడు మేమంతా ఒకటే గదిలో వుంటూండేవాళ్లం. ఆ గది సన్నంగా, తల ఎత్తుతే అటక నెత్తికి తగులుతూ, సొరంగంలా వుండేది. మా కుటుంబానికి అంతకి ఒకటే మంచం. అందుచేత నేను మిగతా ముగ్గురు పిల్లలతోను నేలమీద పడుకొనేవాడిని. ఒక చిన్న తెర అడ్డంకట్టి వాళ్లు ఆ మంచంమీద పడుకొనేవారు...

...నేను తొమ్మిది సం॥ల కారాగ్రిహ్నే......ఆమెతో కూడా వచ్చేవాళ్లు తప్పతాగి ఒళ్ళు తెలియని స్థితిలో వచ్చేవాడు. పిల్లలు ఏడవకుండా నేను ఊరుకోబెట్టమని వచ్చేది...... మా కళ్ళ నీళ్ళు చూసి ఎవరేనా జాలిపడ్డారా? కామ్రేడ్స్! వింటున్నారా? అక్రమంగా సంపాదించిన కొద్ది ఎకరాలను మరునాడుదయం తీసుకొని వెళ్ళేవాడిని......" దేవిడోవ్ పళ్ళు పటపట కొరుకుతూ చెయ్యి ఎత్తేడు. "మా ప్రాణాలు నిలబెట్టుకోడానికి, ఆ డబ్బులతో ఇంత రొట్టె కొనుక్కొని తినేవాళ్ళం......" అరాత్తుగా బల్లమీద గుద్దేడు. "అటువంటి క్రూరుల్ని రాక్షసుల్ని ఎల్లా దయదలుస్తావు?"

మళ్ళీ అంతా నిశ్శబ్దంగా వున్నారు. దేవిడోవ్ గదిలో పచారు చేస్తూన్నాడు. ఆండ్రీ మాట్లాడక వూరుకున్నాడు. కొంతసేపటికి దేవిడోవ్ వెనకనుంచి ఆండ్రీ జబ్బలు పట్టుకొని, బల్లమీద కూర్చోబెట్టి, పక్కని తనుకూడా కూర్చున్నాడు.

"మీ మనస్సు చెదిరిపోయింది. విచారిస్తూ వచ్చి "నేను పనిచేశాను......పిల్లలు......జాలి, అని అనడంలో అర్థం లేదు. మీరు ఆ వుద్దేశ్యం మార్చుకుంటారా? మంచిచెడ్డలు తర్కించండి. భాగ్యవంతుల ఆస్తులు జప్తుచేసి వారిని ప్రవాసం పంపడం అన్యాయం అంటారా? మళ్ళీ ఆలోచించండి. అధిక సంఖ్యాకుల అభివృద్ధి సౌఖ్యములకు ఆటంకముగానున్న కొద్ది మంది భాగ్యవంతులను తొలగించి......ఇంతటినుంచియైనా

బీళ్ళుమన్నేరు.

ఈ అన్యాయం జరగకుండా చెయ్యడం మన విధి! ఈ గ్రామంలో సోవియటు ప్రభుత్వపు ప్రతినిధులుగానున్న మీకు నేను చెప్పవలసి రావడం విచారకరమైన విషయం." డేవిడోవ్ లేని నవ్వు తెచ్చిపెట్టుకున్నాడు. "ఈ భాగ్యవంతుల్ని అందర్ని తెల్లసముద్రములోని సొలోవ్కీ ద్వీపానికే కాదు, నరకానికి పంపించినా దోషంలేదు. ఎక్కడికి పంపించినా చచ్చిపోరు: మరేమీ భయంలేదు. ఒళ్లు వంచి కష్టపడి పని చేస్తే ఇంత తిండి పారేస్తాం. నూతన సమాజ స్థాపన జరిగిన తరువాత మన శ్రామిక వర్గం ఆ భాగ్యవంతుల సంతానానికి సరియైన శిక్షణనిచ్చి, సన్మార్గానికి త్రిప్పుతారు. భాగ్యవంతులు బీదలు అనే భేదం నశించి పోతుంది." జేబులోనుంచి సిగరెట్టు పెట్టి తీసేడు. కాని వేళ్ళు వణుకుతూ పట్టు తప్పియుండడంచేత చాలాసేపటివరకు సిగరెట్టు తియ్యలేకపోయేడు.

డేవిడోవ్ మాట్లాడుతూన్నంతసేపు, నగుల్నోవ్ ముఖం క్రోధంచేత ఎర్రబడిపోయింది. శరీరం అంతా చమట గుడ్లు పోసినట్లు పోసింది. ఇంతసేపూ కూడా ఆండ్రీ రెప్పకూడా వాల్చకుండా నగుల్నోవ్ ముఖంకేసి చూస్తోన్నాడు. ఇంతలో అకాత్తుగా ఆండ్రీ లేచి నిలబడ్డాడు. నగుల్నోవ్ కూడా కుర్చీ వెనక్కి గెంటేసి లేచి నిలబడ్డాడు.

"ద్రోహీ! శ్రామికవిప్లవం ఎల్లానడిపిస్తోన్నావు నువ్వు! వాళ్ళని చూసి జాలిపడుతూన్నావా! చూడు.........వేల

కొలది ముసలివాళ్ళని, ఆడవాళ్ళని, పిల్లల్ని. వరసగా నిలబెట్టి విప్లవంకోసం వాళ్ళందరిని కాల్చెయ్యాలని చెప్పనాతో. నదురు-బెదురు లేకుండా, మరతుపాకీతో అంతమందిని వరసబెట్టి కాల్చి చంపేస్తాను." అని గర్జించేడు నగులోన్వ్.

"కాల్చడం చాలించి కూర్చోండి ఒక్కసారి." అన్నాడు దేవిడోవ్ తొట్రుపాటుతో.

దోవలో అడ్డం ఉన్న కుర్చీ విసిరిపారేసి ఆంద్రేయ్ నగులోన్వ్ మీదికి ఉరికేడు.

"ఒళ్లు తీటు వదులుస్తానురా!" అన్నాడు నగులోన్వ్.

అతని ఎడమచెయ్యి కత్తిఒరకోసం, కుడిచెయ్యి కత్తిపిడి కోసం వెతికేయి.

ఆండ్రీ కండలుతిరిగి బలిసియున్న మకార్‌ని కౌగలివేసి పట్టుగున్నాడు.

"ఇతనికి వొళ్ళు తెలియడం లేదు. మీరు వచ్చి పట్టుకోండి." అన్నాడు మకార్ దేవిడోవ్‌తో.

*　　　*　　　*　　　*

వారు ముగ్గురు స్కూలు దగ్గిరికి వచ్చేటప్పటికి, మీటింగుకు వచ్చిన జనంతో హాలంతా కిటకిటలాడుతూంది. లోపల స్థలం లేకపోవడంచేత గుమ్మందగ్గిర ఆడవాళ్లు పిల్లలు అంతా ఒకరి నొకరు తోసుకుంటూ నిలబడి వున్నారు.

బద్దలయిన పెదవులమీద కరుడు కట్టిన రక్తంతో, పాలిపో

యిన ముఖంతో, అందరికంటె ముందుగా నకులోవ్ వచ్చేడు. జనమంతా ఒత్తిగిల లోపలికి పోవచ్చేరు. అతని వెనక దేవిసోవ్ వచ్చేడు. అతన్ని చూడగానే గుసగుసలు బయలుదేరేయి

"దేవిసోవ్ ఇతనేనా!" ఒక యువతి అతన్ని వేలెత్తి చూపిస్తూ అడిగింది.

"ఆ ఓవరుకోటుతో ఉన్న ఆయన......అంత ఎక్కువ పెద్దవాడు కాదు..."

"అయితే ఏమి! మంచి ఎముకపుష్టి ఉన్నవాడు. అతని మెడ తెగ బలిసి మున్నపోతు మెడలా ఎల్లా ఉందో చూడు. ఇంకా బాగా మేపమని మన దగ్గిరికి పంపించేరు అతన్ని." గుండ్రటి నీలికళ్లతో చూసి నవ్వుతూ అంది ఒక యువతి.

"చూడండి, చేతులెంత బలంగా ఉన్నాయో! కౌగిలించుకున్నాడంటే పక్క ఎముకలు విరిగిపోవలసిందే!" అంది నటాలియా, కనుబొమలు తిప్పుతో.

"పాపం, మన నటాలియాకి మొగుడు లేకపోవడంచేత, ఎవడేనా మొగాడు కనిపించడం తడువు——ఎంతసేపూ అదే దృష్టి." అని ఒక యువకుడు ఎత్తిపొడిచేడు.

"ఎవరో కొట్టినట్టున్నారు నెత్తిమీద. కట్టుకట్టి ఉంది."

"తలపోటుచేత అల్లా కట్టుగున్నాడేమో."

"కాదు. ఎటాక్......"

"ఏమర్రా! పరాయి మొగాడివైపు అల్లా చూస్తారెందుకు

గుడ్లు మిటకరించి? నాకంటె అందంగా వున్నాడా!" అని ఒక కోసక్కు పకపక నవ్వుతూ చుట్టూ వున్న ఆడపిల్లల్ని చేతులు జాపి పోగుచేసి, గోడ వైపుకి నొక్కేడు. అంతా నవ్వుతూ, అరుస్తూ, ఆ కోసక్కుని గుద్దుతూ, జుట్టులాగుతూ నానాగల్లంతూ చేసేరు.

డేవిడోవ్ గుమ్మం దగ్గిరికి వచ్చేటప్పటికి ఉక్కచేత చెమట పోసింది. జనంలోనుంచి చుట్టల పొగ లేస్తూంది. వోడ్కా వాసన గుప్పుమని కొడుతూంది. ఆడవాళ్ళున్న చోటునుంచి సెంట్లవాసన, కొత్తబట్టల వాసన వేస్తూంది. ప్రజలంతా పట్టు మీద తేనెటీగలలాగ దగ్గరగా కూర్చున్నారు.

డేవిడోవ్ వేదిక ఎక్కుతూ, "ఆడవాళ్లు చాలా మోటుతనంగా వ్యవహరిస్తూన్నారు." అన్నాడు. వేదిక మీద రెండు స్కూలుడస్కులు మాత్రం వున్నాయి. డేవిడోవ్ నగుల్నోవ్‌లు కూర్చున్నారు. రజ్మెట్నోవ్ సభ ప్రారంభంచేసేడు. కొంతసేపు ఉపన్యాసం చెప్పి, "పార్టీయొక్క జిల్లా కమిటీ ప్రతినిధియైన కామ్రేడ్ డేవిడోవ్, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలని గురించి, వివరంగా చెబుతారు. ఇంతటితో నేను విరమిస్తున్నాను" అని ముగించి కూర్చున్నాడు.

హాలంతా నిశ్శబ్దంగా వుంది. డేవిడోవ్ సర్దుకుంటూ నెమ్మదిగా లేచి నిల్చున్నాడు. ఒక అరగంటవరకు వుపన్యాసం చెప్పేటప్పటికి గొంతుక బొంగురుపోయింది. సభికులందరు నిశ్శబ్దంగా.

వింటూన్నారు. శుభ్రమైన గాలి రావడానికి తగినన్ని కిటికీలు లేకపోవడంచేత, ప్రజలు క్రిక్కిరిసి కూర్చోవడంచేత ఉక్కపోసి గాలి పీల్చడంకూడా కష్టంగా వుంది. వేదికమీదవున్న రెండు లాంతర్ల వెలుగున, ముందువరసలో కూర్చున్న వారి ముఖాలమీద చెమట స్పష్టంగా కనిపిస్తూంది. డేవిడోవ్ వుపన్యాసం ఇచ్చినంతసేపూ ఎవ్వరూ అడ్డుప్రశ్నలు వెయ్యలేదు. కాని ఉపన్యాసం ఆపి మంచినీళ్ళ గ్లాసు అందుకొనేటప్పటికి సభ్యులు ప్రశ్నలవర్షం కురిపించేరు.

"ప్రతివస్తువు సమాజపరం చెయ్యబడుతుందా?"

"ఇళ్ళవిషయంలో ఏమిచేస్తారు?"

"ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రాలు తాత్కాలికమా—లేక స్థిరంగా వుంటాయా!"

"సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో చేరక ఎవరి భూములు వారు స్వంతంగా సేద్యం చేసుకొనేవాళ్ళని ఏం చేస్తారు! వారి భూములు ప్రభుత్వం వశపరుచుకుంటుందా!"

"భోజనాలుకూడా అంతా కలిసేనా!"

డేవిడోవ్ ఆ ప్రశ్నలన్నిటికి సంక్షిప్తంగా, పూర్తిగా సమాధానం చెప్పేడు. వ్యవసాయ సంబంధమైన విషయాలు వచ్చినప్పుడు నగుల్నోవ్, రజ్మెట్నోవ్ లు సహాయం చేసేవారు. తరువాత సమిష్టి వ్యవసాయక్షేత్రంయొక్క 'కాన్స్టిట్యూషనల్ డ్రాఫ్టు' చదివి వినిపించేడు. సభ్యులు ఇంకా ప్రశ్నలు వేస్తోనే

వున్నారు. నల్ల చర్మంతో చేసిన మాడుమూలల టోపీ పెట్టు కొని, నల్లటి గొఱ్ఱెచర్మం కప్పుకొన్న ఒక కోసక్కు మధ్యవర సలలోనుంచి లేచి నిలబడి కొంతసేపు మాట్లాడడానికి అవకాశం ఇమ్మని కోరేడు.

"నేనుకూడా సాధారణ కుటుంబీకుడనే. నేను చెప్పేది ఏమిటంటే—సమిష్టివ్యవసాయ క్షేత్రం ఏర్పరచడం అనేది మంచి ఆలోచనే; అందుకేమీ సందేహంలేదు. కాని ఇంకా మనం ఆలోచించవలసిన విషయాలు అనేకం ఉన్నాయి. 'అంతా సిద్ధం అయింది. ఇంక మనం అనుభవించడమే తరవాయి.' అనే ఉద్దేశ్యముతో మనం సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేరడమంత తెలివితక్కువ పని ఇంకొకటి వుండదు. ప్రభుత్వంచేత ఇక్క డికి పంపబడిన మన కామ్రేడ్ మన మందరం కలసి పనిచేసినట్ల యితే చాలా లాభం వుంటుందని అంటూన్నారు. కామ్రేడ్ లెనిన్ కూడ ఇదే అభిప్రాయమును అనేకచోట్ల వ్యక్తపరిచేరని కూడా చెబుతూన్నారు. కాని ఈ కామ్రేడ్ ప్రతినిధికి వ్యవ సాయ విషయమై ఏమీ అనుభవం లేనట్లు తోస్తోంది. ఆఖరుకు మేడితోక పట్టుకోనడంకూడా తెలియదనుకుంటాను. మొదటి నుంచి ఫ్యాక్టరీలలో పనిచేసియుండడంచేత, ఆయనకు వ్యవ సాయసంబంధమైన అనుభవంలేదంటే దాల్లో ఆశ్చర్యంలేదు. ఆ కారణంచేతనే ఆయన అంచనాలో కొద్ది పొరపాట్లు కనిపిస్తో న్నాయి. నా ఉద్దేశ్యప్రకారం ప్రజలందరిని సమిష్టి వ్యవసాయ

క్షేత్రాలలో ఈ క్రిందివిధంగా చేర్చాలి: తగినన్ని పశువులు ఉండి, బాగా కష్టపడి పనిచేసేవాళ్ళ నందరను ఒకదానిలోకి, బీదవాళ్ళ నందరను ఒకదానిలోకి, ధనికుల నందరను ఒకదానిలోకి, చేర్చి మిగిలిన సోమరిపోతులందరిని సెటిల్మెంటులలోకి పంపించి పని చేర్చాలి. అందరిని గుదిగుచ్చి ఒకే సమిష్టివ్యవసాయ క్షేత్రంలోకి చేర్చడం శుద్ధ తెలివితక్కువ పని; ఉపయోగంకూడా ఏ మాత్రము వుండదు. మనవాళ్ళు ఏదో సామ్యం చెబుతారూ—అల్లా వుంటుంది: ఆకాశంలో ఎగిరే హంసని, నీళ్లలో తిరిగే చేపని, కదలకుండా పడియుండే రాయిని ఒకదానికొకటి ముడివేసినట్లు ఉంటుంది"

సభికులు నవ్వేరు. వెనక బల్లలమీద కూర్చున్న ఒక యువతి బాధచేత గట్టిగా అర్చింది. వెనువెంటనే మరొకవ్యక్తి. "ఆ అల్లరి చేసేది ఎవరు, అక్కడ! మీ కేమీ మంచి చెడ్డ ఏమీ లేదు! ఇది మీ పడకగది అనుకున్నారా ఏమిటి సరసాలు ఆడడానికి!" అని కేకేసేడు.

నక్కవర్ణం టోపీ పెట్టుకొనిన కోసక్కు, జేబురుమాలుతో ముఖం తుడుచుకొని మళ్ళీ ప్రారంభించేడు. "రైతు ఎడ్లలో మంచివాటిని ఏరి ఏవిధంగా జతలు ఏర్పాటుచేస్తాడో, అల్లాగే మనంకూడ ప్రజలలో ఏరకానికా రకం వేరేవేరే ఏర్పాటు చెయ్యాలి. తెలివైన రైతు, సమానమైన బలం, ఎత్తు ఉన్నవాటినే జత చేస్తాడు. ఒక మంచిఎద్దుని-ఒక బక్కఎద్దుని జతచేస్తే

ఏమవుతుంది? బలమైన ఎద్దు ముందుకు లాగుతూంటే, బక్క ఎద్దు వెనక ఈడిగిలపడుతుంది. అందుచేత ఈ బక్కఎద్దు మూలాన్ని బలమైన ఎద్దుకూడా ఆగిపోవలసివస్తుంది. అటువంటి వాటితో పని ఎల్లా సాగుతుంది? మన కామ్రేడ్, ఒక్క భాగ్యవతులు తప్ప మిగిలిన గ్రామం యావత్తు ఒక సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరాలన్నారు. దాని పర్యవసానం ఏమవుతుంది? నైన చెప్పినదే!"

లుబిష్కిన్ లేచి, కోపంగా, ఉపన్యాసకుని వైపు తిరిగేడు.

"కుజ్మా! న పోకోస్తున్నావు సార కాయ కోతలు...........
మేము అంత ఆడవాళ్ళం కాము, నువ్వు చెప్పే వాటికన్నిటికి 'ఊ' కదుపుతూ, దోసలు దూరీలా నోరుతెరుచుకొని కూర్చోడానికి!" అంతా నవ్వేరు. "ఈ మీటింగుకు వచ్చినవాళ్ళంతా శుద్ధ నవటులని ఊహిస్తూన్నావేమో." ప్రిజలు విరగబడి నవ్వుతూ గోల్లుమన్నారు. నగుల్నోవ్ పెదవులమీదికి కూడా చిరునవ్వు పాకింది. లుబిష్కిన్ పెద్దగొంతుకతో, అంత గొడవలోనూ కూడా ఖంగుమని వినిపించేలా మళ్ళీ అందుకున్నాడు;

"ఇదంతా నీ స్వబుద్ధి కాదు; ఎవడో చెప్పిపెట్టేడు నీకు!"

సభలో పెద్ద గడబిడ బయలుదేరింది. రజ్మటోన్నోవ్ లేచి, అతి కష్టం మీద సద్దుబాటు చేసేడు. చాలా సేపటివరకు కేకలు వినబడుతూనే ఉన్నాయి.

"పీడికికూడా ఏ మాత్రమో చెయ్యి తడిఅయినట్టుంది!"

భీష్మమన్నారు.

"చూస్తారేం— బుర్రి పేలకొట్టక!"

నికోలాయ్‌యెలుప్పిన్ అనే సాధారణ రైతు ఒకడు లేచి, మాట్లాడడానికి అనుమతి కోరేడు.

"ఇంక వాదనలు అవసరంలేదు. అనుసరించవలసిన విధానం స్పష్టంగా కనిపిస్తోనే వుంది." అని నగుల్నోవ్ హెచ్చరించేడు.

"ఆ విషయం నిర్ధారణగా ఎల్లా చెప్పగలరు? ఆ విధానం నాకు నచ్చకపోవచ్చు! మీ ఉద్దేశాలకి ప్రతికూలంగా మేము మాట్లాడకూడదా? నా ఉద్దేశం ఇది: సమిష్టివ్యవసాయ క్షేత్రంలో తప్పకుండా చేరాలనే నిర్బంధం వుండకూడదు. ఇష్టం అయిందా చేరడానికి, లేకపోతే బయట ఉండి చూడడానికికూడ అవకాశం ఇయ్యాలి. మేము దానిలో చేరకుండా, బయటనే వుండి, అది ఎంతవరకు జయప్రదంగా నడుస్తుందో చూస్తోంటాము."

"ఆ 'మేము' ఎవరు?" అని అడిగేడు డేవిడోవ్.

"రైతులనే ఉద్దేశ్యంతో మాట్లాడేను."

మీ విషయం మీరు మాట్లాడండి; అంతేకాని అందరి విషయం మీకెందుకు. ఎవరి అభిప్రాయం వాళ్ళే చెబుతారు."

"నా విషయమే నేను చెబుతూంట. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరినవాళ్ళు ఏవిధంగా జీవిస్తోన్నారో చూస్తాను. బాగుంది అని తోస్తే, నేనుకూడా చేరుతాను; లేదా, అనవసరంగా చేరడం ఎందుకు? మంచిది కాదని తెలిసికూడా చేరి

మూర్ఖుడు ఉంటాడా........."

"నిజం చెప్పేవు!"

"మేమంతా కొంతకాలం పోయిం తరువాత, బాగుంటే చేరతాము."

"ఆ—ముందు చేరేవాళ్లు ఎల్లాంటి నూతన జీవితం గడుపుతారో గడపనియ్యండి!"

"నిజంగా చెబుతోన్నాను— తప్పకుండా చేరండి! దాల్లో చూసేటందుకు ఏముంది!"

"తరువాత అఖవట్కిన్ మాట్లాడుతాడు. అఖవట్కిన్, రా." అన్నాడు రజ్మటోన్వ్.

"నా స్వవిషయం చెబుతోన్నాను నేను. మా అన్న తమ్ముళ్లం ఇద్దరంకూడ కలిసి వుంటున్నాము. కాని మాలో మా ఇద్దరికే సఖ్యతలేదు! మొదట ఆడవాళ్ళు దొమ్ములాడుకుని వైరం పెంచేరు. క్రమంగా వాళ్ళమూలాన్న, నాకూ, మా అన్నకూ కూడ పడిందికాదు. ఇప్పుడు వీరు ఈ గ్రామస్థుల్ని అందరినీ కూడా ఒక్క-చోటకి పోగుచెయ్యాలని చూస్తున్నారు! అది అసంభవం. మనస్పర్ధలు పేచీలు ఇంకా ఎక్కువ అయిపోతాయి. 'ఇవాన్ నా ఎడ్లచేత పొద్దు అస్తమానమూ పనిచేయించేడు, వాడి గుఱ్ఱాలకి నేను తక్కువ గడ్డి వేసి బాగా మేపలేదు' అని ప్రతివిషయంలోను పేచీలు వస్తాయి. ప్రతిరోజూ అరకలు తోలుకుపోయినప్పుడు కొట్టుకుంటూంటారు. ఈ పేచీ

లకోసం అని మిలీషియాని ఇక్కడ స్థిరంగా ఉంచవలసిన అవస్థ కూడా వస్తుంది. ఒకడు ఎక్కువ పని చేస్తాడు. ఒకడు తక్కువ పని చేస్తాడు. ఫాక్టరీలో అయినట్లయితే 8 గంటలు పనిచేసి, తరువాత ఒక్క నిముషం కూడా ఆగకుండా చుట్టకాల్చుకుంటూ వెళ్ళిపోతాడు......"

"మీరు ఎప్పుడేనా ఫాక్టరీలో పనిచేసేరా?"

"లేదు, కామ్రేడ్ దేవిడోవ్! కాని నాకు తెలుసును."

"ఫాక్టరీలో పనిచేసే కూలీలను గురించి మీకు ఏమీ తెలియదు. అటువంటప్పుడు ఫాక్టరీలను గురించి, ఆ కూలీలను గురించి, ఉన్నవి, లేనివి, నాలుగు కల్పించి చెప్పి తిప్పుకపడకండి! భాగ్యవంతులుకూడా కూలీలని గురించి, 'ఆ—వాడికేమి? కష్టపడి పనిచేసి ఏరోజు తిండి ఆ రోజు సంపాదించుకుంటాడు; హాయిగా, నిర్విచారంగా బ్రతుకుతాడు. మన కంటె వాడేనయం' అంటాడు, అల్లా ఉంది మీరు చెప్పేమాట!"

"సరే ఆ విషయం మనం ఎత్తుకోవడం మానేద్దాం; నియమ ప్రకారం అతని పని అయిపోయిన తరువాత వెళ్లిపోతాడు. కాని మనం, ఝామురాత్రి వుండి అనగానే దున్నడానికి బయలుదేరాలి. పగలల్లా దున్ని రాత్రి అయిన తరువాత ఇంటికి వస్తాము. రోజల్లా పనిచేసి వుండడంచేత ప్రాణం విసుగెత్తి ఉంటుంది. అయినాకాని ఎడ్లకి మేత వెయ్యడానికి రాత్రి 4, 5 సార్లు లేవాలి; అందుచేత నిద్రకూడా ఉండదు. ఎడ్లని

బాగా మేపకపోతే పరునాడు అరక కడితే లాగవు. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరి నేను బాగా పనిచేస్తాననుకోండి, మన 'కొలీజా' వంటివాడు పని చెయ్యకుండా ఏ చెట్టుకిందో బట్టపరుచుకొని పడుకుంటాడు. బీదవాళ్లు ఎప్పుడూ సోమరితనంగా వుండరనీ, అది అంతా భాగ్యవంతులు కల్పించి చెప్పే వట్టి కబుర్లని, చెప్పే సోవియటు ప్రభుత్వం మాటలలో నిజం ఎంతమాత్రం లేదు. ఎక్కడో ఎందుకు—మన 'కొలీజా'ని చూడండి. నెగడు దగ్గిర కూర్చుని చలికాగడం తప్ప అతను మరో పని ఏమీ చెయ్యడు. తిండి లేకపోతే ఉపవాసాలేనా చేస్తాడు కాని పని మాత్రం చెయ్యడు. అటువంటి సోమరిపోతుతో కలిసి నేను పని చెయ్యడం ఎల్లాగ? నేను సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరను."

"కొంద్రాట్ మైదనికోవ్ మాట్లాడతాడు. మైదనికోవ్! లే."

అంత పొడుగు, పొట్టి కాకుండా మధ్యరకంగా వున్న ఒక కోసక్కు, వెనక వరసలలోనుంచి నెమ్మదిగా వేదిక దగ్గిరికి బయలుదేరేడు. బూడిదరంగు కోటు తొడుక్కున్నాడు. బుడానీ అశ్వికసైనికులు ధరించే, వెలిసిపోయిన టోపీ పెట్టుకున్నాడు. వేదిక ఎక్కి సభికుల వైపు తిరిగి బొ్రజను జేబులు వెతుకుతోన్నాడు.

"ఉపన్యాసం చదువుతావా?" దెమ్కా ఉషాకోవ్

ఓర్చుకున్నారు.

నవ్వుతో అడిగేడు.

"టోపీ తీసిపారెయ్యి!"

"కంఠతా పఠించినట్లున్నాడు!"

"ప్రతి చిన్నవిషయం కాగితంమీదికి ఎక్కిస్తాడు!"

"చదువుకున్నందుకు ఫలితం ఏమిటి మరి!"

మైదనికోవ్ చిన్న నోటుబుక్కు తీసి తొందరగా పేజీలు తిరగెయ్యడం మొదలెట్టేడు.

"అల్లాగే, నవ్వుతూ ఉండండి, ఆ నవ్వు పూర్తి అవకుండానే ఏడవవలసి వస్తుందేమో కూడాను." అన్నాడు కోపంతో. "నాకు అవసరమైన ప్రతివిషయం 'నోట్' చేస్తాను. చదువుతాను వినండి. ఇంతవరకు అనేకమంది ఉపన్యాసాలు ఇచ్చేరు. కాని అసలువిషయం ఎవరూ ఎత్తుగోలేదు. మనం ఎటువంటి జీవనం గడుపుతున్నామో ఒకసారి ఆలోచించండి.........."

దేవిడోవ్ అతని ఉపన్యాసం శ్రద్ధగా వినడం మొదలెట్టేడు. ముందరివరసలలో కూర్చున్నవారి ముఖాలమీద చిరునవ్వు కనిపిస్తూంది.

"మాకు అట్టే ఎక్కువ భూమి లేదు. క్రిందటి సంవత్సరం 12 ఎకరాల భూమి దున్నేను. నాకు ఒక జత ఎడ్లు, ఒక గుఱ్ఱం, ఒక ఆవుమాత్రం వున్నాయి. మా కుటుంబం—నేను, నా భార్య, ముగ్గురు పిల్లలు కలిసి—మొత్తం అయిదుగురం. ఇంతమందిలోను పని చేసేవాడిని నేను ఒక్కడినే! ఆ 12 ఎక

రాలలోను 90 పూడుల గోధుమలు, 18 పూడుల బార్లీ, 23 పూడుల ఓట్లు పండేయి. మాకు సం॥కి 60 పూడులు వుండాలి. కోళ్ళు మొదలైనవాటికి 10 పూడులు, ఓట్లు అన్నీ గుర్రానికి వుండాలి. ఇక మిగిలేది 38 పూడులు. పూడు ఒక రూబులు పది కోపెక్కుల చొప్పున అవి అన్నీ అమ్మితే మొత్తం 41 రూబులు వస్తాయి. కోళ్ళు, బాతులు మొదలైనవి అమ్మితే 15 రూబులు వస్తాయనుకోండి" అతని ముఖంలో విచార రేఖలు కనిపిస్తూన్నాయి. కంఠస్వరం తీవ్రం అయింది. "ఈ 56 రూబులతోను మా కుటుంబానికి కావలసిన బట్టలు, బూట్లు, సబ్బులు, మొదలైనవన్నీ వస్తాయా? ఏం మాట్లాడరేం? ఈ విధంగా జీవితం గడపగలమా? పంటలు బాగున్న సం॥లలోనే జీవితం గడపడం ఇంత దుర్భరంగావుంటే, పంటలు పూర్తిగా పోయిన సం॥రం మన స్థితి ఎల్లా కుంటుందో ఆలోచించండి? ఏవో కల్లబొల్లికబుర్లు చెప్పి మోసగించి సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరకుండా చేస్తోన్న వీళ్ళని ఏంచేసినా పాపంలేదు. ఇప్పుడు మనం బీదతనం క్రింది మెట్టులో వున్నాం. అంతకంటె తక్కువ మెట్టు లేనేలేదు. సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరుతే మన యీ బీదతనం పోవాలి కాని అంతకంటె పోయేటందుకు ఏమీలేదు"

"శోంద్రాడ్! చెప్పు! అల్లా సిగ్గు వచ్చేలా బుద్ధి చెప్పు వాళ్ళకి." అంటూ లుబిష్కిన్ సంతోషంతో అన్నాడు.

"ఓ, చెబుతాను! కూర్చుని వినమను! మీ దృష్టి ఎంతసేపూ, మీ ఆవు పూరిగుడిసె, దాటి ప్రసరించదు. గుడిసెలో ఖరీదైన వస్తువు ఒక్కటైనా వుండదు; నడికొప్పుమీద ఆకులుకూడా వుండవు. కాని అది 'నాది' అనిమాత్రం సంతోషిస్తొంటారు! కమ్యూనిస్టుపార్టీ మిమ్మల్ని నూతన జీవితంలోకి తీసుకొనివెడుతూంది. అప్పుడే పుట్టిన లేగదూడని, గాని తల్లి పొదుగు దగ్గరికి తీసుకొనివెడితే, పాలు తాగక, ఇటూ-అటూ గింజుకున్నట్లుంది ప్రస్తుతం మీ అవస్థ. నేను ఈ రోజున నే సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేర్చుకొనవలసినదని దరఖాస్తు పెడుతూన్నాను ఇతరులనకూడా చేరవలసినదని సలహా ఇస్తొన్నాను. కాని చేర తల్చుకోనివాళ్ళు, చేరేవాళ్ళకి అడ్డురావద్దనిమాత్రం కోరుతూన్నాను."

రజ్మెట్నోవ్ లేచి నిలబడ్డాడు,

"సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరడాన్ని గురించి చాలా చర్చ జరిగింది ముందుచేయవలసిన కర్తవ్యం మీకు తెలిసే వుంటుంది. ఇప్పటికే చాలా పొద్దుపోయింది. దీపాలకూడా ఆరిపోతూన్నాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి అనుకూలురు ఎవరో చేతులెత్తండి. కుటుంబ యజమానులే ఎత్తాలి. మిగిలిన వాళ్లు అవసరంలేదు."

అక్కడికి వచ్చిన 217 గురు కుటుంబ యజమానులలో 67 గురు మాత్రం చేతులెత్తేరు.

"వ్యతిరేకులెవరేనా వున్నారా?"

ఒక్కరుకూడ చెయ్యి ఎత్తలేదు.

"మీరు సమిష్టివ్యవసాయ క్షేత్రంలో సభ్యులుగా చేరదన్న మాట" అని డేవిడోవ్ అడిగాడు. "అయితే కామ్రేడ్ మైడియనోవ్ అన్నదాంట్లో అతిశయోక్తిలేదు."

"మాకు దాని అవసరంలేదు" ఒక స్త్రీ కంఠస్వరం వినిపించింది.

"మైడియనోవ్ మాకు ఆదర్శమా ఏమిటి!"

"మా తండ్రులు, తాతలు సమిష్టివ్యవసాయ క్షేత్రం లేకుండా బ్రతకలేదా?"

"బలవంతంగా చేర్చడానికి మాత్రం ప్రయత్నించకండి!"

ఈ కేకలన్నీ అణిగిపోయిన తరువాత చీకటిగావున్న వెనక వరసలలోనుంచి ఎవరిదో తీవ్రమైన ధ్వని వినిపించింది:

"మమ్మల్ని బలవంతంగా చేర్చడానికి ఉద్దేశిస్తూన్నావేమో, జాగ్రత్త! మొన్ననే టిటూక్ నిన్ను రేవునెత్తి బద్దలయేలా కొట్టేడు. ఈసారి మేము మిగిలిన పని పూర్తిచేస్తాం, జాగ్రత్త........."

డేవిడోవ్ ఉలికిపడి లేచి నిలబడ్డాడు. అంతటా, నిశ్శబ్దంగా వుంది. ఒక్కనిముషం నోట మాటలేకుండా విస్తుపోయి చూస్తూ నిలబడ్డాడు.

"భద్రం హీ! టిటూక్ కొట్టిన దెబ్బ బాగా తగలలేదు! నీవంటి

దుర్మార్గులంతా ఒక్కడుకూడ మిగలకుండా నాశనం అవడం నేను చూస్తా! చావుకి వెరుస్తాననుకుంటున్నావేమో! కలలో కూడ అనుకోకు! అవసరం వచ్చిందంటే, పార్టీకోసం, నా పార్టీకోసం, కూలీలకోసం నా రక్తంఅంతా ధారపోస్తాను. నీవంటి కార్మికశత్రువుల్ని, మానవపిశాచాలని, ప్రపంచములో ఎక్కడా నామరూపాలు లేకుండా చెయ్యడానికి నాకంఠంలో ప్రాణం వున్నంతవరకు పోరాడుతాను."

"ఎవరు, అల్లాఅన్నవాళ్ళు?" నగుల్నోవ్ కూచ్చునే, తల ఎత్తి చూస్తో అడిగేడు.

రజ్మెట్నోవ్ వేదికమీదనుంచి కిందికి వురికేడు. వెనక వరసల్లో ఒక బల్ల కిరకిరలాడిన చప్పుడయింది. ఇరవైమందివరకు లేచి గోలచేస్తూ బయటికి వెళ్ళిపోయేరు. మధ్యవరసలలోనున్న వాళ్ళుకూడా కొందరు లేవడం మొదలెట్టేరు. ఎవరో కిటికీ అద్దపుతలుపులు బద్దలుకొట్టేసేరు. కిటికీలోంచి చల్లటిగాలి రయ్యిమని వీచింది.

"ఫ్రోల్ కొడుకు టిమోఫీ కాదూ?"

"వాళ్ళని వెంటనే గ్రామంలోనుంచి తరిమెయ్యండి!"

"అతను కాదు. అకీమ్కా. టుబ్యాన్స్కోనుంచి వచ్చిన కోసక్కులుకూడా కొంతమంది ఇక్కడ వున్నారు."

"లంజకొడుకులు! ఏరీ! పట్టుకోండి!"

అర్ధరాత్రివరకు మీటింగు జరుగుతూనే వుంది. సమిష్టివ

సాయ క్షేత్రానికి అనుకూలంగాను, ప్రతికూలంగాను అనేకమంది, కంఠాలు బొంగురుపోయేలాగ గంభీరంగా ఉపన్యాసాలు యిచ్చేరు. సభలో అక్కడక్కడ రెండు కక్షులవారు వాదన ముదిరి చేతులు, చేతులు కలపడేంవరకు వచ్చింది. మైదనికోవ్ సన్నిహితబంధు వొకడు అతనికోటు అడ్డంగా చింపిపారేసేడు. దానితో ఇద్దరూ కొట్టుకోడానికి సిద్ధంఅయేరు. డెమ్కా ఉషాకోవ్, ముందువరసలలో కూర్చున్న సభ్యులమీదనుంచి రెండు ఉరకలలో దాటి, మైదనికోవ్‌కి సహాయంచెయ్యడానికి పరుగెత్తివచ్చేడు. ఇంతలో దేవిడోవ్ వచ్చి రెండువైపులవాళ్ళని విడితీసేడు. డెమ్కా, చిరిగిపోయిన మైదనికోవ్ కోటు చూపిస్తూ ఇల్లా అన్నాడు:

"కోండ్రాట్! ఎన్నిరోజులు శ్రమపడితే మళ్ళీ ఇటువంటి కోటు సంపాదించకలవో ఆలోచించు........."

"అతనివిషయం తరువాత చూడచ్చు. ముందు నీ భార్యకి..."

"అటువంటి వేళాకోళాలు కట్టిపెట్టండి. లేకపోతే బయటికి పంపించెయ్యవలసి వస్తుంది."

మీటింగు మొదలుపెట్టినది మొదలు ఇంతవరకు మూగ డైమిడ్ ఈ అనవసరపు గొడవ వినబడకుండా చెవులమీదుగా కోటు కప్పుకొని వెనక వరసలలో ఒక బెంచీకింద పడుకుని నిద్ర పోతూన్నాడు. వేజోళ్ళు కుడుతూ మీటింగుకివచ్చిన ఆడవాళ్లు కొంతమంది సూదులు, ఊలువుండలు క్రిందజారవిడిచి వరం

బీళ్ళుదున్నేరు.

డామీద గోడని జేరబడి కునికిపాట్లు పడుతున్నారు. చాలామంది అంతక్రితమే ఇళ్ళకి వెళ్ళిపోయేరు. సమిష్టివ్యవసాయక్షేత్రానికి అనుకూలంగా మాట్లాడడానికి ఆర్గ్యుడీ మళ్ళీ లేచి ఏదో మాట్లాడపోయేడు. కాని అంతవరకు గట్టిగా అర్చియుండడం చేత కంఠంపోయి మాట సరిగా వచ్చింది కాదు. కంఠంముడి సవరించుకుంటూ; చెయ్యెత్తి విసురుతూ నిల్చున్నచోటనే కూర్చుని, వుద్రేకం పట్టలేక, ప్రతికక్షియైన 'నికోలాయ్ అఖన్ట్రైన్'తో, సమిష్టివ్యవసాయక్షేత్రనిర్మాణం పూర్తి అయినతరువాత అతనివంటివాళ్ళగతి ఏమవుతుందో అభినయించేడు. ఒక బొటనవ్రేలు గోరుమీద మరియొకటి పెట్టి 'చిటిక్కు' మనిపించేడు. నికోలాయ్ ఉడుంతో లేచిపోయేడు.



## పదో ప్రకరణము.

### ఎడబాటు.

మైడనికోవ్ మీటింగునుంచి యింటికి వచ్చేటప్పటికి రాత్రి బాగా పొద్దుపోయింది. ప్రకృతిఅంతా నిశ్శబ్దంగా వుంది. కీచురాళ్ళ రొజమాత్రం వినిపిస్తోంది. తిన్నగా, కోండ్రాట్ దొడ్లోని దూడలపాకలోకి వెళ్ళేడు. ఎడ్లముందు గడ్డి లేకపోవడం చూసి గుప్పెడు గడ్డిపరకలు వాటిముందర వేసేడు. కాని మరునాడుదయం వాటిని సమిష్టివ్యవసాయక్షేత్రానికి తోలిపెట్టాలన్న విషయం జ్ఞప్తికి వచ్చి, సందెడు గడ్డి తీసుకొని వచ్చి వాటిముందు వేసేడు.

"ఈరోజుతో మన బాకీ తీరిపోయింది..........ఎహాయ్,  తినుగు! నాలుగు సంవత్సరాలనుంచి, ఒకళ్ళకొకళ్లం కష్టపడి పనిచేసేము. కాని ఏంలాభం? మీరు నేను కూడ ఒక డొక్కమాడుతూనే వున్నాము కాని—ఒకరికి కడుపునిండా ఇంత తిండి లేదు. సమిష్టివ్యవసాయక్షేత్రంలో చేరుతే మీరు, నేనుకూడ హాయిగా జీవించవచ్చునని ఆశగావుంది. నేను చెబుతూన్నదంతా తెలిసినట్లు, అల్లా తల ఊపుతూన్నావెందుకు?" అంటూ చిట్టుమూరవేసియున్న ఒక ఎద్దు ముట్టి పట్టుకొని పైకెత్తి, నెమరు వేస్తూన్న దౌడలు రెండుచేతులతోను పట్టుగున్నాడు. 6 సంవ

త్సరాల క్రితం తను ఆ ఎద్దుకోసం రాత్రింపగళ్లు ఎల్లా కనిపెట్టుకొని కూర్చున్నది జ్ఞాపకం వచ్చింది. 'కోండ్రాట్' కాని, దూడల్ని కాచేవాడు కాని లేనప్పుడు ఆ ముసలి ఆవు పాల్లింది. కాని అది చూడుతో వున్న లక్షణాలేవీ కనుపించలేదు." ఇంకా చూడుతో వున్నట్లు తోచదు. అప్పుడే ఒట్టిపోయి 2 నెలలయింది. వెధవగొడ్డు." అని కోండ్రాట్ దానిని చూసినప్పుడల్లా అనుకుంటూండేవాడు. కాని నెలరోజులకు ఈనుతుందనగా, నవంబరు నెలలో, చూడుతో వున్న లక్షణాలు కనిపించసాగేయి. ఆ శీతకాలపు రాత్రిలలో, ఆవు ఎప్పుడు ఈనుతుందోనని, మెలకువ వచ్చినప్పుడల్లా లేచి చూస్తూండేవాడు. ఆ సం॥రం చలి పక్కాలు ఒంచేసింది. దూడని వెయ్యగానే చూసి జాగ్రత్త పెట్టకపోతే చలికి కొంకరించుకొని చచ్చిపోతుందేమోనని భయంతో ఘడియఘడియకు వచ్చి, ఆవు ఈనిందేమోనని చూస్తూండేవాడు. ఆ రోజుల్లో అతనికి కంటిమీద కునుకు కూడా ఉండేది కాదు. ఆఖరుకు ఒకరోజు వుదయం అతని భార్య 'అనా' గబగబావచ్చి, "...............ఈ రాత్రి తప్పకుండా ఈనేస్తుంది." అంది.

ఆరోజు సాయంకాలం అవకుండానే రాత్రిభోజనం చేసేసి, కోండ్రాట్ సిద్ధంగా కూర్చున్నాడు. ఎప్పుడు అవసరం వస్తుందో అని లాంతరు ఆర్పెయ్యకుండా వుంచేడు. ఆరాత్రి ఆవుని ఏడు సార్లు చూసివచ్చేడు. ఆఖరుకు తెల్లవారుఝామున ఎనిమిదో

పర్యాయం దూడలపాకలోకి వెడుతూంటే ఆవు అఱ్ఱు వినిపించింది. ఆతురతగా పాకలోకి వెళ్ళేడు. అప్పటికప్పుడే ఆవు మావి వెయ్యడానికి సిద్ధంగావుంది. ఎర్రటిదూడ ఒకటి చలికి గజగజ వొణుకుతూ, ఆవు పక్కన నేలమీద పడుకొని తలఎత్తి చూస్తూంది. మావి తింటే పాలివ్వదనే నమ్మకం అతనికికూడా వుండడంచేత, ఆవుకి అందకుండా మావి దూరంగాతోసేసి, లేగదూడనెత్తుకొని ఇంట్లోకి తీసుకుపోయేడు.

"కోడెదూడే!" అన్నాడు కొండ్రాట్ సంతోషంతో.

'ఆనా' క్రాస్ చేసింది. "దేవుడు మనయందున్నాడు. మన అవసరం గుర్తించి కోడెదూడనే ఇచ్చేడు."

అప్పటికి కొండ్రాట్ కి ఒక్కటే కోడెదూడ వుంది. ఇంకొక్క కోడెదూడ వుంటే, ఎదిగి రెండేళ్ళనాటికి అక్కరకు వస్తాయని ఇంకో దూడని కొన్నాడు. క్రమంగా ఆ రెండుదూడలు ఎదిగి పెద్దవయేయి. కొండ్రాట్ వాటికి సరిపోయేటంత బండి ఒకటికొని, అదునురోజుల్లో దుక్కిదున్నుకుంటూ, తీరిక రోజుల్లో బండిపని చేసుకుంటూ, కాలక్షేపంచేసేవాడు.

ఆ ఎద్దును చూసేటప్పటికి కొండ్రాట్ కి కంఠంలో ఏదో అడ్డుపడ్డట్లు అనిపించింది. కళ్ళనీళ్ళు తిరిగేయి. మాట్లాడకుండా అక్కడినుంచి వెళ్ళిపోయేడు. ఆరాత్రి అతనికి నిద్ర పట్టింది కాదు. చుట్టకాలుస్తూ, ఏదో ఆలోచిస్తూన్నట్లు పరధ్యాన్నంగా పడుకున్నాడు.

"చివరకి ఈ సమిష్టివ్యవసాయక్షేత్రం ఎల్లా పరిణమిస్తుందో? ఎటువంటి చిక్కులు వచ్చినా, వెనుతియ్యక, తలపెట్టిన పని చివరకంటా కొనసాగించాలని, నాలాగ, అంతా పట్టుదలగా పని చేస్తారా! ఇంతపుష్టి పెరిగిన దూడల్ని, ఈరోజు వదిలేసి, ఇతరుల చేతిలో పెట్టడం అంటే మనస్సుకి చింతగానే వుంది. అవుతేమాత్రం-తప్పుతుందా! స్వంత ఆస్తిమీద వుండే మమకారాన్ని చంపుకోవాలి. ఆ విషయం ఇంక తలంపుకేనా రాకుండా చెయ్యాలి!" అతని భార్య పక్కని గుర్రుపట్టి నిద్రపోతూంది. కొండ్రాట్ చీకట్లోకి చూస్తూన్నాడు. కాని అతని కళ్ళకి దృష్టిలేదు. "అయితే ఈ మేకపిల్లల్ని, గొర్రెల్ని ఏమిటి—చెయ్యడం! వాటిని వెచ్చగావుండేచోట వుంచి జాగ్రత్తగా చూస్తూండాలి. మిగిలినవాటితో కలిసిపోతే, వాటిని ఆనవాలు పట్టి వేరు చెయ్యకలమా? ఆవులవిషయం ఏమిటో! పిట్లని అన్నిటిని పోషించడం ఎల్లాగ? కొన్ని చచ్చిపోవచ్చు. కొన్ని రోజులు పోయినతరువాత ఎవరిమటుకువారు భయపడి ఒక్కొక్కరే తప్పుకుంటే? ఈఊరు వదిలి ఎక్కడికేనా లేచిపోవలసింది నేను. ఇప్పుడు ఉన్నదికాస్తాకూడా తుడిచిపెట్టుకుపోతుంది" అని ఈవిధంగా అతను ఆరాత్రిఅంతా ఆలోచిస్తూనేవున్నాడు.

తెల్లవారుఝామున కొంచెం కలతనిద్రపట్టింది. ఆ నిద్రలో కూడ ఈవిషయాన్ని గురించిన కలలే! సమిష్టివ్యవసాయ విధానములోని ముఖ్యసూత్రం అతనికి బోధపడలేదు. చివరకు అతి

కష్టంమీద స్వంతఆస్తిమీద వుండే ప్రేమపాశాలు తెంపేసేడు.

సురునాడు వుదయం, భోజనం అయినతరువాత, సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేరటందుకు దరఖాస్తు రాస్తో కూర్చున్నాడు. తప్పులు రావడంచేత రెండు మూడు కాగితాలు చింపేసి, చివరకు:

"కమ్యూనిస్టుపార్టీయొక్క గ్రిమాచీగ్రామశాఖకు కార్యదర్శియైన మకార్ నగుల్నోవ్ గారికి—

"దరఖాస్తు"

"మధ్యతరగతి రైతునయిన కోండ్రాట్ క్రిస్టోఫరోవ్ మైడనికోవ్ అను నేను, నా భార్య పిల్లలతోను, ఆస్తి అంతతోను, సమిష్టివ్యవసాయక్షేత్రంలో సభ్యుడుగా చేరదలచితిని కనుక నన్ను దానిలో చేర్చుకొని నూతన జీవితం గడపే అవకాశం కలుగచెయ్యవలెనని కోరుతూన్నాను. ఆ నిబంధనల నన్నిటిని నేను అంగీకరించుచున్నాను."

"క్. మైడనికోవ్."

అని వ్రాసేడు.

"చేరడానికే నిశ్చయించేరా!" అంది అతని భార్య.

"అవును"

"మాడల్ని కూడా తీసుకువెడతారా!"

"ఆ—తీసుకువెడతాను. పిశాచంలా అల్లా చూస్తావెందుకు! నీకు ఇష్టం లేనట్టుంది! నీకు నచ్చచెప్పడానికిపడ్డ ఈ కంఠ

శ్రమఅంతా వృథాఅయింది! ఎంతతోస్తే అంతే కాని, పైవాళ్లు ఏమిచెప్పినా, వినడంఅంటూ లేదు."

"కోండ్రాట్! ఆవు విషయంలోవ్వ నాకు ఇంకో విచారం లేదు. చేరడం నాకూ ఇష్టమే. కాని ఆ ఒక్క విషయం తల్చుకుంటేమాత్రం ఎందుకో తెలియదు—విచారంగా వుంటుంది." అని నవ్వుతూ; చేతిలో గుడ్డతో కళ్ళనీళ్ళు ఒత్తుగుంది. ఇదంతా చూసి 'క్రిస్టపాక్' అనే నాలుగు సం॥ల వయస్సుగల వారి పిల్లకూడా ఏడవడం మొదలెట్టింది.

కోండ్రాట్, ఆవుని, ఎద్దుని వీధులోకి తోలి, ఒక గుఱ్ఱం ఎక్కి, వాటిని నీళ్ళు పెట్టడానికి ఏటికి తోలుకు వెళ్ళేడు. అవి నీళ్ళు తాగి ఇంటికి మళ్ళేయి. కాని కోండ్రాట్ వాటిని అడ్డం కొట్టి, సోవియట్ ఆఫీసువైపు మళ్ళించేడు.

ఆడవాళ్లు కిటికీలలోను, గుమ్మాలలోను నిలబడి కోండ్రాట్ వైపు ఆశ్చర్యంగా చూడసాగేరు. కోసక్కులు వాకళ్లలో దడులను ఆనుకొని నిలబడి చూస్తోన్నారు. అంతమంది అతని వైపు చూడ్డంచేత అతని శరీరం బరువెక్కినట్లుతోచింది. కాని మలుపు తిరిగేటప్పటికి సోవియట్ ఆఫీసు యెదట వీధిఅంతా గుర్రాలు; ఎడ్లు, ఆవులు, గొఱ్ఱెలు మొదలైనవాటితో నిండి వీధిఅంతా కోలాహలంగా ఉంది. పక్కసందులోనుంచి లుబిష్కిన్, ఆవు కొమ్ములకి తాడుపోసి బలవంతంగా లాక్కొస్తున్నాడు. వెనక నుంచి, మెడలో తాడుతో దూడఒకటి వస్తోంది.

## ఎడబాటు.

"వీటితోకలు అన్నీ కలియకట్టి తోలుకుపోదాం." అని లుబిస్కిన్ వేళాకోళంగా అన్నాడు. కాని ఎందుకో అతనుకూడ చికాకుగానే ఉన్నాడు. క్రిందదౌడమీద తగిలిన దెబ్బ కొద్దిగా రక్తంచిమ్ముతూంది.

"ఆదెబ్బ ఏమిటి?"

"రహస్యం ఎందుకు! నా భార్యకంటె ఎవరున్నారు? ఆవుని తోలుకొని వస్తూంటే, తోలుకువెళ్ళడానికి వీలులేదని అడ్డం వచ్చింది. కాని నేను వినకపోవడంచేత దెబ్బలాటలోకి దిగింది. నమ్ముతావో లేదో కాని పళ్లెంఒకటి తీసుకొని మీదికి వచ్చింది. దానితో నాఒళ్ళు నుండిపోయింది. 'ఆ! బోల్షివిక్కుని కొట్టే సాహసం వుందీ నీకు!' అంటూ చేతిలోవున్న కర్రతో ఒళ్ళట్టి నన్ని కొట్టేను............"

గ్రిమసోవియాటు ఆఫీసునుంచి వాటినన్నిటిని టిటిగాక్ యింటికి తోలుకువెళ్ళేరు. ఇదంతా చూసి, అంతవరకు 'చేరుదమా-వద్దా' అని ఆలోచిస్తోన్న మరి పండ్రెండుగురు కోసక్కులు ఆ ఉదయమే దరఖాస్తులు పెట్టి పశువుల్ని తోలుకొని సమిష్టివ్యవసాయక్షేత్రంలో చేరడానికి వచ్చేరు.

ఇద్దరు స్త్రీపనివాళ్ళ సహాయంతో నగుల్నోవ్, ఆ పశువుల నన్నిటిని కట్టుటకు వీలగునట్లు పాకలు బాగుచేయించి, గుంజలు పాతి, కావలిసిన ఏర్పాట్లు అన్నీ చేసేడు. గ్రిమాచీలాగ్ లో ఏర్పాటు చేయబడ్డ మొట్టమొదటి సమిష్టి పశుశాలలు ఇవే.



# పదకొండో ప్రకరణము.

## జప్తు.

కోండ్రాటిట్, లుబిష్కిన్‌తో కలిసి, గోతులు తవ్వి రాటలు పాతుతూన్నాడు. లుబిష్కిన్ నెత్తిమీదనున్న నల్లటి టోపీ కిందనుంచి చెమట కారుతూంది. ఒగరుస్తోనే, అతడు వంచిన నడుము ఎత్తకుండా పనిచేస్తూన్నాడు. కొంత సేపటికి పని అంతా పూర్తిఅయింది. బయట నిలబడియున్న 28 జతల ఎడ్లని తోలుకువచ్చి ఆ పాకల్లో కట్టేసేరు. వాటివెనక చెమటకి తడిసి ఒంటిని అంటుకొనిపోయిన కాకిట్వెల్లు చొక్కాతో నగుల్నోవ్ వచ్చేడు.

"మకార్! 10 నిముషాలు పనిచేసేనో, లేదో; అప్పుడే నీ శరీరం అంతా చెమట ఓడుతూ ఎల్లావుందో చూడు. చొక్కా నుంచి చెమట పిండవచ్చు. ఈమాత్రం పనికే అలిసిపోతే నువ్వు పని ఏంచెయ్యకలవు?" అన్నాడు లుబిష్కిన్. "చూడు! నే నెల్లా పని చెస్తానో! గునపం పుచ్చుగున్నావంటే రాళ్ళుకూడా వణకాలి. టిటాక్‌దే కాదూ యీ గునపం? బాగా వుంది. ముందు ఆకోటు తొడుక్కో. లేకపోతే చలిగాలి తగిలి జలుబు చేస్తుంది"

నగుల్నోవ్ కోటు తొడుక్కున్నాడు.

"వెనక యుద్ధంలో విషవాయువు తగిలినప్పటినుంచీ, ఏమాత్రం పనిచేసినా ఒగర్పు వస్తోంది. ఇక్కడ పని అంతా పూర్తి అయినట్లుందే! బాగుంది! ఇప్పుడు చూడు! వరసగా ఇన్ని పశువుల్ని కట్టేస్తే కలకిలలాడుతూ ఎల్లా వుంటాయో!" అంటూ నగుల్నోవ్ సంతృప్తిని వెలిగ్రక్కే కళ్ళతో ఎడ్లకేసి చూసి అన్నాడు.

పాకలలో ఖాళీలేకపోవడంచేత, ఆవుల్ని బయట కడుతూన్నారు. ఇంతలో రజ్మెట్నోవ్, డేమ్కా వచ్చేరు. ఆంద్రీ, నగుల్నోవ్ బుజంమీద చెయ్యివేసి కొంచెం పక్కకి తీసుకొని వెళ్ళేడు.

"మకార్! నిన్నటి సంగతి మనస్సులో ఉంచుకోకు. పసిపిల్లల ఏడుపులు వినేటప్పటికి మా వాడు జ్ఞాపకంవచ్చి, మనస్సులో ఒకవిధమైన అవ్యక్తమైన బాధకలిగింది."

"ఇల్లాంటివాడవు—నువ్వు ఎందుకు పనికివస్తావో నాకు తెలియకుండా వుంది!".

"నావిషయంలో వెనకటిలా లేవు నువ్వు; నీ ముఖం చూస్తే స్పష్టంగా తెలుస్తోంది."

"ఇంక ఆవిషయం కట్టిపెట్టు—చంపుకుతినక. ఎక్కడికీ—బయలుదేరేవు? పశువులికి గడ్డిలేదు. కొంచెం తెచ్చివేద్దాం. డేవిడోవ్ ఎక్కడా కనిపించడంలేదు-ఏంచేస్తోన్నాడు!"

చీల్చుకున్నారు.

"ఆయన, అర్కాష్కా కలిసి సోవియట్ ఆఫీసులో దర ఖాస్తులు చూస్తున్నారు. నేను వెడతున్నాను.........నిన్నటి పని ఇంకా కొంచెం తరవాయి వుంది. సిమన్ లెష్చినోవ్ ని వెళ్లగొట్టి ఆ ఆస్తిని స్వాధీనం చేసుకోవాలి."

"అక్కడినుంచి వచ్చి, మళ్ళీ నిన్నటిలా ప్రారంభిస్తావేమో" అన్నాడు, నగుల్నోవ్ నవ్వుతూ.

"దానికేం కాని— నాతో కూడా ఎవరిని తీసుకొని వెళ్లను? యుద్ధరంగంలో ఉన్నట్లు అంతా అడావిడిగా ఎల్లావున్నారో చూడు! పశువుల్ని తోలుకొని వస్తున్నారు, గడ్డితీసుకొస్తూన్నారు. కొందరు అప్పుడే ధాన్యంకూడా తీసుకొస్తున్నారు. వాళ్ళని అందర్నీ వెనక్కి పంపించేసేను. ధాన్యంవిషయం, ఈ తొందర అణిగిన తరవాత చూడచ్చు. నాతో వచ్చేటందుకు ఎవరు సిద్ధంగావున్నారు?"

"కొండ్రాట్ మైదనికోవ్ వున్నాడు. కొండ్రాట్! ఒక్కసారి ఇల్లారా! చైర్మన్ తో కూడా వెళ్లి. లెష్చినోవ్ ఆస్తి జప్తుచేసి స్వాధీనం చేసుకోవడంలో ఆయనకి సహాయంచెయ్యి. ఏం, ఆలోచిస్తున్నావు? వెళ్లడానికి ఇష్టంలేదాఏమిటి?"

"ఇష్టం లేకేమి? తప్పకుండా వెడతాను" అన్నాడు.

డెమ్కా ఉషాకోవ్, కొండ్రాట్, ఆండ్రీకలసి బయలుదేరరు —రజ్మట్నోవ్, కొండ్రాట్ కేసి చూస్తూ,

"విచారంగా ఉన్నావేమి? — సంతోషంగా వుండవలసిన

సమయంలో, చూడు ప్రశాంతంగావుండే గ్రామజీవనంలో ఎంత సంచలనం కలిగిందో. గ్రామంఅంతా రేగిన తేనెపట్టులా వుంది." అన్నాడు.

"సంతోషించడానికి ఏమివుంది ఇప్పుడు; కష్టాలన్నీ ఇంకా ముందున్నాయి" అన్నాడు కోండ్రాట్.

"ఏం?"

"చల్లికరోజుల్లో తెలుస్తుంది. అంతవరకు ఎందుకు? ఇప్పుడు నేను వస్తుంటే ముగ్గురుమాత్రం పనిచేస్తున్నారు. ఒక డజను మందివరకు చల్లగా చెట్టునీడని కూర్చుని చుట్టలు కాలుస్తున్నారు............."

"ఆ–అంతా ఈరోజే ప్రారంభంకనుక ఊరుకున్నారుగాని- పనిచెయ్యక ఏంచేస్తారు! ఎంత సోమరిపోతుఅయినా తిండి లేక పోతేసరి, చెప్పినట్లు పనిచేస్తాడు."

కొంతదూరం వెళ్ళేటప్పటికి, ఒకమలుపులో, బోల్తాపడిపోయిన బండి ఒకటి కనిపించింది. గడ్డిమోపులన్నీ చిందరవందరగా పడిపోయివున్నాయి. బండి గసికలు విరిగిపోయేయి. ఎడ్లు పక్కనే పచ్చగడ్డిపరకలు పీక్కుతింటున్నాయి. సమిష్టివ్యవసాయక్షేత్రంలో సభ్యుడుగా చేరిన 'సిమన్ క్ర్యజనోక్వ్' ఆఖరి కొడుకు చెదిరిపడియున్న గడ్డిపరకలు నెమ్మదిగా నొల్లుతూన్నాడు.

"ఆర్చ్పే! కూర్చునిదేకుతూ అపని ఏమిటి? నేను నీ వయ

స్కూలులో నలుగురు చేసే పని ఒక్కడిని చేసేవాడిని. ఇల్లాగే పని చెయ్యడం? ఏం — రాగోలుకర్ర ఇల్లా ఇయ్యాండి." అంటూ డెమ్కా ఉషాకోవ్ నవ్వుతూన్న అతనిచేతిలో రాగోలుకర్ర తీసుకొని, ఒక్క పట్టుతో, మంచిబలువుమోపు గడ్డి పైకి ఎత్తేడు.

"ఎందుచేత బోల్తాపడింది?" అని అడిగేడు కోండ్రాట్.

"ఆ మెట్టుమీదినుంచి వేగంగా వస్తూ పడిపోయింది"

"సరే! తొందరగా వెళ్ళి గొడ్డలి ఒకటి తీసుకురా. 'డోనెట్ స్కోవ్' ఇంట్లో వుంటుంది, అక్కడికి వెళ్ళు."

వారుముగ్గురు బోల్తాపడియున్న బండిలేవగతీసేరు. విరిగి పోయిన గసిగలు బాగుచేసి మళ్ళీ బిగకొట్టేరు. డెమ్కా గడ్డి మోపులన్నీ బండిమీద జాగ్రత్తగా అమర్చి, తాళ్లుపోసి బిగ కట్టేడు.

"కృజనోవ్స్క్! చూసేవా ఎల్లా గడ్డియంతా తొక్కేసి ఎల్లాపాడుచేసేసారో! దూరంగా తోలి కొంచెం గడ్డివేసి వేసా లి కాని ఏకంగా గడ్డిమీద ఒదిలేస్తారా!"

కృజనోవ్ నవ్వి. ఎడ్లను కట్టి బండితోలుకుపోతూ, "ఈ గడ్డి సమిష్టి వ్యవసాయ క్షేత్రానిదికాని మనది కాదుకదా. అందు చేత అది ఎల్లాపోతేమాత్రం మనకెందుకు?" అన్నాడు నెమ్మ దిగా.

"చూసేవూ! ఆ వెధవ ఏమంటూన్నాడో?" అన్నాడు డెమ్కా కోండ్రాట్ కేసి చూస్తూ.

వాళ్లు లెష్చినోవ్ ఇంటికి వెళ్ళి జప్తు ప్రారంభించిన కొద్ది సేపటికే ఆ ఇంటి దగ్గిర 30 మంది వరకు పోగయేరు. వాళ్ళలో చాలామంది ఇరుగు పొరుగు కోసకు స్త్రీలే. కొద్దిమంది కోసక్కుర్రాలు కూడా వున్నారు. లెష్చినోవ్‌ని ఇల్లు వదలి వెళ్ళిపొమ్మనగానే సానిట్లోమూగియున్న ప్రజలలో గుసగుసలు బయలు దేరేయి.

"ఇదంతా చూడగ పట్టుపగలు దోపిడీలావుందే! కష్టపడి ఆస్తి సంపాదించుకున్నందుకు ఫలితంగా—ఇప్పుడు ఆ ఆస్తి అంతా లాక్కుని ప్రవాసం పంపిస్తున్నారు చూడు!"

"చాలా అన్యాయం........."

"పాపం! అతన్ని చూస్తే జాలేస్తోంది."

"జాలెయ్యదూ—యెవరికొచ్చినా కష్టం ఒకటే!"

"వెనక ఇతను, ట్రిఫోనోవ్ ఆస్తి అంతా వేసుకోలేదూ—బాకీక్రింద! అప్పుడే మేనా మంచి చెడ్డలు ఆలోచించాడా?"

"చూడు, ఎల్లాఏడుస్తూన్నాడో!"

"ఎన్ని కొంపలు కూల్చేశురా వీడు! ఇల్లా అవవలసిందే వీడికి. మంచిపని అయింది."

"ఒకళ్ళకి కష్టం వొస్తే చూసి సంతోషించడం మంచిపని కాదు. ఈ వేళ అతను అయేడు...రేపు మనం అవచ్చు."

"మనదగ్గిర ఏమేనా వుంటే కాదూ యీలాగ అవడానికి! ఒస్తే యెవళ్ళదేనా మనకి రావాలికాని మన దగ్గిరనుంచి

పోయేదేమీ లేదు."

"మొన్న వేసంగిలో కోతకోసుకొనే యంత్రం రెండు రోజులు అద్దెకి ఇచ్చి, 10 రూబులు గూబలుపిండి వసూలు చేసేడు. అప్పుడు మనవిూద ఏమైనా దయదల్చేడా?"

లాప్శినోవ్ బాగా డబ్బున్నవాడే. యుద్ధంనాటికే అతడు బాగా పోగుచేసేడు. దొంగవస్తువులు కొనీ, హెచ్చు వడ్డీకి అప్పులిచ్చి, బాకీకింద వాళ్ళ ఆస్తులు వేసుకొనీ, భాగ్యవంతుడయ్యేడు. ఆ చుట్టుపక్కలనున్న దొంగలందరితోను అతనికి లాలూచీ వుందని ప్రతీతి. గిర్కీస్ గుఱ్ఱపు వర్తకులు గుఱ్ఱాలని యెత్తుకువచ్చి యితనికి అమ్మడం మామూలు. అతడు ఆ గుఱ్ఱాల నన్నిటిని జార్కిట్జిన్, టాగన్ రాగ్, ఉరియుపిన్స్కీ మొదలైన చోట్లకి తోలుకొనిపోయి అమ్మేసేవాడు. సంవత్సరానికి రెండు మూడుసార్లు దగ్గిర బస్తీకి వెళ్ళి, కాకితపునోట్లు బంగారు మొహరులుగా మార్చి తెచ్చి, దాచుకొనేవాడు. 1912 వ సం॥లో ఒకసారి ఇతనిని దారికాచి దోచుకొనడానికి ప్రయత్నం జరిగింది. కాని లెప్షినోవ్ ఒక్కడూ చేతిలోనున్న కఱ్ఱతో వాళ్ళనందరిని ఎదిరించి తప్పించుకొని పారిపోయేడు. ఏవస్తువయినాసరే- కంటపడడం తడవు-వెంటనే ఎత్తుకొని పోయి యింట్లో వేసుకొనేవాడు. ఎప్పుడు దొంగతనం చేసినా అతిజాగ్రత్తగా రెండోకంటివాడికి తెలియకుండా చేసేవాడు.

కాని ఒక్కసారిమాత్రం- ఎవరిదో ధాన్యపుబస్తాలు ఎత్తు

కొనిపోయి అమ్మెయ్యడానికి పట్నానికి తీసుకొనిపోతూండగా-
దొరికిపోయేడు. అదయినా ఎప్పుడో అతని చిన్నతనంలో.
ఈపాపాలన్నీ పోవడానికి ప్రతిరోజు చర్చికి వెళ్ళి, కొవ్వొత్తి
వెలిగించి, క్రీస్తుయెదుట రెండు లెంపలు వాయించుకొని పశ్చా
త్తాపపడి వెంటనే కొవ్వొత్తి ఆర్పేసి జేబులో వేసుకొని వచ్చే
స్తూండేవాడు. అంత జాగ్రత్తగా వాడడంచేత ఆ ఒక్క
కొవ్వొత్తి సం॥రం వరకు సరిపోయేది. ఈలోభత్వం, దేవుని
మీద అశ్రద్ధచూపి ఎవరేనా ఆక్షేపిస్తే. "దేవుడికి మన
మాత్రం తెలివి లేకపోలేదు! దీపం పెట్టడానికి మనం ఎంత
డబ్బు ఖర్చుచేసేమో చూడడు దేవుడు—ఆ పని భక్తిశ్రద్ధలతో
చేసేరా లేదా అని చూస్తాడు కాని!" అని సమాధానం ఇస్తుం
డేవాడు.

ఊళ్ళో జరుగుతూన్న సంగతులన్నీ, అతనికి ఎప్పటికప్పుడు
తెలుస్తూనే వున్నాయి. తన ఆస్తికూడా స్వాధీనం చేసుకొని
గ్రామంలోనుంచి వెళ్ళగొట్టడానికి నిశ్చయించేరని తెలియ
గానే ఖరీదయిన వస్తువులన్నీ స్నేహితుల దగ్గిర, బంధువుల
గగ్గిర దాచేసేడు. అందుచేత రజ్మిట్నోవ్ వచ్చి, ఆ స్తి అంతా
వదలి కట్టుబట్టలతో గ్రామం వదలి వెళ్ళిపోవలసినదని చెప్పినప్ప
టికి ఏమీ కంగారుపడలేదు. సామాను జాబితా తయారు చెయ్య
డంలోకూడ వాళ్ళకి సహాయపడ్డాడు. ఇదంతా చూసి ఏడు
స్తున్న ముసలి భార్యకేసి తిరిగి,

తీర్పు చెప్పేరు.

"ఏడవకు మనం పడుతూన్న యీ కష్టాలన్నీ భగవంతుడికి తెలుసును. ఎక్కడ యేమి జరుగుతున్నా, ఆ దయామయుడు కని పెడుతూనే వుంటాడు ............"

"అన్నీ కనిపెడతాడు కాని నీ ఉన్నికోటు ఎక్కడ దాచేవో మాత్రం కనిపెట్టడనుకుంటాను; అంతేనా?" డెమ్కా వెటకారంగా అతని కంఠస్వరం అనుకరిస్తూ అన్నాడు.

"ఉన్నికోటేమిటి?"

"క్రిందటి ఆదివారం నువ్వు చర్చికి వెళ్లేటప్పుడు తొడుక్కున్నది"

"నేనెప్పుడూ అలాంటి కోటు తొడుక్కోలేదే!"

"నువ్వు తొడుక్కొని వెళుతూంటే నా కళ్ళారా చూసేను. అది యిప్పుడు యెక్కడో దాచేసేవు."

"ఇదిగో! డిమెంటీ! భగవంతుడు సాక్షిగా చెబుతూన్నాను. అసలు నాకు అటువంటి కోటు లేనే లేదు."

"దేవుడంటూ వుంటే నిన్ను తగినట్లు శిక్షిస్తాడులే."

"ఆ ఏసుక్రీస్తు సాక్షిగా— నువ్వు పొరపాటు పడుతున్నావు" అంటూ లుష్నినోవ్ క్రాస్ చేసేడు.

"అబద్ధం ఆడి యింకా— పాపం యెందుకు మూటకట్టుకుంటావు!" డెమ్కా కళ్లుచిగిలిస్తూ ప్రజలకేసి చూసేడు.

"నేనేమీ అబద్ధం ఆడడంలేదు— ఘంటాపథంగా చెప్పకలను."

"ఆ కోటు దాచేసినందుకు భగవంతుడి దగ్గిర సమాధానం చెబుదువు గానిలే?"

"ఏమిటి? నా స్వంత కోటు కోసమా!"

"ఆ! అది దాచినందుకు."

"దేవుడు కూడా నీవంటివాడే అనుకున్నావా? యేమిటి? అతనికి యిటువంటి విషయాలు అక్ఖర్లేదు. అసలు నాకు కొత్త ఉన్ని కోటు లేందే? నావంటి ముసలివాడితో పరిహాసం ఆడడానికి సిగ్గు లేదూ నీకు?"

"విత్తనాలకోసం వెనక నీ దగ్గిర 20 కుంచాలు తీసుకుంటే తిరిగి 30 కుంచాలు తీసుకున్నావు జ్ఞాపకంలేదూ? అందుకు నువ్వు కొంచెమైనా సిగ్గుపడ్డావా?" అని అడిగేడు కోంద్రాట్. బయట చేరిన ప్రజల గోలలో అతని మాటలు స్పష్టంగా వినిపించలేదు. కాని లాప్షినోవ్ అతనివైపు తిరిగి, "కోంద్రాట్! మీ నాన్న చాలామంచివాడు. మహానుభావుడు-చచ్చిస్వర్గాన వున్నాడు.........అతన్ని చూసేనా నువ్వు యీ అన్యాయానికి వొడిగట్టకుండా వుండవలసింది. పవిత్రగ్రంథంలో కూడా, 'శత్రువైనా సరే, పడిపోయినవాడిని కొట్టకు' అని వుంది. కాని నువ్వు చేసేపని యేమిటి? నీకు 30 కుంచాలు ఇచ్చి 30 కుంచాలు వసూలు చేసేనన్నావు. ఎప్పుడు? భగవంతుడు యేమనేడు? అతడు చూస్తూనే వుంటాడు"

'ఆ 20 కుంచాల ధాన్యం యిచ్చేసి,వూరుకోవాలని! దురా

కాపాతకం ముండాకొడుకులు!" అని హృదయంగా వేదన, క్రోధము వెలిగక్కుతూ ఘోషించింది.

"ఏడవకు. ఏసుక్రీస్తుకే బాధలు తప్పలేదు- ఇంక మన బోటివాళ్ళకి గాచడంలెక్క." అంటూ లాష్కినోవ్ చొక్కా చేతితో కళ్లు వొత్తుకున్నాడు. బయట జనంలో సద్దు అణిగింది. ఈదృశ్యాన్ని చూసి ఆడవాళ్లు కళ్లనీళ్లు పెట్టుకున్నారు. రజ్మ్యోట్నోవ్ తన ప్రార్థనని ముగించి లాష్కినోవ్ వైపు తిరిగి

"లాష్కినోవ్! యింక నువ్వు యిక్కడినుంచి వెళ్ళి పోవాలి. కళ్ళనీళ్లు పెట్టుకుంటే యేమీ లాభంలేదు. ఇంత వరకు నువ్వు అనేకమందికి అపకారంచేసేవు. దానికి తగిన ప్రతీకారం భగవంతుడు చేస్తాడని చేతులుముడుచుకొని కూర్చోకుండా యిప్పుడు మేమే చేస్తున్నాం. ఒక్క నిమిషం కూడా యిక్కడ వుండడానికి వీలులేదు, వెళ్లిపో," అని తీవ్రంగా అన్నాడు.

లాష్కినోవ్ టోపీ నెత్తిని పెట్టుకొని, పెద్దకొడుకుని చెయ్యి పట్టుకొని నడిపించుకుంటూ బయటకు వచ్చేడు. వాకిట్లో వున్న జనం అంతా ఒకర్నొకరు తోసుకుంటూ అతని వెనక పడ్డారు. లాష్కినోవ్ వాకిట్లోకి వచ్చి మోకరిల్లి నాలుగు వైపులకు తిరిగి క్రాస్ చేసేడు.

"చాలులే! యీపాటికి లేచి దయచెయ్యి!" అని వసారాలో నుంచి రజ్మ్యోట్నోవ్ కేక వేసేడు.

బయటచేరిన జనంలోనుంచి మళ్ళీ కూతలు, కేకలు బయలుదేరేయి.

"చిన్నప్పటినుంచీ వున్న యిల్లు, వాకిలి సమస్తం వదలి వెళ్ళిపోయేటప్పుడేనా కడసారి సెలవు తీసుగోనియ్యి!"

"అండ్రీ! యింత అన్యాయం కూడదు, కాటికి కాళ్లుజాపుకొని వున్న ముసలిముండాకొడుకుని నువ్వు......"

"ఇటువంటి దుర్మార్గపు బ్రతుకు బ్రతికిన తరువాత యింకా కాటికి కాళ్లు జాపి వుండడం యెందుకు?— రెండుకాళ్ళతోను కాటికి గబగబా పాకాలికాని —" అన్నాడు కోంద్రాట్.

చర్చికాపలాదారైన 'గ్లాడినోవ్' అనే ముసలి కోసక్కు— "ఎలాగయినా పరిభుత్వం మెప్పు పొందుదాంఅనా? నీవంటి వాడిని కొరడాపుచ్చుకొని వీపుబద్దలయ్యేలా కొట్టాలి." అన్నాడు.

"ఏమిటో, మహాషేలు తూన్నావు, నోటికి వచ్చినట్లల్లా? ఒళ్ళు కొంచెం దగ్గర వుంచుకొని మరీ మాట్లాడు తూండు." అన్నాడు కోంద్రాట్.

లాష్కినోవ్ సాష్టాంగపడి క్రాస్ చేసి గుంపులోనున్న ఆడ వాళ్ళకేసి తిరిగి అందరికీ వినబడేటట్లు గట్టిగా చెప్పడం ప్రారంభించేడు.

"మీ అందరికీ వందనాలు. ఈ గ్రామానికి నాకు ఋణం తీరిపోయింది. సెలవు తీసుగుంటున్నాను. భగవంతు డిచ్చిన

బీళ్ళునున్నరు.;

ఆయురారోగ్యాలతో............అంతా నా ఆస్తి సుఖంగా అనుభవించండి. నేటివరకు, నేను ఎవ్వరికీకూడ అన్యాయం చెయ్యలేదు...మీ”

“నాటుగా దొంగవస్తువులు కొంటూండేవాడిని” అని డెమ్యాన్ వసారామీదనుంచి అందిచ్చేడు.

“కష్టపడి చెమటోడ్చి సంపాదించేనుకాని దొంగతనం అనేది మాయింట, వంట యెక్కడా లేదు........”

“అనేకమంది కొంపలు తీసేను; కనిపించినవన్నీ మెక్కుకు పోయేను. కానీ!—మెడలూ వంగతీసి ఒళ్ళుకట్టినన్ని గుద్దుతే రోగం వదిలిపోను.”

“అటువంటివాడికి, ఆఖరికి ముసలితనం వచ్చేటప్పటికి...”

లాప్షినోవ్‌ను చూసి జాలేసి ఆడవాళ్ళు యెగపీలుస్తూ, జేబురుమాళ్లతో కళ్ళు తుడుచుకొనసాగేరు. ఇంతలో రజ్మ్రటోన్వ్ గబగబావచ్చి లాప్షినోవ్ జబ్బపట్టుకొని, “ఏమిటి ఈవుపన్యాసం యిక్కడ? నువ్వు.....”అని యింకా ఏదో అనబోతున్నాడు, ఇంతలో వరండాలో డెమ్యాన్ నిలబడి వున్నచోటనుంచి గంద్రగోళం బయలుదేరింది. లాప్షినోవ్ భార్య వంటయింట్లోనుంచి ఒకచేత బాతుగుడ్లు వున్నఒక బుట్టను, రెండవచేత ఒక బాతును పట్టుకొని పరుగెత్తుకొని వస్తోంది. డెమ్యాన్ ఆమె చేతిలోని బుట్టను సునాయాసంగా లాగేసి బాతునుకూడా లాక్కోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

కాని ఆమె రెండుచేతులతోను బాతుని గట్టిగాపట్టుకొంది."

"దిక్కుమాలిన ముండాకొడకా! మీదపడక దూరంగా పో." అని అరుస్తూ తిట్టడం మొదలెట్టింది.

"సమిష్టి వ్యవసాయక్షేత్రపు బాతు నువ్వు తీసుకొనివెళ్ల డానికి వీలులేదు." అంటూ డెమ్కా మెడజాపి చూస్తున్న బాతుని, తుతుక దగ్గరకుపుచ్చుకొన్నాడు. లాప్షినోవ్ భార్య బాతు కాళ్ళు గట్టిగాపట్టుకుంది. బాతుకోసం వాళ్లిద్దరూ, కాళ్ళొకరు, మెడఒకరు పట్టుకొని లాగడం మొదలెట్టేరు.

"నా బాతుని యిచ్చెయ్యి; నీదుంపతెగ!"

"నేనివ్వను"

"దీన్ని ఒక్కదాన్నీ తీసుకుపోనీ యెందుకు యేడిపిస్తావు!"

"ఇది సమిష్టి వ్యవసాయక్షేత్రానిది. నువ్వు తీసుకువెళ్ళ డానికి యెలా వీలు?" అన్నాడు డెమ్కా ఓగర్చుస్తూ; "తొలకరి నాటికి గుడ్లు పెట్టడం ప్రారంభిస్తుంది. అర్చిచచ్చి నాసరే దీన్నిమాత్రం తీసుకువెళ్ళనివ్వను."

వరండా మెట్లమీద నిలబడియున్న లాప్షినోవ్ భార్య మెట్లనితన్నిపెట్టి లాగడం ప్రారంభించింది. బాతు మొదట కొంతసేపు అర్చిందికాని, డెమ్కా లాగడంలో మెడ గట్టిగా నొక్కుకుపోవడంచేత అర్పు మానేసి, రెక్కలు తటతట కొట్టుకోవడం మొదలుపెట్టింది. వీళ్ళిద్దరు లాగడంలో బాతు తలప్రాణం తోకకి వచ్చింది. డెమ్కా బాతును లాగెయ్య

దానికి సిద్ధంగా వున్నాడు. ఇంతలో బాతు మెడ కుతుకలోకి వూడివచ్చింది. దానితో లాప్షినోవ్ భార్య మెట్లమీద క్రిందికి దొర్లి పోయింది. బలంకొలది లాగుతూండడంచేత ఆ వూపానికి డిమ్కా కూడ వెనకనున్న బుట్టమీద పడ్డాడు. బుట్టలోని గుడ్లన్నీ చితికి పచ్చడైపోయేయి. ఇదంతా చూస్తూ బయట నిలబడియున్న జనం గొల్లుమన్నారు. లాప్షినోవ్ కంగారుగా లేచి టోపీ సర్దుకొని కొడుకుని తీసుకొని వీధులోకి పరిగెత్తేడు. మెట్లమీద నుంచి క్రిందికి దొర్లడంచేత లాప్షినోవ్ భార్యకి బాగా దెబ్బతగిలింది. నెమ్మదిగా లేచి బట్ట దులుపుకొని, రెక్కలు కొట్టుకొంటూన్న బాతు మొండెం అందుకోడానికి చెయ్యి చాపింది. కాని ఇంతలో, పక్కని తారట్లాడుతూన్న కుక్క ఒకటి రక్తంకారుతూన్న బాతుని చూడగానే ఒక్క వురుకున దానిమీదపడి నోటకరుచుకొని పారిపోయింది అక్కడ చేరిన పిల్లలంతా కేకలేస్తూ దాని వెంటబడి తరుముకు పోయేరు.

డిమ్కా చేతిలోనున్న బాతు మెడను లాప్షినోవ్ భార్య మీద గిరవాటేసి నోటికివచ్చినట్లు తిడుతూ యింట్లోకి వెళ్లి పోయేడు. చాలసేపటివరకు లాప్షినోవ్ వాకిట్లోనూ, ఆ వీధులోను ప్రజలు గుంపులుగుంపులుగా చేరి, యీ విషయాన్ని గురించి చెప్పుకుంటూ కడుపు చెక్కలయ్యేలా నవ్వుకుంటూనే వున్నారు.

# పన్నెండో ప్రకరణము.

## హత్య.

గ్రెమాచీలోని వెనుకటి ప్రశాంతత పోయింది. రాత్రిం బగళ్ళు కోసక్కులు, ప్రక్క సందులలోను, యిళ్ళలోను చేరి, సమిష్టి వ్యవసాయక్షేత్రాన్ని గురించి చర్చిస్తున్నారు. నాలుగు రోజులు వరుసగా సాయంత్రం మీటింగులు పెట్టి, తెల్లవారుఝామున కోడికూసేవరకు చర్చలు సాగించేరు.

ఆరోజుల్లో విశ్రాంతి లేకుండా పనిచెయ్యడంచేత నగుల్నోవ్ చిక్కి శల్యంఅయిపోయేడు. డేవిడోవ్ మాత్రం పైకి వెనుకటివలెనే వున్నాడు. కాని మనసులోని ఆరాటం ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది. అతనిమీద రజ్మెట్నోవ్ కి ఒక విధమైన గురి యేర్పడింది. అహంభావంతో చిరునవ్వు నవ్వుకుంటూ, ఆంద్రీ సమిష్టి పశుశాలలు తణిఖీచేస్తూ, గ్రామం అంతటా తిరుగుతూ, మేనేజ్ మెంటుకమిటీ యెన్నికయ్యేవరకు తాత్కాలికాధ్యక్షుడుగా యేర్పరుపబడిన ఆర్కాడీతో, "మనం సమిష్టి వ్యవసాయక్షేత్రాన్ని ఆదర్శప్రాయంగా నడపాలి. తరువాత ఒక్కొక్కరే వచ్చిచేరకేంచేస్తారు." అంటూండేవాడు.

డేవిడోవ్, జిల్లా కమిటీకి ఒక వార్తాహరుని పంపించి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరవలసినవారిలో 32% రైతులు మాత్రమే చేరగనీ, తీవ్రమైన వొత్తిడి కలిగించి మిగిలినవారిని కూడ చేర్చడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని తెలియజేసేడు.

ఇళ్ళనుంచి వెళ్లగొట్టబడిన భాగ్యవంతులు వారివారి బంధువుల యిళ్ళకి, స్నేహితుల యిళ్ళకి చేరేరు. ఫ్రోల్ తన కొడుకు 'టిమోఫీని' రీజినల్ ప్రాసిక్యూటరు దగ్గరికి పంపి, వెనక బీదకోసక్కుల మీటింగులో వోటు చెయ్యడానికి నిరాకరించిన బోర్షేవ్ యింట్లో మకాం చేసేడు. ఆ బోర్షేవ్ చుట్టు గుడిసెలో నే—గ్రామములోని భాగ్యవంతులు, యితరులు కొంతమంది చేరడం ప్రారంభించేరు. పగటివేళ ఒకరూ ఇద్దరూ చొప్పున విడివిడిగా సోవియట్ అధికారుల కంట పడకుండా దొడ్డిదోవనీ, పక్క సందులన్నీ పడివచ్చి చేరుతుండేవారు. డేవిడ్ గెయీవ్ లాప్షినోవ్ మాత్రం ప్రతిరోజూ తప్పకుండా వస్తుండేవాడు. యాకోవ్ లూకిచ్ ఆస్ట్రోవ్నోవ్ యెవరేనా చూస్తారేమోనను భయంచేత అప్పుడప్పుడు అతి రహస్యంగా వస్తుండేవాడు. సమిష్టి వ్యవసాయక్షేత్రం అంటే యేమాత్రముకిట్టని మధ్యరకపు రైతులు 'నికోలాయ్ లుష్నియా', వంటివాళ్ళు కూడ కొందరు వస్తుండేవారు. ఇక్కడికి వచ్చే వారిలో బోర్షేవ్ కాక యింకొక యిద్దరు బీదకోసక్కులు

మాత్రం వున్నారు. వారిలో, వాసిలీఅటమంచుకోవ్ ఒకడు; సన్నంగా, జువ్వలా వుంటాడు. నికీటాఖాపోవ్ రెండవ వాడు. ఇతడు పూర్వం జారు ప్రభుత్వకాలంల్లో ఫిరంగి సైన్యంలో పనిచేసేడు. అంతర్యుద్ధకాలంలో సైన్యంలో చేరకుండా తప్పించుకొని తిరిగేడు. కాని 1919 వ సం॥లో విప్లవ వ్యతిరేకులతో చేరి 'కల్నల్ అస్తిమోవ్' నాయకత్వముక్రింద బోల్షివిక్ సైన్యాలతో పోరాడేడు. అందుచేత, బీదకోసక్కు అయినప్పటికి సోవియటు ప్రభుత్వం అతనిని శత్రుభావంతో నే చూస్తూవచ్చింది. గ్రిమాచీలోని ముగ్గురు వ్యక్తులు: యాకోవ్ లూకిచ్ ఆస్ట్రోవ్నోవ్, అతని కొడుకు, లాప్షినోవ్ లు, ఇతను అస్తిమోవ్ సైన్యంతో కలిసి, విప్లవవ్యతిరేకులకు చిహ్నమైన తెల్లటిబాడ్జి ధరించి 1920 వ సం॥లో బోల్షివిక్ సైన్యములకు ఓడి పారిపోతుండగా చూసేరు. మరియొక పర్యాయం, కుషి వ్హా రైల్వే డిపోలోని కూలీలను, ఖాపోవ్ మరి ముగ్గురు కాల్మిక్ కోసక్కులు కలిసి అరెస్టుచేసి విచారణకొరకు అస్తిమోవ్ దగ్గరికి తీసుకొనిపోతుండగా కూడా చూసేరు......అంతర్యుద్ధం పూర్తిఅయిన తరువాత ఖాపోవ్ 'నొవోరొసిస్కు'నుంచి తన స్వగ్రామమైన 'గ్రిమాచీలాగ్' చేరేడు. తను విప్లవ వ్యతిరేకులతో చేరి పనిచెయ్యడం లాప్షినోవ్, ఆస్ట్రోవ్నోవ్ లు స్వయంగా చూసేరని తెలుసుకొన్నాడు. విప్లవ వ్యతిరేకుల నందరను, సోవియటు ప్రభుత్వము దయాదాక్షిణ్యాలు లేకుండా

తీవ్రంగా అణచేస్తున్న రోజులవి! కాటాబస్తా అమాంతంగా రెండోవాడి సహాయం లేకుండా యెత్తుకోగలిగినంత దార్ఢ్యవంతుడయినప్పటికి ఖాషారోవ్, విషపు నవ్వు నవ్వుతుండే లాషినోవ్ యెదురుపడ్డాడంటే గజగజ వణికిపోయేవాడు. అతడు లాషినోవ్ కి తప్ప యింకెవరికి అంత భయపడడు. ఎప్పుడైనా లాషినోవ్ యెదురుపడినప్పుడు ఖాషారోవ్ దీనంగా,

"బాబూ! నా ప్రాణాలు మీ చేతిలో నున్నాయి. యేం చేసినా మీదే భారం" అంటుండేవాడు.

"నికీటా! నీకేమీ భయంలేదు నేనుమాత్రం క్రైస్తవుడిని కానా! క్రీస్తు యేమని చెప్పేడు: 'ఇరుగు పొరుగువారిని కూడ దయతో చూస్తుండు' కలలో కూడా నువ్వు అటువంటి భయం పెట్టుకోకు. నాలిక కోసినా నా నోట అబద్ధంమాట రాదు. చెప్పడం ఒకటి చెయ్యడం ఒకటి—మా ఇంటా వంటాకూడా లేదు. కాని నువ్వు ఒక్క వుపకారం చేసిపెట్టాలి......ఏ విూటింగులోనైనా—యెవటివాడు పచ్చగా వుంటే చూసి ఓర్వలేని అసహ్యప్పుంబు కాని,— లేక ప్రభుత్వమే అవచ్చు— నన్ను యెదుర్కొన్నప్పుడుమాత్రం కొంచెం మాట సహాయం.........ఎవరు తవ్విన గోతిలో వాళ్ళేపడతారులే- ఏమంటావు' అయినా ఎందుకయినా మంచిదని చెబుతున్నాను. ఇంకో చిన్న విషయం వుంది: అగుమ రోజుల్లో కొంచెం సహాయం చెయ్యమని అడు

గుదం అనుకుంటున్నాను. మావాడిని నువ్వు యెరుగుదువుకదా—అవధ్యుడు—యెందుకు అక్కరకురాడు పోనీ, కూలీని పెడదాం అంటే—మనబోటి సామాన్య సంసారులం భరించలేం."

లాప్షినోవ్, నికీటాఖాసోవ్ చేత నానా వెట్టిచాకిరీ చేయించుకుంటుండేవాడు. ఖాసోవ్ యింటికి వెళ్ళి కుర్చీలో కూలబడి "యెంత కాలం వీడికి యిల్లా వెట్టిచాకిరీ చెయ్యడం! ఎప్పుడో కూనీ చేసేస్తా!" అనుకుంటుండేవాడు.

యాకోవ్ లూకుచ్ కికూడా 'తను యేమి కోరినా ఖాసోవ్ చేతనయినంతవరకు చేస్తాడ' ని తెలుసును. కాని 'లాప్షినోవ్ లా' కాకుండా, మంచిమాటలు చెప్పి, చల్లచల్లగా చేయించుకుంటుండేవాడు. అతడు వెనక తిరగగానే ఖాసోవ్ పళ్ళుకొరుకుతూ, "దొంగముండాకొడుకులు యిద్దరూ యిద్దరే! మీరిద్దరూ చావాలి—నా ప్రాణం సుఖపడాలి—" అనుకొనేవాడు.

ఫాలోపిట్రీవ్ యింకా యాకోవ్ లూకుచ్ యింట్లోనే వుంటున్నాడు. యాకోవ్ లూకుచ్ అతనికి తన తల్లి పడుకొనే గది ఖాళీచేసి యిచ్చేడు. పగలల్లా ఆ గదిలో మంచంమీద కాళ్లు స్టౌ వైపు పెట్టుకొని కాచుకుంటూ, వదలకుండా సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూ, యేదో ఆలోచిస్తూ పడుకొని వుండేవాడు. రాత్రి పూరు మాటుమణిగిందనగానే పిశాచంలా యిల్లు అంతా తిరుగుతుండేవాడు. అప్పుడప్పుడు బొచ్చుకోటు తొడుగుకొని, సిగరెట్టు ఆర్పేసి, రహస్యంగా నెమ్మదిగా,

దొడ్లో పాకలోనున్న తన గుఱ్ఱాన్ని చూడడానికి వెళుతుండేవాడు.

ఒకరోజు రాత్రి, కన్ను-కన్ను కానరానంత అంధకారములో పాలోవిట్స్కీవ్ పాకలోనుంచి గుఱ్ఱమును బయటకు తీసుకొనివచ్చి, యెక్కడికో యెక్కి వెళ్ళిపోయేడు. అతడు తిరిగి వచ్చేటప్పటికి తూర్పు తెల్లవారవచ్చింది. గుఱ్ఱం చెమటతో తడిసి ముద్దయిపోయింది. పక్కలు యెగరేస్తూంది. ఉండి, వుండి ఆపాదమస్తకం వణికిపోతూంది. ఆ వుదయం పాలోవిట్స్కీవ్ లూకుచ్‌ని పిలిచి, "రాత్రి మా వూరికి వెళ్ళి వచ్చేను. అక్కడ నాకోసం వెతుకుతున్నారు. కోసక్కులంతా తిరుగుబాటు చెయ్యడానికి సిద్ధంగా వున్నారు. ఆజ్ఞకోసం యెదురు చూస్తున్నారు" అని చెప్పేడు.

• తరువాత కొద్దిరోజులకే డేవిడోవ్ గ్రామస్తులందరను సమావేశపరచి, సమిష్టి వ్యవసాయక్షేత్రమువల్ల కలుగు లాభములను గురించి చెప్పేడు. ఆ సభలో పాలోవిట్స్కీవ్ సలహాననుసరించి యాకోవ్ లూకుచ్, గ్రామస్థులందరు తప్పక చేరవలెననియు, దానివల్ల అనేక లాభములున్నవనియు గంభీరోపన్యాసము యిచ్చి తన వెంటనే సభ్యుడుగా చేరేడు. అతను చేరుట చూచి ఆరోజు సాయంకాలములోపుగా మరి 30 మంది చేరేరు.

ఆరోజున సభలో సమిష్టి వ్యవసాయక్షేత్రంవల్ల చాలా

లాభాలు వున్నాయని చెప్పేడు కాని మరునాడుదయం రహస్యంగా, సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరుటకు యిష్టములేని కోసక్కుల దగ్గరికి వెళ్ళి, వారిని చేరవద్దని చెప్పడం మొదలెట్టేడు. డబ్బు ఆశ వున్న వాళ్ళకి డబ్బు యిచ్చి, కొంతమందికి వోడ్కా పోళ్ళు తెలియకుండా పోయించి తన వైపు తిప్పుకున్నాడు.

"మీరు అందరికంటె ముందుగ నేనే సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరాలి. లేకపోతే నన్ను కూడా భాగ్యవంతులలో జమకట్టి వెంటనే నా ఆస్తి అంతా స్వాధీనం చేసుకుంటారు. అంతే కాని-మీరు చేరడం అనవసరం. ఎడ్లని చూసేరా- వాటి మెడకి కాడి తగిలించి యెల్లా చాకిరీ చేయించుకుంటున్నారో! అల్లాగే మిమ్మల్ని కూడ నిర్బంధించి చాకిరీ చేయించుకుంటారు." అంటూ తన మామూలు పాఠం వల్లించేడు. ఆడవాళ్ళని కూడ సమాజపరం చేస్తారనీ, కుటుంబ విచ్ఛేదం చేస్తారనీ దేశం అంతటా రైతులు తిరుగుబాటు చెయ్యడానికి సిద్ధంగా వున్నారనీ, తోచినట్లు కల్పించి చెప్పి, కొత్తవారిని యిద్దరిని రహస్య సంఘంలో చేర్చి యింటికి వెళ్ళిపోయేడు.

అంతా సవ్యంగానే జరిగిపోతూంది. యాకోవ్ లూకిచ్ సుమారు 30 మందిని రహస్య సంఘంలో సభ్యులుగా చేర్చేడు. ఇంతలో అకాత్తుగా అనుకోని విపత్తు ఒకటి సంభవించింది. ఒకరోజు సాయంకాలం యాకోవ్ లూకిచ్ మామూలుగా

బోర్షేవ్ యింటికి వెళ్ళేడు. అప్పటికప్పుడే అక్కడ చాలా మంది సభ్యులు పోగయ్యేరు. గదిలో వెచ్చగా వుండటం కోసం బోర్షేవ్ నెగడుకి పుల్లలు తగులుస్తున్నాడు. బల్లలమీద ఫ్రోల్, లాప్షినోవ్, గుర్యూవ్, నికోలాయ్ లుప్కియా, వాసిలీ అటుమంచుకోవ్, ఖారిగ్రావ్ మొదలైనవాళ్ళు కూర్చుని వున్నారు. అప్పుడే పట్నంనుంచి తిరిగి వచ్చిన ఫ్రోల్ కొడుకు టిమోఫీ ద్వారబంధము నానుకొని నిలబడి 'పబ్లిక్ ప్రాసిక్యూటరు' తనపిర్యాదును విచారించుటకు బదులు, అరెస్టు చెయ్యడానికి సిద్ధపడడం మొదలైన విషయాలు చెబుతున్నాడు. లూకుచ్ రాగానే టిమోఫీ అత్తుగా చెబుతున్న విషయం ఆపేసేడు.

"టిమోఫీ! అతడు మనవాడే. నువ్వేమీ భయపడనవసరం లేదు" అని ఫ్రోల్ కొడుకుని హెచ్చరించేడు.

టిమోఫీ! అక్కడ జరిగిన విషయాలన్నీ సాంతంగా చెప్పేడు. కళ్ళు తళతళలాడుతున్నాయి.

"పరిస్థితులన్నీ మనకి వ్యతిరేకంగా వున్నాయి. వాళ్ళకి శత్రువులని తోచినవాళ్ళందరిని తీవ్రంగా అణచేస్తున్నారు. ఇప్పుడు దేశంలో యేదైనా తిరుగుబాటు వచ్చిందంటే, నేను కూడా తక్షణం బయలుదేరి యీ కమ్యూనిస్టుల్ని అందర్నీ నాశనం చేసేద్దును-"

"ప్రభుత్వం వొత్తిడి, నిర్బంధం చాలా తీవ్రంగానే వున్నాయి; కాని ఇంతకంటె అధ్వాన్నం అవకపోతే అదీ ఒక సుగు

ణమే." అన్నాడు లూకస్.

"ఎంతవరకు అవాలో ఆంతవరకు ఇదివరకే అయేయి.—గోచీకి, మిక్కిలి దరిద్రంవుంటా!"" అన్నాడు ప్రోల్ కోపంతో.

"నీ ఆస్తి, నీకు భద్రంగానే వుంది- నీకేం! యొటొచ్చీ, ఆస్తి అంతా పోయి చిప్ప చేతికొచ్చినవాళ్లం మేము. మొన్న మొన్నటివరకు మనం యిద్దరం సమానస్థితిపరులుగా వుండేవాళ్ళం. ఇప్పుడు నీకు కొంతఆస్తి పోయినా తిండికి గుడ్డకి లోటులేదు. మాదగ్గరనుంచి మాత్రం వంటు వండుకొనే గిన్నె సహా లాక్కున్నారు."

"ఆవిషయం కాదు; ఇంకోవిషయం ఏదో ఆలోచిస్తున్నాను."

"ఏమిటది?"

"మళ్ళీ యుద్ధం వస్తుందేమోనని."

"ఆమాత్రం అదృష్టంకూడానా! యుద్ధం వస్తే యింక మనకి కావలసినదేముంది! భగవంతుడికి మొక్కుతున్నాను......"

"1919 సం॥లో 'ప్రోషన్‌స్కా'లో ప్రజలు తిరుగుబాటు చేసేరు చూసేవు; అల్లాగ చేతికి అంకినదల్లా పుచ్చుకొని తయారవుతాము."

"నాకసితారా, కమ్యూనిస్టుల్ని చిత్రవధచేస్తాను."

అంతర్యుద్ధంలో కంఠానికి దెబ్బ తగలడంచేత కీచుకంఠం అయిపోయిన అటమంచుకోవ్, చీరండలం సన్నని గొంతుకతో "ప్రజలు యింక యేమాత్రం ఓర్వలేని స్థితికి వచ్చేరు.

ఆయుధాలు లేకపోతే గోళ్ళతో రక్కి, పళ్ళతో పీకి, చంపుతారు" అన్నాడు.

యాకోవ్ లూకిచ్, చుట్టుపక్కల అన్ని జిల్లాలలోను అశాంతి ప్రబలుతూందనీ, కొన్ని చోట్ల కోసక్కులు కమ్యూనిస్టుల్ని పట్టుకొని సంచులలో కట్టి నీళ్ళలో పారేసీ - కాళ్ళు చేతులు ఒక్కొక్కటే తెగగొట్టి చంపేసీ, అనేకవిధాల చిత్రవధలు చేస్తున్నారనీ, వుత్తర కాకేషియా ప్రాంతంలో అంతా తిరుగుబాటు చెయ్యడానికి సిద్ధపడుతున్నారనీ, డాన్ నదీ తీరాన్న కొన్ని జిల్లాలలో 'స్త్రీలని అందరు సమానంగా అనుభవించాలని,' చట్టాలు చేసేరని, కమ్యూనిస్టులు సంసార స్త్రీలనందరిని మానభంగం చెయ్యడానికే యీ చట్టాలన్నీ చేస్తున్నారనీ, తొలకరి నాటికి విదేశ ప్రభుత్వాలు రష్యామీదికి దండెత్తివస్తాయనీ, అక్కడ వున్నవాళ్ళందరు నమ్మేటట్లుగా చెప్పేడు. ఆ విషయాలన్నీ నమ్మకస్తుడైన ఒక సేనానాయకుడు వారంరోజుల క్రితం ఆవూరు వచ్చినప్పుడు తనకి తెలియజేసేడని చెప్పేడే కాని, అతడు యింకా తన యింట్లోనే వున్న సంగతిమాత్రం చెప్పలేదు.

అంతవరకు మౌనంతో వింటూ కూర్చునియున్న ఖాప్రోవ్ "యాకోవ్ లూకిచ్: మనం అంతా తిరుగుబాటు చేసి యీ ప్రాంతంలోని కమ్యూనిస్టుల్ని అందర్ని చంపేస్తామనుకో, తరువాత? మిలీషియా వచ్చినా వోడించేస్తాం. కాని ప్రభుత్వం

సైన్యాలు తీసుకువచ్చి దింపుతే? వాళ్లతో యుద్ధం చెయ్య డానికి మనల్ని నడిపించేవాడెవడు? మనవంటివాళ్లు యెంత మంది వుంటేమాత్రం యేం లాభం— సమర్థులైన ఆఫీసర్లు, సేనానాయకులు లేకపోయినతరువాత?" అన్నాడు.

"సమయం వచ్చిందంటే అంతా సమకూడుతారు! బోల్షివిక్ సేనానాయకులకంటె సమర్థులైనవాళ్లు, యుద్ధవ్యవసాయంలో తల నెరిసినవాళ్ళు, అనేకమంది మన పక్షాన్ని పోరాడడానికి సిద్ధంగా వున్నారు. బోల్షివిక్ సేనానాయకులు యెలాంటి వాళ్లో యెరుగుదువా? యెక్కడిదాకానో యెందుకు—మన 'మకార్ నగుల్నోవ్'ని చూడు. అమాంతంగా మనిషిని నిలువునా చంపెయ్యకలడు. అంతమాత్రంచేత సైన్యాలు నడిపించడం చేతనవుతుందా? సేనానాయకుడికి యెంత అనుభవం, తెలివితేటలు, నేర్పు, వుండాలి?" అన్నాడు లూకుచ్.

"కాని—మనకి ఆఫీసర్లు యెక్కడనుంచి వస్తారు?"

"ఇకపైని దేశంలో పడతారు!" లూకుచ్ కొంచెం గాభరాపడ్డాడు. "నికీటా! 'యెక్కడినుంచి వస్తారు!' అని నన్ను వేపుగుతి నేస్తున్నావు— నాకేమేనా జ్యోతిషం వచ్చుననుకున్నావా, వాళ్లు యెక్కడినుంచి వస్తారో చెప్పడానికి?"

"ఏ విదేశాలనుంచో వస్తారు. ఎక్కడినుంచి వస్తే మన కెందుకు, మన పని మనకి అవాలికాని?" ఫ్రోల్ ముందురాబోయే విప్లవం, అప్పుడు శత్రువులమీద తాము జరిపే భయంకర ప్రతీ

కారము మనస్సులో చిత్రించుకుంటూ సంతృప్తితో పెద్ద వుఛ్వాస తీసుకున్నాడు.

ఖాప్రోవ్ లేచి నిలబడ్డాడు. దట్టంగా పెరిగియున్న యెర్రటి గడ్డం నిమురుకుంటూ వినేవారి మనస్సులకి గాఢంగా నాటేటట్లు మాట్లాడ్డం మొదలెట్టేడు:

"సరే! యెక్కడినుంచి వస్తేమాత్రం నాకెందుకు......... కాని కోసక్కులు వెనకటంత మూర్ఖులు, అజ్ఞానులు కారు. వెనుక తిరుగుబాటు చేసినందుకు ప్రభుత్వం బహు క్రూరంగా శిక్షించింది. ఇంక యెన్నడూ, వాళ్ళు తిరుగుబాటు చెయ్యరు. క్యూబాన్ కూడా తిరుగుబాటులో పాల్గోదు........."

యాకోవ్ లూకిచ్ నవ్విన నవ్వు మూతికూడా కప్పేసిన అత్తని బూడిదవర్ణపు గడ్డంలోనే అంతరించిపోయింది.

"ప్రజలంతా ఒక్కతాటిమీద లేచి తిరుగుబాటు చేస్తారు. క్యూబాన్ అంతా నామరూపాలు లేకుండా నేలమట్టంచేసి పారేస్తారు. ఇంతవరకు అణచి యుంచబడిన వారందరు మరుక్షణంలో తిరగబడి శత్రువుల్ని నేలరాసేస్తారు." అని యాకోవ్ ధీమాగా అన్నాడు.

"మీరు లక్ష చెప్పండి, నాకేమీ నమ్మకంలేదు. నేను ప్రభుత్వంమీద తిరుగుబాటు చెయ్యదల్చుగోలేదు. నా సలహా అడిగినవాళ్లకికూడా తిరుగుబాటు చెయ్యొద్దనే చెబుతాను. లూకిచ్! ప్రజల్ని తిరుగుబాటు చెయ్యమని చెప్పడంవల్ల లాభంలేదు.

రాత్రి మీ యింటికి వచ్చిన ఆఫీసరు యెవరో కూడా తెలియదు నీకు. అటువంటివాళ్ళ మాటలు నమ్మడం మంచిది కాదు. సుఖంగా జీవిస్తున్న మనల్ని తిరుగుబాటు చెయ్యమని ప్రోత్సహించి, వ్యవహారం చెయ్యిదాటిపోగానే చల్లగా తప్పుకుంటాడు. తరవాత బాధపడేవాళ్ళం మనం. కిందటి యుద్ధంలో యేమయింది? మనచేత సోవియట్ ప్రభుత్వంమీద తిరుగుబాటు చేయించేరు. ఆదరాబాదరాగా మనల్నే ఆఫీసర్లుగా కూడా తరిఫీదు చేసేరు. వారుమాత్రం యుద్ధరంగం వెనక నిలబడి. పడుచుపిల్లలతో కులాసాగా కాలం గడిపేరు. చివరికి యుద్ధం ముగిసిన తరువాత తిరుగుబాటు చేసినందుకు నష్టపడినవాళ్ళు ఎవరు? నొవోరొసిస్కులో బోల్షివిక్ లు చేతికందిన 'కాల్మిక్'ల నందరినీ కోసి వొదెలుపెట్టేరు. ఆఫీసర్లు యితర తిరుగుబాటు నాయకులుమాత్రం వొడలెక్కి, కడుపులో చల్ల కదలకుండా జాగ్రత్తగా విదేశాలకి చేరుకున్నారు. డాన్ సైన్యాన్ని అంతనీ తరిమితరిమి గొఱ్ఱెలమంద తోలుకువచ్చినట్లు 'నొవోరొసిస్కు'కు తోలుకువచ్చేరు. ఆ తిరుగుబాటు నాయకులు యేమయ్యేరు? మిమ్మల్ని యింకొక్క విషయం అడుగదల్చుకున్నాను. రాత్రి మీ యింటికి వచ్చిన పెద్దమనిషి వున్నాడే— అతడు యింకా మీ యింట్లో లేడూ? దొడ్లో పాకలోకి నువ్వు బాల్చీతో నీళ్లు తీసుకువెడుతుంటే అనేకసార్లు చూసేను. 'లూకిచ్ యెందుకో అక్కడికి నీళ్ళు తీసుకువెడుతున్నాడు? నీళ్లు తాగడానికి

అక్కడేమీ లేవే!' అనుకున్నాను. అంతట్లో గుఱ్ఱం సకిలింపు వినబడింది." క్రమంగా అస్ట్రోవ్‌నోవ్ ముఖవైఖరి మారుతూ చివరికి నెత్తురుచుక్కకూడా లేనట్లు తెల్లబడిపోవడం ఖాబ్రోవ్ చూసి లోలోపల సంతోషిస్తూ నిలబడ్డాడు. అక్కడవున్న అందరి ముఖాలలోను ఆందోళన, ఆతురత వ్యక్తం అవుతూంది. ఖాషొవ్ సంతోషం కంఠపూర్తి అయింది.

"మా యింట్లో ఆశీసరేనదూ లేదు." అన్నాడు లూకుచ్ తీవ్రంగా. "నీకు వినబడిన ఆ సకిలింపు మా గుఱ్ఱానిదే. ఆ పాకలో వున్న పందికి పొయ్యడానికి కుడితి తీసుకువెళ్ళేను, కాని నీళ్ళు యెప్పుడూ తీసుకువెళ్ళలేదు."

"నీ గుఱ్ఱం సకిలింపు నాకు గుర్తే; ఆ కథన్లు నాదగ్గర చెప్పకు. పోనీ- ఆగొడవ నాకెందుకు! ఇంతటితోనుంచి నేను మాత్రం మీతో కలిసిరాను." ఖాషొవ్ టోపీ వెట్టుకొని చుట్టూ చూసి, గుమ్మంవైపు బయలుదేరేడు. ఇంతలో లాష్టినోవ్ చేతులుజాపి గోడకి అడ్డంగా నిలబడ్డాడు.

"గోప్రీహి! వెళ్ళి ఇక్కడ జరిగినదంతా తెలియచేస్తావా! డబ్బుకి ఆశపడి వాళ్ళతో చేరేవా! నువ్వు వెనక 'కాల్చాక్' లతో కలసి వ్యాటివ్ పటాలాలతో పనిచేసేవని తెలియచేస్తాం- జ్ఞాపకం వుంచుకో.. ......"

"ఓరేయ్! ముసలిపీనుగా! ఇంకా బెదిరించి వుపయోగించుకోడానికి చూస్తున్నావురా!" ఖాబ్రోవ్ పిడికిలి బిగించి

లాప్షినోవ్ గద్గదంగా యెత్తుకొని యిలా అన్నాడు. "మొట్టమొదట నా విషయం తోనే ప్రారంభిస్తాను; 'నేను 'కాల్మక్' ప్యూనిటివ్ దళాల్లో పనిచేసేను, శిక్షించండి.' అని చెప్పేస్తాను. కాని మీ విషయం కూడా ఆలోచించుకోండి. ఒరే! ముసలివకాల్యా! నువ్వు!......" అంటూ నిట్టూర్పు వదిలేడు. "ఇంతవరకు జలగలా నా రక్తం పీల్చి, పిప్పిచేసేరు. ఇప్పుడు తగిన ప్రతీకారం చేస్తాను."

అతడు లాప్షినోవ్ ముఖంమీద ఒక్క గుద్దుగుద్ది, అక్కడే నిలువునా కూలిపోయిన అతనివంక తిరిగేనా చూడకుండా గుమ్మము దాటి గభాలున తలుపు వేసి వెళ్లిపోయేడు. టిమోఫీబోరేవ్ ఒక బాల్చీ తీసుకువచ్చి లాప్షినోవ్ ముందు పెట్టేడు. అతి నెమ్మదిగా లేచి కూర్చుని బాల్చీమీదికి వంగేడు. గది అంతటా నిశ్శబ్దంగా వుంది. ఆ నిశ్శబ్దంలో లాప్షినోవ్ సన్నటి మూలుగు, బాగా యెరిగిపోయి వున్న అతని గడ్డంమీదనుంచి రక్తపు బొట్లు బాల్చీలోకి పడుతున్న ధ్వని స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"ఏమీ అనుమానం లేదు వెళ్లి చెప్పేస్తాడు." అన్నాడు కులక్ గెయీవ్. నికోలాయ్‌లుష్కిన్ గభాలునలేచి, వెడుతున్నాననేనా చెప్పకుండా, టోపీ పెట్టుకొనేటందుకుకూడ వ్యవధిలేకుండా గబగబా వెళ్ళిపోయేడు. అతని వెనుక అటమంచుకోవ్ లేచి కీచుగొంతుకతో "వెంటనే మనంఅంతా యిక్కడనుంచి చెదిరిపోవాలి, లేకపోతే పట్టుబడిపోతాం" అంటూ

వెళ్ళిపోయేను.

చాలసేపటివరకు యాకోవ్ లూకుచ్ మాట్లాడకుండా అల్లాగే కూర్చుండిపోయేడు. కంఠానికేదో అడ్డుపడినట్లు అనిపించింది, అతనికి. ఊపిరి పీల్చడంకూడా భారంఅయింది. రక్తం తలలోకి వేగంగా ప్రవహించసాగింది. నుదుటిమీద చిరుచెమటలు పోసేయి. కొంతసేపటికి లేచి నిలబడ్డాడు. అప్పటికప్పుడే చాలామంది వెళ్ళిపోయేరు. నెమ్మదిగా బయలుదేరి వెడుతూ టిమోఫీ వైపు తిరిగి "నాతోకూడా రా." అన్నాడు.

మారుమాటాడకుండా టిమోఫీ కోటు తొడుక్కొని, టోపీ చేత పుచ్చుకొని యాకోవ్ వెనక బయలుదేరేడు. రాత్రి బాగా పొద్దుపోవడంచేత గ్రామంఅంతా మాటుమణుగుతూంది.

"ఎక్కడికి వెడుతూన్నాము" అన్నాడు టిమోఫీ.

"మా యింటికి"

"ఎందుకు"

"చెబుతా, అది దాటనీ."

సాహసించి యాకోవ్ లూకుచ్ సోవియట్ ఆఫీసు దగ్గర నుంచే దోవతీసేడు. ఆఫీసులోకూడా ఎవరూ లేరు. చీకటి కొట్టాడుతూంది. వారిద్దరు యాకోవ్ యింటిని సమీపించేరు. యాకోవ్ ఆవరణ గుమ్మందగ్గర ఆగి టిమోఫీ కోటు స్పృశించేడు.

"ఇక్కడ కొంచెంసేపు ఆగు. నేను మళ్ళీ వచ్చి పిలుస్తాను."

"ఆ—అల్లాగే."

యాకోవ్ తలుపు తట్టేడు. అతని కోడలు వచ్చి తలుపు తీసి "మీరేనా—యెవరో అనుకున్నాను." అంది.

"అవును" అంటూ తలుపు ఘడియవేసి, తిన్నగా పాలో విట్స్కీవ్ వున్న గదిగుమ్మం దగ్గిరికి వెళ్ళి తలుపుమీద చప్పుడు చేసేడు. లోపలనుంచి గంభీరమైన ధ్వని వినబడింది:

"ఎవరువారు?"

"నేనండి — అలెగ్జాండర్ అనిసిమోవిచ్! లోపలికి రావచ్చా?"

"ఆ-రావచ్చు."

పాలోవిట్స్కీవ్ కిటికీకి యెదురుగానున్న టేబులుముందు కూర్చుని యేదో వ్రాసుకుంటున్నాడు. గదిలోవాళ్ళు వీధిలోకి కనబడకుండ కిటికీకి అడ్డముగా నల్లటితెర వేళ్ళాడుతూంది. వ్రాస్తున్న కాగితంమీద చెయ్యి అడ్డంగాపారేసి యాకోవ్ లూకిచ్ వైపు చూస్తూ,

"ఏమిటి విశేషాలు? పనులన్నీ సవ్యంగా జరుగుతున్నాయా?" అన్నాడు.

"ఏం బాగులేవు. యిప్పుడే వొకవిషయం జరిగిం......"

"ఏమిటి? త్వరగా చెప్పు!" పాలోవిట్స్కీవ్ మెరుపులా లేచి నిలబడ్డాడు. వ్రాస్తున్న కాగితాలు జేబులో కుక్కేసి, తొందరగా చొక్కా బొత్తాలు పెట్టుకొని; కందగడ్డలా యెఱ్ఱబడిన

ముఖంతో, మాటు కాచి, పురకడానికి సిద్ధంగావున్న పులిలా ముందుకి వంగి నిలబడ్డాడు.

యాకోవ్ లూకిచ్ కంగారుతో తడబడుతూ బోర్డ్ మీటింగ్లో జరిగినదంతా చెప్పేడు. పొలోవ్ ట్సేవ్ లూకిచ్ కేసి తీవ్రంగా చూస్తూ, నిశ్శబ్దంగా, అంతా విన్నాడు. పళ్లు కొరుకుతూ, పిడికిళ్ళు బిగించి అకాత్తుగా - తుపానులా - లూకిచ్ మీద విరుచుకుపడి నోటికి వచ్చినట్లల్లా తిట్టేడు.

"ఏమిరా- గాడిదా నీ కేమైనా బుద్ధివున్న పనేనా ఇది! నన్ను నాశనం చెయ్యదల్చుగున్నావురా! ఇంత శ్రమపడి మేము చేసిన పని అంతా ధ్వంసం చేస్తావా! ఏమాత్రం మెదడున్నవాడేనా యీలాగ చేస్తాడా! నీ అజాగ్రత్తవల్ల అంత పనీ నాశనం అయిపోయింది. మొదట నీకు యేమని చెప్పేను?- మాట్లాడవేం! ముందుగా ఒక్కొక్కళ్ళనే పరీక్షించి చూసి మరీచేర్చుకుని చిలక్కి చెప్పినట్లు చెప్పేనే! ఇన్నీ చెప్పినా చివరకు కార్యం అంతా తగలేసేవు. శుద్ధమూర్ఖుడులా ప్రవర్తించేవు." అసలే భయపడుతూ వచ్చిన లూకిచ్, కొయ్యబారి పోయేడు. "ఇప్పుడు యేంచేద్దాం? ఖాపోవ్ యీపాటికి యీ విషయం అంతా చెప్పివుంటాడా! బెల్లంకొట్టిన రాయిలా మాట్లాడవేం? ఈలాంటి మూర్ఖుడిని యెక్కడా చూడలేదు! చెప్పలేమూ! అక్కడినుంచి తిన్నగా యెక్కడికి వెళ్ళేడు! అతనితోకూడా వెళ్ళి చూసేవా?"

"లేదు............వెళ్ళలేదండి. ఇప్పుడు వెళ్ళాలి." అన్నాడు యాకోవ్ లూకుచ్ చేతులు నలుపుకుంటూ. కన్నీటి చుక్క వొకటి కొలికిలోనుంచి తొంగిచూసి క్రిందికి జారి పోయింది. పాలోవిట్స్లీవ్ పళ్ళుకొరుకుతూ నిలబడ్డాడు.

"ఆడదానిలా యేడుస్తావెందుకు? ఇప్పుడేదో తగిన ప్రతిక్రియ చెయ్యాలికాని......నీ కొడుకు యింట్లో వున్నాడా!"

"తెలియదు......కూడా యింకొకర్ని తీసుకువచ్చేను."

"ఎవర్ని?"

"ఫ్రోల్ కొడుకుని."

"ఆ! అతన్ని యెందుకు తీసుకువచ్చేవు?"

ఇద్దరి కళ్ళు కలిసేయి. ఆ చూపులో వొకర్ని వొకరు అర్థం చేసుకున్నారు. యాకోవ్ లూకుచ్ కళ్లు మరల్చుకొని, "అతడు నమ్మతగినవాడేనా?" అని అడిగిన పాలోవిట్స్లీవ్ కి సమాధానంగా తల వూపేడు. వెంటనే పాలోవిట్స్లీవ్, గోడనున్న గొర్రెబొచ్చు జాకట్టు అందుకొని, తలగడాక్రింద, శుభ్రముగా తుడిచి భద్రము చేయబడిన పిస్టలు తీసేడు.

జాకెట్టు బొత్తాలు పెట్టుకుంటూ, పాలోవిట్స్లీవ్, యుద్ధరంగములో మాదిరిగా, తొందరగా, స్పష్టంగా, ఆజ్ఞలు యివ్వడం మొదలెట్టేడు:

"గొడ్డలి తీసుకురా, అడ్డుదోవని నడు; యెంతసేపట్లో వెళ్ళగలం!"

"అట్టేదూరం లేదు, యేడెనిమిది యిళ్ళ అవతల."

"కుటుంబం యేమేనా వుందా?"

"ఒక భార్యమాత్రం వుంది."

"అతని యింటికిమట్టూ యిళ్లు వున్నాయా?"

"ఒక వైపు ఖాళీ స్థలం, రెండవ వైపు తోట."

"సోవియట్ ఆఫీసు యెంతదూరం వుంది?"

"యెక్కడో, దూరంగా వుంది........."

"సరే, నడవండి!"

లూకుచ్ గొడ్డలి తీసుకురావడానికి లోపలికి వెళ్ళేడు. పొలోవిట్సేవ్ యెడమ చేతితో టిమోఫీ జబ్బపట్టుకొని, "నేను యేది చెబితే అది, మీరు మాట్లాడక వెంటనే చేసెయ్యాలి! మనం అక్కడికి వెళ్లిన తరువాత నువ్వు మారు కంఠంతో సోవియట్ ఆఫీసు కాపలావాడననీ, డాక్యుమెంట్లు తీసుకువచ్చేననీ కేకెయ్యి. ఎలాగయినా, అతనే తలుపుతీసి బయటకు వచ్చేటట్లు చెయ్యాలి."

"కామ్రేడ్, మిమ్మల్ని చూడగా.........యేమని పిలవాలో అర్థం అవడంలేదు......... ఈ ఖాప్రోవ్ చాలా బలమైనవాడు. జాగ్రత్తగా వుండకపోతే, యే ఆయుధం లేకుండానే మన ముగ్గుర్నీ కలిపి........." అంటూ వొకదానికొకటి పొందిక లేకుండా చెప్పడం మొదలెట్టేడు.

"ఉస్స్-మాట్లాడకు!" అంటూ పొలోవిట్సేవ్ అతని మాటకి

అడ్డంవచ్చి. లూకిచ్ వైపు చెయ్యిజాపి, "అది నాచేతికిచ్చి దోవ చూపించు." అన్నాడు.

అతడు గొడ్డలి లౌజరుబెల్టులో పెట్టి, కనబడకుండా పైని గొట్టెబొచ్చుజాకెట్టు కప్పేసేడు.

ముగ్గురు నిశ్శబ్దంగా పక్కసందులోంచి బయలుదేరేరు. ఒడ్డు—పొడుగు, మంచి బందోబస్తుగా రాక్షసుడులాగున్న పాలోవిట్స్కీ ముందు 'టిమోఫీ' వూనాపిలా కనిపిస్తున్నాడు.

అతడు పాలోవిట్స్కీ ప్రక్కని నడుస్తూ అతనిముఖంకేసి చూడసాగేడు; కాని ఆచీకట్లో, యేమీ కనిపించిందికాదు.

నెమ్మదిగా ముగ్గురు ఒక దడిలోనుంచి దూరి, బయలులోకి వచ్చేరు.

"ఒకరి అడుగుజాడల్లో వొకరు నడవండి: యెంతవెతికినా వొక్క అడుగుజాడకంటె యెక్కువ కనిపించదు" అని పాలోవిట్స్కీ నెమ్మదిగా ఆజ్ఞాపించేడు.

ఆ తెల్లటి మంచుమీద వొకరి వెనక వొకరు నిశ్శబ్దంగా తోడేళ్ళలా బయలుదేరేరు. ఖాప్రోవ్ యింటి చుట్టూనున్న దడిగుమ్మం దగ్గిరికి వచ్చినతరువాత యూకోవ్ లూకిచ్ వెనక తిరిగి చూసేడు.

పాలోవిట్స్కీ గుమ్మంవైపు చూపిస్తూ నెమ్మదిగా "వెళ్ళి పిలు," అన్నాడు. అతనన్నమాట టిమోఫీకి వినపడకపోయినప్పటికి, అతని హాస్తచాలనని బట్టి గ్రహించి గొళ్ళెం పట్టుకొని

చప్పుడు చేసేడు. తన వెనక తెల్లటి వున్నిటోపీ పెట్టుకొనిన వ్యక్తి గొర్రెచర్మపు కోటు బలవంతంగా లాగి, చింపేసిన ధ్వని వినిపించింది. టిమోఫీ మళ్ళీ రెండవసారి తలుపు చప్పుడు చేసేడు. మనుష్యుల అలుకుడు విని వాకట్లో పడియున్న నాగలి క్రిందనుంచి బయటకు వచ్చిన, గజ్జిపట్టిన చిన్నకుక్క నొకదానిని చూచి, యాకోవ్ లూకిచ్ హడలిపోయేడు. కాని చలిచేత కొంకరించుకొనిపోయి, మొరగడానికికూడా వోపికలేక, తోక ముడుచుకొని, ముడ్డినంచి, నెమ్మదిగా మూలుగుతూ, వసారో మూలకిపోయి పడుకుంది

*   *   *   *   *

ఖాప్రోవ్ యెంత ఆలోచించినా వొక నిర్ణయానికి రాలేకపోయేడు. ఆఖరికి తిరిగితిరిగి యింటికి వచ్చేడు. చల్లగాలిలో తిరిగి రావడంవల్ల మనస్సు కొంచెం కలకతేరింది. భార్య బలవంతంమీద భోజనం దగ్గిర కూర్చుని కొంచెం యెంగిలిపడి లేచేడు:

మేరియా! పుచ్చకాయ వుంటే తినేద్దును, యిప్పుడు."

"వోడ్కా యెక్కువగా తాగడంచేత తలనొప్పిగా వుందా" అంది ఆమె నవ్వుతూ.

"లేదు. అసలు యీవేళ వొక్క-సారికూడా తాగలేదు. వెనక నేను ప్యూనిటివ్ దళంలో పనిచేసేనని, వుదయాన్నే వెళ్లి ప్రభుత్వానికి తెలియచేసేస్తాను. ఎంతకాలం యిలాగ మనస్సులో బాధపడుతూ వుండడం."

"మంచి ఆలోచనే! ఈ వేళ ఉదయాన్నుంచీ యిలా వున్నారేమి? నాకేమీ అర్థం కావడంలేదు మీ వరస."

ఖాస్త్రోవ్ పక్కమీద వొళ్ళువాల్చేడు నిద్రపోవడానికి. నికీటా నవ్వుతూ వచ్చి, అతని రెండు చెంపలమీద చేతులు వేసి, మీదకు వంగి, "నా కోసం చేసుకున్న రొట్టెలున్నాయి. రెండు తినకూడదు? లేకపోతే యేదేనా చేసిపెట్టమంటే చేసిపెడ తాను." అంది.

కాని భార్య యెన్ని చెప్పినా వినకుండా ఆలోచిస్తూ పడుకున్నాడు. "ముందు నా సంగతి చెప్పి తరువాత ఆస్ట్రోవ్ నోవ్ సంగతి కూడా చెప్పేస్తాను. నాతోపాటు వాళ్ళూ అనుభవిస్తారు! కాని నాకు యేమిశిక్ష విధిస్తారు? సాధారణంగా మరణశిక్ష విధించరనుకుంటాను. నాలుగైదు సం॥లు శిక్ష వేస్తే వూరల్ పర్వతాల్లో చెట్లు నరకడమో యేదో పనిచేసి తిరిగి వస్తాను. అంతటితో, స్వేచ్ఛగా, వెనకటి రహస్యం వెల్లడిఅవుతుందేమోననే భయంలేకుండా జీవించవచ్చు. వీళ్ళందరికి వెట్టిచాకిరీ చెయ్యడం తప్పిపోతుంది. ఏమీ దాచకుండా అంతా పూసగుచ్చినట్లు చెప్పేస్తాను. తరవాత వాళ్లే యిష్టంవచ్చినట్లు చేస్తారు. ఈవిషయం జరిగి చాలాకాలం అవడంచేత అట్టే యెక్కువ శిక్ష విధించరనుకుంటాను. ఏమైనాసరే—అంతా చెప్పేస్తాను. స్వయంగా నేను యెవర్నీ చంపలేదు. అంతమట్టుకు నిజం.........సైన్యం వదలి పారిపోయినవాళ్లని, కొంత

మంది బోల్షివికులనిమాత్రం కొరడాలతో బాదేను. అప్పుడు నాకు యీమాత్రం ప్రపంచజ్ఞానం వుంటే ఆపని చెయ్యక పోదును."

క్రమంగా కునుకుపట్టింది. కొద్దిసేపటికే తలుపు చప్పుడుకి మెలకువవచ్చింది. 'ఇంతరాత్రివేళ వచ్చి తలుపు తట్టేవారెవరా?' అని ఆలోచిస్తున్నాడు. ఇంతలో మళ్ళీ తలుపు చప్పుడయింది. కంగారుపడుతూ లేచి, దీపం వెలిగించడానికి అగ్గిపెట్టెకోసం వెతుకుతున్నాడు. అతని భార్యకు మెలకువవచ్చి,

"మళ్ళీ యేదేనా మీటింగువుందా? దీపం వెలిగించకండి. రాత్రీపగలు వొకటే గొడవ విశ్రాంతి లేకుండా......అంత కంతకి యీపిచ్చి మితిమీరిపోతూంది." అంది నెమ్మదిగా.

నికీటా సావిట్లోకి వచ్చేడు.

"ఎవరువారు?" అన్నాడు.

"నేను, నికీటా—సోవియట్ ఆఫీసునుంచి."

ఆమాట వినగానే నికీటా కొంచెం గాభరాపడ్డాడు.

"నేను; 'నికోలా ముకుఝుకోవ్'ని. ప్రెసిడెంటుగారి దగ్గరనుంచి నోటీసు తీసుకువచ్చేను. మిమ్మల్ని వెంటనే సోవియట్ ఆఫీసుకు రమ్మన్నారు."

"ఆకాగితం తలుపు సందులోనుంచి లోపలికి పడెయ్యి."

ఒక్క నిముషంవరకు బయట నిశ్శబ్దంగా వుంది. తెల్ల ఊలు టోపీ క్రిందనుంచి రెండు కళ్ళు మెరుస్తూ తీక్ష్ణంగా చూసేయి.

టిమోఫీకి ఏమిచెప్పడానికి తోచక తొట్రుపడ్డాడు. కొంత సేపటికి, "ఆ కాగితంమీద దస్కతు చెయ్యాలి. తలుపుతియ్యి" అన్నాడు టిమోఫీ.

అతనికి లోపల ఖాప్రోవ్ అడుగుల చప్పుడు వినబడింది. ఘడియతీసిన చప్పుడు కూడ వినిపించింది మరో నిమిషానికి.

ఆ చీకట్లో ఖాప్రోవ్ విగ్రహం గుమ్మంలో కనపడింది. మరుక్షణంలో పాలోవిట్సీవ్ గడపగుమ్మంమీద యెడమ కాలువేసి, వూతంతీసుకొని గొడ్డలి మడమతో ఖాప్రోవ్ నుదురుమీద శక్తికొలది వొక్క దెబ్బ కొట్టేడు.

ఖాప్రోవ్ కిక్కురుమనకుండా క్రింద కూలబడి నెమ్మదిగా వెనక్కి పడిపోయేడు.

"లోపలికొచ్చి, తలుపు మూసెయ్యండి." అన్నాడు పాలోవిట్సీవ్ తొందరగా. గొడ్డలి చేత గాఢంగా పట్టుకొని, సావిడి లోపలి తలుపు తెరిచేడు. మంచం వున్న మూలనుంచి, "నికీటా! కాలికి యేదానా తగిలి పడిందా యేమిటి, అంత చప్పుడయ్యింది? వారెవరు?" అని వొక స్త్రీ ఆతురతగా అడిగింది.

పాలోవిట్సీవ్ గొడ్డలి వదిలేసి, చేతులుజాపి మంచంవైపు పరుగెత్తేడు.

"అమ్మోయ్! యేమర్రోయ్! దొంగలు......రండి!"

చీకటిలో టిమోఫీ కాలికి గుమ్మం తగిలి ముందరికి తూలి పడ్డాడు. లోపల యెవరో మూలుగుతూ పెనుగులాడుతున్న

ధ్వని వినబడింది, అతనికి. పొలోవిట్సేవ్ ఆమెమీదపడి, ఆమె మాట్లాడవానికి వీలులేకుండా తలగడతో గట్టిగా ముఖము మూసేసి, రెండుచేతులు కలిపి, వొక తుండుగుడ్డతో కట్టెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు: అతని మోచేతులు, పడి లేస్తున్న మెత్తటి ఆమె గుండెలమీదనుంచి పక్కలకి జారిపోయేయి. అతనినుంచి విడిపించుకొనడానికి పెనగులాడడంలో, ఆమె వెచ్చటి శరీరము, భయంచేత వేగంగా కొట్టుకుంటూన్న హృదయం, అతను 'ఫీ'లయేడు. అతనికి వుద్రేకం కలిగి క్షణమాత్రం మనస్సు చలించింది. తలగడ క్రిందికి చెయ్యిపోనిచ్చి, బలవంతంగా ఆమె నోరు విడతియ్యడానికి ప్రయత్నించేడు. అతని రాక్షస బలానికు ఆ పెదవులు బద్దలై రక్తము చిమ్మ క్రిమంగా లాంగిపోయి దోవ యిచ్చేసేయి. పొలోవిట్సేవ్ ఆమె జాకెట్టు గుండెలపైకి లాగేసి వుండచేసి నోట్లో అంగుడు వరకు కుక్కేడు. దానితో అంతవరకు వినపడుతున్న ఆమె మూలుగుకూడా అంతరించింది.

అతడు టిమోఫీని ఆమె దగ్గర నిలబెట్టి, తిరిగి సావిట్లోకి వచ్చేడు.

"అగ్గిపుల్ల వెయ్యి" అన్నాడు.

యాకోవ్ లూకిచ్ వొక అగ్గిపుల్ల గీసేడు ఆ వెలుగులో పొలోవిట్సేవ్ ఖాప్రోవ్ మీదకి వంగి చూసేడు. వెల్లకితలా పడివున్నాడు. ముఖం వొకపక్కకి పడిపోయింది. ఇంకా ఊపిరి

పీలుస్తున్నాడు కాని వొకసారి త్వరగాను వొకసారి ఆలస్యంగాను, నిలకడలేకుండా, అసమాన అవకాశాలలో పీలుస్తున్నాడు. ఊపిరి వదలినప్పుడల్లా మీసాలమీదనుంచి కారుతున్న రక్తం అక్కడ మడుగు కట్టినట్లుంది. అగ్గిపుల్ల ఆరిపోయింది. పాలో ఐట్సిన్ ఖాపోర్వ్ కి యెక్కడ దెబ్బతగిలిందోనని తడిమి చూసేడు. కనుబొమలమధ్య యెముక వొకటి విరిగిపోయి జవజవలాడింది. ఆప్రదేశం అంతా పొంగి యెడమ గుడ్డును మూసేసింది.

“నన్ను వెళ్ళిపోనియ్యి......... రక్తం చూస్తే వాంతి వొస్తూంది.” అన్నాడు యాకోవ్ లూకుచ్ నెమ్మదిగా. అతని శరీరం వణుకుతూంది. కాళ్ళలో నిలబడేటందుకుకూడా శక్తి లేకపోయింది. కాని పాలో ఐట్సివ్ అతని మాటలు వినిపించుగో లేదు:

“గొడ్డలి తీసుకురా— మంచం దగ్గిర వుంది. కొంచెం నీళ్ళు కూడా కావాలి.” అన్నాడు.

ముఖంమీద నీళ్ళు చల్లగానే ఖాపోర్వ్ కొంచెం తేరుకున్నాడు. పాలో ఐట్సివ్ మోకాలుతో అతని గుండెలమీద తొక్కిపెట్టి సన్నని కంఠంతో “తెలియచేసేవా? ద్రోహీ! చెప్పు!” అని యాకోవ్ లూకుచ్ వైపు తిరిగి “అగ్గిపుల్ల వెయ్యి!” అన్నాడు.

అగ్గిపుల్ల వెలుతురులో కళ్ళు సగము తెరిచియున్న

ఖాప్రోవ్ ముఖం కనిపించింది. యాకోవ్ చేతులు, వాటితో పాటు వెలుగుతున్న అగ్గిపుల్లాకూడ వొణికేయి. పుల్ల పూర్తిగా కాలిపోయి మంట యాకోవ్ వేళ్లు అందుకుంది; కాని అతనికి బాధ అనిపించలేదు. పాలోవిట్సీవ్ వెనకటి ప్రశ్న రెట్టించి అడిగి సమాధానం రాకపోవడంచేత అతని చేతివేళ్ళు పట్టుకొని వెనక్కి వంగతీసేడు. ఖాప్రోవ్ మూలుగుతూ అతాత్తుగా బోర్లపడి లేవడానికి ప్రయత్నించేడు. పాలోవిట్సీవ్ పళ్ళుకొరుకుతూ మళ్ళీ అతనిని తిరగతియ్యడానికి ప్రయత్నించేడు. కాని ఖాప్రోవ్ అతనికి లొంగక నెమ్మదిగా లేచి, ఎడమచేతితో, దగ్గరనే నిలబడియున్న లూకిచ్ నడుము నున్న పటకా పట్టుకొని, కుడిచెయ్యి పాలోవిట్సీవ్ మెడకి చుట్టేసి పట్టుకున్నాడు. అతడు పీక నొక్కెయ్యకుండా పాలోవిట్సీవ్ తల ముందుకువంచి గడ్డం గుండెలకానించి, "దీపం—దీపం—త్వరగా వెలిగించు." అన్నాడు. ఆ చీకట్లో అతనికి గొడ్డలి చేతికి దొరకలేదు.

టిమోఫీ వంటయింటి గుమ్మంలోనుంచి తొంగిచూస్తూ

ఏయ్, నిన్నే! అలాగ మాట్లాడడు. గొడ్డలివాయతో పక్క యెముకలకింద తగ్గొయ్యి." అని సలహా యిచ్చేడు.

పాలోవిట్సీవ గొడ్డలి చేతికి తీసుకొని, అతికష్టంమీద ఖాప్రోవ్ పట్టు విడిపించుకొని, రెండుదెబ్బలు కొట్టేడు. ఖాప్రోవ్ కిందపడిపోయేడు. పాలోవిట్సీవ పళ్ళు కొరు

కుతూ, వొక కాలితో అతని తల తొక్కిపట్టి, గొడ్డలితో నరికి తలను మొండెంనుంచి వేరుచేసేడు. చిమ్మనగొట్టంలోనుంచి చిమ్మినట్లు రక్తం బయటికి చిమ్మింది. అతడు లూకుచ్‌ని గుమ్మములోనుంచి లోపలికి లాగి వీధితలుపు బిగించి, చిన్న గొంతుకతో, "పిరికిపందలావున్నావే నువ్వు! దాన్ని, లేవకుండా గట్టిగా తల అణచిపట్టుకో; ఖాషొవ్ మన విషయమై ప్రభుత్వానికి తెలియచేసేడో లేదో ఆమె నడిగి తెలుసుకోవాలి. టిమోఫీ! నువ్వు కాళ్ళు పట్టుకో."

బంధింపబడియున్న ఆమెమీద పొలోవిట్స్‌వ్ నిలువునా పడుకున్నాడు. అతని దగ్గరనుంచి చెమట వాసన ముక్కుబద్ద యీలా వేస్తోంది.

"నీ మొగుడు సాయంకాలం యింటికి వచ్చేక, సోవియట్ ఆఫీసుకేనా, యెక్కడికేనా వెళ్లేడా?" అని అడిగేడు.

ఆ మసక చీకట్లో, కళ్ళు నీరుకారుస్తూ, బిత్తరచూపులు చూస్తున్న ఆమె కళ్ళలోకి చూసేడు. చిరాకుతోచి, ఆరు బయట గాలిలోకి వెళ్ళి విశ్రాంతి తీసుకోవాలనిపించింది. ఆమె మాట్లాడకపోవడంచేత, వెంటనే యేదో తేల్చెయ్యాలని, ఆమె చెవుల వెనక గట్టిగా నొక్కేడు. కొంతసేపు పెనగులాడి ఆ బాధ భరించలేక మూర్ఛపోయింది. కొద్దిసేపటికి మెలకువ వచ్చి, వుమ్మితో తడిసి ముద్దయిపోయిన నోటిలోని గుడ్డ నాలికతో బయటికి తోసేసింది. కాని కేకలేసి యేడవకుండా,

వెక్కుతూ నెమ్మదిగా,

“అంతా చెప్పేస్తాను! యేమీ దాచను! నన్నుమాత్రం బాధ పెట్టకండి!” అంది.

పక్కనే నిలబడియున్న యాకోవ్ లూకుచ్‌ని గుర్తుపట్టి, “లూకుచ్! యెందుకు నన్ను బాధపెడతారు! వొదిలెయ్యండి!” అంది భయంతో దీనంగా చూస్తూ.

ఆమె మాట్లాడకుండా పొలోవిట్సేవ్ నోరు మూసేడు. ఎలాగేనా ప్రాణాలు దక్కించుకోవాలనే ఆశతో, రక్తం చిమ్ముతున్న పెదవులతో అతని చెయ్యి ముద్దుపెట్టుకుంది. ప్రాణాలంటే యెంతతీపి! విపరీతంగా భయపడిపోయింది; పాపం!

“ఏం—మాట్లాడవేం? ఎక్కడికేనా వెళ్ళేడా లేదా?”

లేదన్నట్లుగా తలతిప్పింది. యాకోవ్ లూకుచ్ అతని చెయ్యి పట్టుకొని,

“నీ.........మీ...... అలెగ్జాండర్ అనిసిమోవిచ్!” అన్నాడు తడబడుతూ. “దాన్ని వొదిలెయ్యండి! భయపెడదం. ఎన్నడూ చెప్పదు! ఎన్నడూ చెప్పదు.”

పొలోవిట్సేవ్ అతన్ని దూరంగా గెంటేసేడు. ముంజేతితో ముఖం తుడుచుకున్నాడు. “రేపు చెబుతుందా! ఆడది, అందులోనూ కోసకుజాతి, నమ్మడానికి వీలులేదు. నావంటి ఆఫీసరుకి చిన్నతనం............ చావనీ! చూడకుండా కళ్ళు

మూసేస్తాను........ ” అనుకున్నాడు.

ఆమె తొడుగుకొనిన వస్త్రనే లాగి ముఖం కప్పేసేడు. నడి వయస్సులోనుండి అంతవరకు సంతానము లేకపోవడంచేత అందంగా, దృఢంగా వున్న ఆమె అవయవాలు వొక్క నిముషం ఆతనిదృష్టి నాకర్షించేయి. వొక కాలుజాపి పక్కకి వొత్తిగిలింది. ఆ గుడ్డివెలుతురులో పాలోవిట్సేవ్ ఆమె గుండెలు నిగనిగలాడుతూ వుప్పొంగడం, క్రమంగా చిరుచెమటలు పొయ్యడం గుర్తించేడు. "దానిముఖం యెందుకు కప్పేనో అప్పుడే తెలుసుగుంది. చావనీ!" పాలోవిట్సేవ్ గొడ్డలి యెత్తి వొక్కదెబ్బతో కంఠం నరికిపారేసేడు.

యాకోవ్ లూకుచ్ ఆమె శరీరం చాలాసేపు గిలగిలకొట్టుకోడం చూసేడు. ఆమె శరీరాన్నుంచి యేకధారగా ప్రవహిస్తున్న రక్తపువాసన భరించలేకపోయేడు. సావిట్లోకి వచ్చేటప్పటికి వాంతి వచ్చి, పేగులులోపల వున్నదంతా కక్కిపాసేసు.

పాలోవిట్సేవ్ తప్పతాగినట్లు తూలుతూ బయటికి వచ్చేడు.

ఎదట దడిమీద పేరుకొనియున్న మంచుమీద వంగి పీల్చేడు. అక్కడినుంచి వారుముగ్గురు తిన్నగా వీధులోకి వెళ్ళిపోయేరు. టిమోఫీమాత్రం నెమ్మదిగా నడుస్తూ, వారికి వెనకపడి, మలుపుతిరిగి స్కూలు వైపునుంచి వస్తున్న 'ఎకార్డియన్' చప్పుడు విని, ఆ వైపుకి వెళ్ళిపోయేసు. స్కూలుదగ్గిర కొంత మంది పోగయి పాటలు పాడుతూ నాట్యం చేస్తున్నారు.

చుట్టూ గుండ్రముగా నిలబడి వింటున్న పడుచుపిల్లల మధ్య నుంచి తోసుకొని లోపలికి వెళ్ళి, 'ఎకార్డియన్' వాయిస్తున్న వానిని అది ఇమ్మని అడిగేడు.

"టిమోఫీ! వొక్కసారి గిప్సీనాట్యం ఆడు." అని అడిగింది వొకత్తె.

అతను 'ఎకార్డియన్' అందుకుంటూంటే జారి కింద పడిపో యింది. మళ్ళీ తీసుకొనడానికి ప్రయత్నించి మళ్ళీ వదిలేసేడు. అతని వేళ్ళు పట్టుతప్పిపోయేయి. చివరకు ఎల్లాగో 'ఎకార్డి యన్' పట్టుకొని వాయించడానికి ప్రయత్నించేడు కాని, చేతులు స్వాధీనం అవక దానిని తిరిగి యిచ్చేసేడు.

"ఎక్కడో పీకిలదాకా యెక్కించి వస్తున్నాడు." అంది వొకయువతి.

"చూడు! తాగినవాడులా లేడూ!"

"ఆవాలకం చూడు యెలాగవుందో."

వాళ్ళంతా వొక్కొక్కళ్ళే అతని దగ్గరనుంచి తప్పుగు న్నారు. అంతకరకు 'ఎకార్డియన్' వాయించినవాడే, దాని మీదపడ్డ మంచు తుడిచేసి, గిప్సీనాట్యం వాయించడం మొద లెట్టేడు. ఉలియానా అఖవాటినా అనే వొకయువతి నాట్యం చెయ్యడం మొదలెట్టింది. "తెల్లారేవరకూ, యిక్కడే వుంటాను. ఆవొకేతీసినా, నావిషయం యెవరూ ఆలోచించరు." అను కుంటూ బయలుదేరి, తప్పతాగినట్లు నటిస్తూ, బరి అరుగుమీద

కూర్చున్న వొకతె దగ్గరికి తూలుతూ వెళ్ళి, ఆమె కాళ్ళ మీద తలపెట్టి, "తలలో పేలున్నాయి, కుక్కా దూ" అన్నాడు.

యాకోవ్ లూకిచ్ కడుపులోదంతా వెళ్ళిపోయేదాకా కక్కుకొని, యింటికి రాగానే పకగదిలోకి వెళ్ళిపోయి పడుకున్నాడు. అతడు పొలోవిట్సేవ్ శబ్ధంగా చేతులు కడుక్కోవడం, ఆ నీళ్ళు పారపొయ్యడం, గదిలోకి వెళ్ళడం అన్నీ వింటూనే వున్నాడు. ఆగదిలోనుంచి పొలోవిట్సేవ్ బయటికి వచ్చేటప్పటికి అర్ధరాత్రి దాటింది. లూకిచ్ భార్యని లేపి పళ్ళరసం యిమ్మని అడిగేడు

తాగడం పూర్తయింది. (యాకోవ్ లూకిచ్ పడుకొని యిది అంతా చూస్తూనే వున్నాడు.) బాగా ముగ్గిన 'పియర్' పండు వొకటి తీసి పీల్చుకొని తినేసి, తరువాత సిగరెట్టు ముట్టించి, గుండెలమీద వాయించుకుంటూ బయటికి వెళ్లేడు. కొంతసేపటికి గదిలోకి వచ్చి, అప్పటికికూడా, యింకా వేడిగా వున్న 'స్టౌ' మీద కాళ్లు కాచుకున్నాడు. వాతపు నొప్పి చేత, యెంతసేపయినా తనివితీరక, అల్లా కాచుకుంటూవుండడం అతనికి మామూలు. మాతృదేశ రక్షణకోసం, మహో ఘనత వహించిన చక్రవర్తిగారి సేనలోచేరి పనిచేస్తూ 1916వ సం॥ శీతకాలంలో 'బగ్' నదిని దాటుతున్నప్పుడు ఆ చలికి కాళ్లు కొంకరించుకొనిపోయి నప్పటినుంచి ఆ వాతపు నొప్పులు కలిగేయి.

# పదమూడో ప్రకరణము.

## స్టాలిన్ వ్యవసాయక్షేత్రం.

డేవీడోవ్ 'గ్రిమాచీ' వచ్చి వారం రోజులయింది. ఆవారం రోజులలో అనేక విషయ సమస్యలు యెదురొక్కన్నాయి అతన్ని. అతడు ప్రతిరోజు పగలల్లా సోవియట్ ఆఫీసులోనో, 'టిటాక్' యింట్లో పెట్టబడిన సమిష్టివ్యవసాయక్షేత్ర కార్యాలయంలోనో పనిచేసి, బసకి వచ్చినతరువాత కొంతసేపు సిగరెట్టు కాలుస్తూ గదిలో పచారుచేసి, 'ప్రవ్దా'; 'మొలాట్' మొదలైన పత్రికలు చదివి, తిరిగి ఆలోచనా ప్రపంచంలో పడిపోయేవాడు. సమిష్టి వ్యవసాయక్షేత్రాన్ని గురించి, క్రితం రోజు జరిగిన విషయాలని గురించి కలిగే ఆలోచనలకి అంతే వుండేది కాదు. చివరకు విసుగెత్తి, ఆ ఆలోచనలోనుంచి తప్పుకొనడానికి, 'ప్యూటిలోవ్ వర్క్సు' లోని తన షాపుని ఆస్నేహితుల్ని, అక్కడ తనుచేసే పని జ్ఞాపకం చేసుకొనేవాడు. తను యిక్కడికి వచ్చిన యీ కొద్దికాలంలోను అక్కడ అనేక మార్పులు జరిగివుంటాయనీ, తన స్నేహితులంతా తనని, తను యిక్కడికి వచ్చేముందు ఇచ్చిన ఆ వుపన్యాసాలనీకూడా మరిచిపోయి వుంటారనీ మనస్సుకి తట్టినప్పుడు కొద్దిగా విచారం కలి

గింది. అతని ఆలోచనలన్నీ, మళ్ళీ అకాత్తుగా 'గ్రిమాచీలాగ్' మీదికి తిరిగేయి. గ్రిమాచీలాగ్ వచ్చేముందుకూడా అతనికి గ్రామసీమలతోను, అక్కడ వుండే ప్రజలతోను పరిచయం వుండేది; కాని అప్పుడు వర్గ కలహములోని వివిధశక్తులు, వాటి గమనము, పరస్పర సమ్మిళితములైన విషమ ఘట్టములు, స్పష్టంగా అవగతం కాలేదు. ప్రభుత్వము సమిష్టి వ్యవసాయక్షేత్రములో చేరిన వారికందరకు అనేకవిధాల సౌకర్యములు కలిగిస్తున్నప్పటికి, సాధారణ రైతులలో హెచ్చు భాగము, తీవ్రమైన ప్రతికూలత కనపరుస్తూ దానిలో చేరకపోవడానికి కారణం గోచరించింది కాదు. గ్రిమాచీ ప్రజల యొక్క మనోగతాభిప్రాయాలను, ఒకరితో ఒకరికిగల అవినాభావ సంబంధాలను, అర్థంచేసుకోలేకపోయేడు. పూర్వం బోల్షివిక్ సైన్యాలలో పనిచేసిన 'టిటాక్' యిప్పుడు భాగ్యవంతుడై ఆ ప్రభుత్వంమీదే శతృత్వం వహించేడు. వీదకోసక్కు అయిన 'టిమోఫీబోరేవ్' బహిరంగముగా భాగ్యవంతుల పక్షం వహించేడు. తెలివయినవాడు, భాగ్యవంతులలో జమకట్టదగినవాడు అయిన ఆస్ట్రోవ్నోవ్, ధైర్యంతో ముందుకువచ్చి సమిష్టి వ్యవసాయక్షేత్రంలో సభ్యుడుగా చేరుతే-నగుల్నోవ్ అతనిని అనుమానించి బయటికి గెంటెయ్యడానికి చూస్తున్నాడు. డేవిడోవ్ మనోవీధిలో గ్రిమాచీలాగ్ ప్రజలందరు గిర్రున తిరిగిపోయేరు. అతనికి గ్రిమాచీ ప్రజలకి మధ్య



అగోచరమైన వొక తెర అడ్డురావడంచేత, వారిని పూర్తిగా అర్థం చేసుగోలేకుండా వున్నాడు. ఒకదానికొకటి పొందికలేక చిక్కుపడుతున్న గ్రిమాచీ విషయాలన్నీ అర్థం చేసుకోవడానికి తీవ్రప్రయత్నాలు చేస్తూన్నా సాధ్యంకాక అంతకంతకి చిక్కుపడిపోతున్నాయి.

ఇంతలో ఖాపోవ్‌ని అతని భార్యని హత్యచేసి, సత్తా దొరకకుండా పోవడంచూసి, వీటికన్నిటికి మూలకారకులెవరో వుండి వుంటారని వూహించేడు. వాళ్ళశవాలు రెండూ కనుగొనబడిననాటి వుదయం జేవిడోవ్, రజ్మట్నోవ్. నగుల్నోవ్‌లతో చాలసేపు మాట్లాడేడు. కాని వాళ్ళుకూడా యేమీ చెప్పలేకపోయేరు. ఖాపోవ్ ఆ వూళ్ళోని బీద కోసక్కులలో వొకడు. పూర్వం విప్లవ ప్రతికూల సైన్యాలలో పనిచేసేడు. గ్రామంలో యే విషయం వచ్చినా కలుగచేసుకోడు. లాష్టినోవ్‌ని ఆశ్రయించి వెనక తిరుగుతుంటాడు. దొంగతనమే హత్యలకు కారణమై వుంటుందని వూహించేరు; కాని అతని యింట్లో సామానంతా యెల్లా వున్నది అల్లాగే వుండడంచేతను, అసలు హత్యచేసి యెత్తుకుపోదగినంత విలువైన సామాను యేమీ లేకపోవడంచేతను ఆ ఊహ సరియైనదికాదని తోసేసేరు. చివరకు యేవిషయం నిర్ధారణ చెయ్యలేక రజ్మట్నోవ్,

"దీనికంతకి కారణం వొక ఆడది అయివుంటుంది. ఇతను

యెవరి భార్యతోనో పడితే, వాళ్ళు చంపేసివుంటారు."
అన్నాడు.

నగుల్నోవ్ యేమీ మాట్లాడలేదు; అతని మనస్సుకి యేది తట్టినా అది, సబబు, సందర్భంలేకుండా వాగడానికి యిష్టపడడు. కాని డేవిడోవ్, భాగ్యవంతు లెవరికో యీ హత్యతో సంబంధం వుండి వుంటుందనియు, వారినందరిని వెంటనే గ్రామంలోనుంచి బయటికి గెంటెయ్యాలనియు చెప్పగానే నగుల్నోవ్ అతనిని సమర్థించేడు.

"ఖాప్రోవ్‌ని, వాళ్ళే యెవరో చంపేసివుంటారు. దాన్లో యేమీ అనుమానంలేదు. ఆన్రోహులిన్ని అందర్నీ వెంటనే ఉత్తర ధృవ ప్రాంతాలకి ప్రవాసం పంపించెయ్యాలి!" అన్నాడు.

రజ్మటోన్నోవ్ నవ్వి బుజాలు కుదిపేడు.

"వాళ్ళందరిని ప్రవాసం పంపించెయ్యాలి, దాన్లో అనుమానం యేమీలేదు." అన్నాడు రజ్మటోన్నోవ్. "సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేరవద్దని రైతులలో దుష్ప్రచారం చేస్తున్నారు. కాని వాళ్ళే ఖాప్రోవ్‌ని హత్య చేసేరన్నది సబబుగా లేదు. అతడు వాళ్ళతో యెప్పుడూ కలిసిలేడు. లాప్షినోవ్ వెనకమాత్రం తిరుగుతూ అతనికి పనిచేస్తుండేవాడు; కాని కావలసినంత తిండి పారేస్తున్నప్పుడు చెయ్యడంలో ఆశ్చర్యం యేముంది! కడుపు కక్కుర్తి చేత, లాప్షినోవ్ దగ్గరికి వెళ్లేడు

ఊళ్ళో యేంజరిగినా, అది భాగ్యవంతులు చేసివుంటారని వాళ్ల నెత్తినిరుద్దడం భావ్యంకాదు. దీనికంతకీ కారణం ఆడది. తరవాత మీ యిష్టం.”

జిల్లా పట్నంనుంచి, వొక యిన్వెస్టిగేటింగు ఆఫీసరు, వొక డాక్టరు వచ్చేరు. రెండు శవాలనీ పంచాయతీ చేసి ఖాపోర్రివ్ యింటి పక్కవాళ్ళని, లాప్షినోవ్‌ని క్రాసుపరీక్ష చేసేరు. కాని ఆచోకీ యేమీ దొరకలేదు. ఆ మరువాడు ఫిబ్రవరి 4 వ తారీఖున సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుల సాధారణ సమావేశంలో గ్రిమాచీలాగ్ భాగ్యవంతుల నందరిని కుటుంబములతోసహా ఉత్తర కాకేషియా పరగణాలలో యెక్కడా వుండకుండా వెళ్ళగొట్టాలని వొక రిజల్యూషన్ ప్రతిపాదించి యేకగ్రీవంగా ఆమోదించేరు. ఆ సమావేశములోనే పావెల్ లుబిష్కిన్, ఆర్కాడీ, డేవిడోవ్, డెమ్కాఉషాకోవ్, లూకుచ్‌లను సమిష్టి వ్యవసాయక్షేత్ర పాలకవర్గంగా ఎన్నుకున్నారు. నగుల్నోవ్ యెదిరించినప్పటికి, డేవిడోవ్ రజ్మెట్నోవ్‌లు తీవ్రంగా సమర్థించడంచేత యాకోవ్ లూకుచ్ కూడ పరిపాలవర్గంలోకి ఎన్నుకోబడ్డాడు. జిల్లా కమ్యూనిస్టుపార్టీ సిఫారసు చెయ్యడంచేత డేవిడోవ్ అధ్యక్షుడుగా యెన్నుకోబడ్డాడు.

తరువాత సమిష్టి వ్యవసాయక్షేత్రానికి పేరు పెట్టడానికి కొంతసేపు చర్చ జరిగింది. అందరు మాట్లాడిన తరువాత రజ్మెట్నోవ్ లేచేడు మాట్లాడడానికి.

## స్టాలిన్ వ్యవసాయక్షేత్రం.

"'రెడ్ కోసక్కు' అనే పేరు పెట్టడానికి నేను అంగీకరించను. ఇంతవరకు ఆ పేరు పెట్టినది యేదీ అభివృద్ధిలోకి రాలేదు; పైగా దాల్లో జీవంకూడా లేదు. పూర్వం కూలీలు వాళ్ళపిల్లల్ని 'కోసక్కు' అని భయపెడుతుండేవారు. కామ్రేడ్స్, మన సమిష్టి వ్యవసాయక్షేత్రానికి, కామ్రేడ్ స్టాలిన్ పేరు పెట్టవలసినదని వుపపాదిస్తున్నాను. ఆయనని గురించి నేను యెక్కువ చెప్పవలసిన పనిలేదు. మనం యే ఆదర్శంకోసం, భార్యాపిల్లల్ని వదలి, ప్రాణాలనికూడా లక్ష్యపెట్టక రక్తప్రవాహాలలో యీదులాడి పోరాడేమో, ఆ ఆదర్శసిద్ధికోసం, కామ్రేడ్ స్టాలిన్ యెన్ని ఆటంకాలు కలిగినప్పటికి ధైర్యంతో యెదుర్కొని దేశాన్ని ముందుకు నడిపిస్తున్న సంగతి మీరందరు యెరిగినదే."

ఆండ్రీ వుద్రేకంచేత కంపించేడు. కళ్ళు కొంచెం చెమ్మగిల్లేయి. మళ్ళీ కొంచెం తమాయించుకొని మాట్లాడడం మొదలెట్టేడు.

"కామ్రేడ్స్, కామ్రేడ్ యోసఫ్ విస్సారినోవిచ్ స్టాలిన్ చిరకాలము జీవించుగాక! ఆయన గౌరవార్థం మనం అంతా నిలబడి టోస్టులు తియ్యాలని ప్రతిపాదిస్తున్నాను."

సభ్యులంతా లేచి నిలబడ్డారు; బట్టతలలు నిగనిగలాడేయి, జడలుకట్టిన అనేక రంగుల జుట్లు బయలుపడ్డాయి. రజ్మెటోవ్ మళ్ళీ ప్రారంభించేడు.

భీష్ముమన్నారు.

"ఆ పేరు పెట్టడానికి మీరంతా అంగీకరిస్తారని వూహిస్తున్నాను. మేమంతా 'జారిట్సిన్' రక్షిస్తున్నప్పుడు కామ్రేడ్ స్టాలిన్ ఫిరంగి గుళ్లకికూడా వెరవక యుద్ధరంగంలోకి వచ్చి స్వయంగా సైన్యాలని నడపడం నేను ప్రత్యక్షంగా చూసేను. ఆరోజుల్లో ఆయన, వొరొషిలోవ్, రివల్యూషనరీ మిలిటరీ కౌన్సిలు సభ్యులుగా వుండేవారు; కాని యేమీ ఆడంబరం లేకుండా సాధారణ వస్త్రాలే ధరించేవారు. సైన్యాలని పరీక్షించేటప్పుడు, యుద్ధరంగంలోను కూడ, మాకందరికి, పిరికితనం లేకుండా ధైర్యంగా నిలబడడం........."

"రజ్మెట్నోవ్! అవసరంలేని విషయాలు మాట్లాడుతున్నారు మీరు." అని డేవిడోవ్ అతని వుపన్యాసానికి అడ్డు వచ్చేడు.

"అవసరంలేని విషయాలా? సరే, క్షమించండి. కాని మన సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి ఆయన పేరు పెట్టాలని కోరుతున్నాను"

"ఆవిషయం మాకందరికీ తెలుసును. నామటుకు నేను, ఆయనపేరు పెట్టాలనేవాళ్లలో వొకణ్ణి." అన్నాడు డేవిడోవ్. "కాని ఆ పేరు పెట్టినతరువాత మనం ఆ పేరుకి అగౌరవము రాకుండా చూడాలి. ఆ పేరేకనక పెట్టేటట్లయితే యీ జిల్లాలో వుండే మిగిలిన సమిష్టి వ్యవసాయ క్షేత్రాల అన్నిటికంటె అభివృద్ధిలో వుండేటట్లు చెయ్యాలి."

"దానికి మాకందరికీ అంగీకారమే అని" ఘూకర్ లేచేడు.

"అవుననుకోండి." రజ్మట్నోవ్ చిరునవ్వు నవ్వేడు. "కామ్రేడ్సు, సోవియట్ అధ్యక్షుడుగా నేను కామ్రేడ్ స్టాలిన్ పేరుకంటె మంచిది లేదని చెబుతున్నాను. నన్ను అడిగేటట్లు యితే అన్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకీకూడ 'స్టాలిన్' పేరు పెట్టాలని చెబుతాను. మన కమ్యూనిస్టు పార్టీ ఆయనని సమర్థించడమే కాక, అటువంటి మహామహుడు పార్టీలో వున్నందుకు గర్విస్తుందికూడాను. అంతకంటె మంచి పేరు ఎంత వెతికినా దొరకదు. ఉదాహరణకి చెబుతున్నాను, 1919సంలో ట్సునిన్ నదిమీద టొపోల్కా అనే గ్రామం దగ్గరనున్న ఒక వంతెనను మన సైన్యాలు ఆక్రమించడం చూసేను......"

"అదిగో, మళ్ళీ వెనకటి సంగతులన్నీ యెత్తుతూన్నారు" అన్నాడు డేవిడోవ్ విసుగుతో.

"ఆపేస్తానులెండి. ఈ విషయంమీద సమ్మతులు తీసుగుందాం. కాని ఆ వెనకటిరోజులన్నీ తలుచుగున్నప్పుడు హృదయం వుప్పొంగుతుంది. ఎంతసేపూ ఆవిషయాల్ని గురించి మాట్లాడాలని వుంటుంది." అని రజ్మట్నోవ్ నవ్వుతూ కూర్చున్నాడు.

సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి 'స్టాలిన్' పేరు పెట్టడానికి యేకగ్రీవంగా అంగీకరించడంతో సభ ముగిసింది.

* * * * *

డేవిడోవ్ యింకా, నగుల్నోవ్ యింట్లోనే వుంటున్నాడు. రాత్రిలు అతను పడుకొనే బల్లకి, నగుల్నోవ్ దంపతులు పడు

కోనే మంచానికి వొక చిన్న తెరమాత్రం అడ్డంగా వుంది. దాని ముందుగదిలో ఆయింటి యజమాని, పిల్లలులేని వొక విధవ వుంటున్నారు. తనుకూడా, అక్కడేవుండి మకార్‌కి యిబ్బంది కలుగచేస్తున్నానని, దేవిడోవ్ యెరుగును. కాని అంతవరకు పని తొందరలచేత, వేరే వొకయిల్లు తీసుకొనడానికి తీరుబడి లేకపోయింది! నగుల్నోవ్ భార్య లుకెరియా మొదటి నుంచీ దేవిడోవ్‌ని అతిపరిచయంగా చూడ్డం మొదలెట్టింది. కాని అతనికి, లుకెరియా టిమోషీతో తిరుగుతూందని తెలిసి నప్పటినుంచి, ఆమెమీద ద్వేషభావం యేర్పడింది; వారితో వుండడానికికూడా మనస్కరించింది కాదు. దేవిడోవ్ లుకెరియాతో మాట్లాడకపోయినప్పటికి, ఆమె కనబడినప్పుడు మాత్రం తల ఐమూలగా పెట్టి తీవ్రంగా చూస్తుండేవాడు. ఆమె 25 యేళ్లకంటె యెక్కువ వున్నదానిలా కనబడదు. ఆ నల్లటి కళ్లు, తీర్చిదిద్దినట్లున్న కనుబొమలు, గుండ్రని ముఖము, మొత్తం మీద ఆమె అందంగానే వుంటుంది. యెప్పుడూ కలకలలాడుతూ సరదాగా వుంటుంది. చిరునవ్వు తొణుకాడుతుండే ఆ పెదవులలోంచి తెల్లటి ముందరిపళ్ళు కనిపిస్తూనే వుంటాయి. నడకతీరులోకూడా అందంవుంది. వేషభాషల్లో మిగిలిన కోసక్కు స్త్రీలలాగే వున్నా వారికంటె కొంచెం శుభ్రంగాను, పొందికగాను వుంటుంది.

ఒకరోజు వుదయాన్నే దేవిడోవ్‌కి తెరపక్కనే మకార్

వినబడ్డాయి. "నా జాకెట్టు జేబులో యేదో వుంది తీసుకో." అన్నాడు. "సైమియన్ వూరికి వెళుతుంటే యేదో తెచ్చి పెట్టమన్నావుట. నిన్న సాయంకాలం వూరినుంచి తిరిగి వచ్చిన తరువాత నీకు యిమ్మని చెప్పి నా చేతికిచ్చేడు."

"మాకార్! నిజమే!" నిద్రమత్తు బాగా వదలని ఆమె స్వరం సంతోషంచేత వణికింది. ఆమె తొడుగుకొనిన ఆ వస్త్రం తోనే, పక్కమీదనుంచి వురికి గోడని వేళ్ళాడుతున్న బొచ్చు జాకెట్టు అందుకుంది. ఆ జేబులోనుంచి, టేపు చుట్టబెట్టి కట్టి మామూలురకపు మేజోళ్ళు కాక పట్నవాసపు స్త్రీలు ధరించే అందమైన కొత్తరకపు మేజోళ్ళు పైకితీసింది. దేవిడోవ్ కి యెదుటనున్న అద్దంలో ఆమె విగ్రహం స్పష్టంగా కనిపిస్తూంది. లుకిరియా వాటిని పరిశీలనగా చూస్తూ నిలబడింది. ఆమె చెక్కిళ్ళు యెర్రబారడం, కళ్లు సంతోషాన్ని వెలిగక్కుతూండడం, దేవిడోవ్ అద్దంలో చూసేడు. ఆ నల్లటి మేజోడు వొకటి తొడిగి, బిగువుగా, కాలికి సరిపోయివుండడం చూస్తూ సంతోషంతో దేవిడోవ్ వైపు తిరిగింది. బొత్తాలు లేకపోవడంచేత వస్త్రం చెదిరిపోయి, యౌవనాన్ని వెలిగ్రక్కుతూ చలిస్తున్న ఆమె గుండెలు బయలపడ్డాయి. అప్పుడే ఆమె వెనకనున్న దేవిడోవ్‌ను చూసింది. ఎడమ చేతితో వస్త్రం రెండు అంచులు గుండెలమీదికి లాగిపట్టుకొని, నవ్వుతూ అతని కళ్లలోకి చూసింది. "నేను యెంత అందంగా

బిళ్ళుమన్నారు.

వున్నానో చూడు.'' అని ఆకళ్లు ఆహ్వానించేయి.

డేవిడోవ్ సిగ్గుపడి బల్లమీద వెనక్కి పడి తెరచాటుకి మరుగుపడ్డాడు. బల్ల కిరకిరలాడింది. నుదురుమీదికి పడ్డ జుట్టు వేళ్ళతో వెనక్కి దువ్వుతూ, "ఛీ! తనకేసి పరకాయించి చూస్తున్నాననుకుంటుంది. కొంపతీసి,— తనమీద కన్నేసేనను కొంటుందేమో!" అనుకున్నాడు.

"పరాయి పెద్దమనుష్యుల దగ్గిర, వొంటిమీద బట్ట వుందో లేదోకూడా చూసుగోకుండా ఆ నిలబడటం బాగులేదు" మకార్ అసంతృప్తితో సణిగేడు, డేవిడోవ్ దగ్గు విని.

"ఆయనకి కనిపించదు." అని లుకిరియా జవాబు చెప్పింది.

"కనిపిస్తుంది." తెరవెనక డేవిడోవ్ మళ్ళీ దగ్గేడు.

"కనిపించేటట్లయితే, తనివితీరేలా చూసి సంతోషించండి" అని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పి మట్టె సవరించుకుంది. "మకార్! యిప్పుడు కొత్తవాళ్ళు యెవరూలేరు. వొకరోజు రెండురోజులు కాని యెల్లకాలం అంతేనా!" ఆమె నవ్వుతూ వెళ్లి పక్కమీద పడింది.

ఉదయం భోజనం అయి డేవిడోవ్, నగుల్నోవ్‌లు యిద్దరూ బయలుదేరేరు. ఇల్లు దాటగానే డేవిడోవ్ సంభాషణ ప్రారంభించేడు.

"మీ భార్య ప్రవర్తన యేమీ బాగులేదు."

"ఆ విషయంతో మీకు సంబంధంలేదు." నగుల్నోవ్ డేవి

డోవ్ వైపు చూడకుండా మామూలుగానే సమాధానం చెప్పేడు.

"ఆవిషయంతో మీకు సంబంధం వుంది! ఈ వేళేనా బస యింకోచోటికి మార్చేస్తాను. ఆపరివర్తన చూస్తే నాకు కొంచెం చిరాకుగా వుంది. మీవంటివాళ్ళు ఆమెని యిష్టంవచ్చినట్లు తిరగనిచ్చి, నలుగురిలోను చులకన అవడం బాగులేదు. మీ నోటితో మీరు, ఆమె టిమోషీతో తిరుగుతూందని చెప్పేరు."

"అయితే పట్టుకొని చావకొట్టమంటారా?"

"కాదు, సన్మార్గానికి తిప్పడానికి ప్రయత్నించాలి! ఇదిగో! నేను కమ్యూనిస్టుని; మనస్సులో యెంతతోస్తే అంత కుండ బద్దలుకొట్టినట్లు ముఖంమీద అనేస్తాను; అంతేకాని మనస్సులో పెట్టుకొని కుళ్ళేరకం కాదు. నేనేకనక అయినట్టయితే వొళ్ళట్టినన్ని కొట్టి, మళ్ళీ దాని ముఖంకేసికూడా చూడకుండా గెంటేసివుందును. ఆమె ప్రజల యెదుట మిమ్మల్ని చులకనచేసి అపకీర్తి పాలుచేస్తుంటే, మీకు చీమకుట్టినట్లుకూడా లేదు; నోరు మూసుకుని చేతకానివానివలె చూస్తూ వూరుకున్నారు. ప్రతి రోజు రాత్రి అంత పొద్దుపోయేవరకు ఆమె యెక్కడికి వెడుతుంది? మనం మీటింగునుంచి బాగాపొద్దుపోయి వచ్చేటప్పటికికూడా యింటికి రావడంలేదు. ఏమైతే నాకెందుకు; మీ కుటుంబవిషయాలలో యింతటినుంచి నేను కలగచేసుగో తల్చు

గోలేదు.........."

"మీకు పెళ్లి అయిందా?"

"లేదు. పెళ్లిచేసుకొని మీరు అనుభవిస్తున్న యీసౌఖ్యం చూసిన తరువాత, నచ్చేవరకు యెప్పుడూ పెళ్లి చేసుగోకూడ దనిపిస్తూంది!"

"స్త్రీ పురుషుడి స్వంతఆస్తి అన్నట్లు మాట్లాడుతున్నారే.."

"ఓహోహో! పెద్ద అనార్కిస్టులా మాట్లాడుతున్నారే! స్వంతఆస్తి! యిప్పుడుకూడా స్వంతఆస్తి లేకుండా చెయ్యడం యెల్లాగ? వెనకటివలెనే కుటుంబంకూడా వుంది యిప్పుడు, కాదూ? కాని మీరు.........అడ్డమైనవాళ్లు మీ భార్యవెనక చిత్తకార్తె కుక్కల్లా తిరుగుతుంటే........... సహనం అనే పేరుతో అవినీతి వ్యాపింపచేస్తున్నారు. పార్టీసమావేశంలో యీ విషయం తప్పకుండా చర్చకి పెడతాను. రైతులకి మార్గ దర్శులైన మీవంటివారి కార్యాలకి హద్దు యేర్పరచాలి. ఆహా! యెటువంటి ఆదర్శము!"

"అయితే, వెళ్లిపోయి చంపేస్తాను!"

"చాలా గొప్పపనిచేస్తారు."

"అల్లా అయేటట్లయితే వినండి.........యింక ఆవిషయం వొదిలెయ్యండి, ప్రస్తుతం మటుకు." అంటూ మ కార్ నడుస్తూ నడుస్తూ, అకాత్తుగా ఆగిపోయేడు. "నాకు యెలాగతోస్తే అలాచేస్తాను; కాని యిదికాదు సమయం. ఇది యీవేళ,

నిన్నటినుంచి జరుగుతున్నది కాదు; అది నాకు పరిపాటిఅయి పోయింది......... కొద్దికాలం వోపికపట్టండి, తరవాత చూద్దాం. దానిమీద నాకు విపరీతమైన శ్రమ లేకపోతే చాలాకాలంక్రిందటే తగిన కట్టుదిట్టం చేసివుందును. యెక్కడికి వెళుతున్నారు, సోవియటు ఆఫీసుకా?" అని సంభాషణ మార్చేడు.

"కాదు, ఆస్ట్రోవ్ నోవ్ యింటికి వెళుతున్నాను. వాళ్ళ యింటికివెళ్ళి అక్కడ తీరుబడిగా మాట్లాడాలని తోచింది. అతను వ్యవసాయంలో చాలా నేర్పరి. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి మేనేజరుగా యేర్పాటు చెయ్యాలని వుంది నాకు. ఈవిషయంలో మీ ఉద్దేశం యేమిటి? మన సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని అభివృద్ధిలోకి తీసుకురావాలంటే మంచి తెలివి తేటలు, సమర్థత, వున్నవాడిని మేనేజరుగా యేర్పాటు చెయ్యాలి. ఆ లక్షణాలన్నీ ఆస్ట్రోవ్ నోవ్ లో వున్నాయి."

నగుల్నోవ్ కి విపరీతమయిన కోపం కలిగింది.

"మీకు, అండీక్రికి, ఆస్ట్రోవ్ నోవ్ మీద యింతగురి యెందుకు యేర్పడిందో నాకు అర్థం కాకుండావుంది. నేను యెన్నడూకూడ ఆస్ట్రోవ్ నోవ్ ని మేనేజరుగా చెయ్యడానికి అంగీకరించను. అతన్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనుంచి తరిమేస్తాను! రెండు సంవత్సరాలనుంచి అదనపు పన్నుకూడా కడుతున్నాడు, ద్రోహి! వాడి రోజులింకా దగ్గరకి రాలేదు;

బీళ్ళుమన్నారు.

యుద్ధానికి పూర్వంనుంచీకూడ భాగ్యవంతుడుగా వున్నవానిని సమిష్టి వ్యవసాయ క్షేత్రం మేనేజరుగా చేస్తారా?"

"అతడు తెలివైన వ్యవసాయదారుడు. భాగ్యవంతుల తరఫున మాట్లాడుతున్నానని మీ వుద్దేశ్యం?"

"తేనెపట్టు పిండినట్లు యెప్పటికప్పుడు పిండకుండా వున్నట్లయితే యీపాటికి గొప్ప భాగ్యవంతుడయి వుండేవాడు"

ఎంతసేపు మాట్లాడినా సమాధానానికి రాలేక వొకరిమీద వొకరికి అసంతృప్తితో విడిపోయేరు.



## పద్ధానుగో ప్రకరణము.

## మేనేజరు నియామకం.

చలికి నేలఅంతా రాయిలా బిగుసుకుపోయింది. స్టెప్పీలో మంచు సుడులు లేచి, గాలిలో ఆడుతూ కళ్ళకి మిరుమిట్లు గొల్పుతూంది. గాలిచేత మంచు యెగిరిపోయినచోట్ల, భూమి చలికి పెద్దపెద్ద బీటలు తీసిపోయింది. నదిగట్లమీదవున్న 'పాప్లార్' చెట్లు వెండి పూతపూసినట్లు మంచుతో తెల్లగా కనిపిస్తున్నాయి.

రాత్రి తెల్లవార్లూ, పశువులు దొడ్లల్లో తిరుగుతూనేవున్నాయి. తెల్లారేటప్పటికి పశువులకొట్టాలు వొక్క గడ్డిపరక కూడా లేకుండా ఖాళీగా, నాకేసినట్లున్నాయి. చలి యెక్కువగా వుండడంచేత గొర్రెపిల్లలు, మేకపిల్లలు యిళ్ళల్లోనే వుంటున్నాయి. రాత్రి నిద్రపోయేముందు ఆడవాళ్ళు వాటిని చంకని పెట్టుకొని తల్లులదగ్గిరికి తీసుకొనివచ్చి పాలు తాగడం అయినతరవాత మళ్ళీ ఇళ్ళల్లోకి తీసుకుపోతున్నారు. అర్థరాత్రులు, నక్షత్రాలు మినుకుమినుకు మంటున్న ఆ నిర్మలాకాశమూ, నిశ్శబ్దంగా చలనంలేకుండా వున్న ఆ ప్రకృతీ చూస్తే, ప్రపంచం నిర్జీవం అయిపోయిందా అనిపిస్తుంది. వుండి

వుండి స్టెప్పీలో యెక్కడో తోడేలు అరుపుమాత్రం వినిపిస్తూంది.

ఆ నిశీధ నిశ్శబ్దంలో పాలు చేపువచ్చి, ఆడగుఱ్ఱం సకిలిస్తే, ఆధ్వని అనేక మైళ్ళ దూరంవరకు వినిపిస్తూంది.

ఫిబ్రవరి నెల.........

తెల్లవారుఝామున, నిర్మలమైన ఆకాశము, చలిచేత కొంకరించుకొనిపోయిన ప్రకృతికూడ నిద్రపోతున్నాయి.

నిశీధం సూర్యుడు వస్తున్నాడేమో అనే భయంతో వెల వెలపోతూంది.

ఇళ్ళ కిటికీ సందులలోనుంచి అప్పుడే వెలిగించిన నెగడు వెల్తుర్లు అప్పుడే కనిపిస్తున్నాయి.

ఫిబ్రవరి నెల.........

ఇంకా తెల్లారలేదు. యాకోవ్ లూకుచ్ యింట్లోవాళ్ళందర్నీ లేపేడు. ఆడవాళ్ళు స్టౌ వెలిగించేరు. లూకుచ్ కొడుకు సెమియాన్ కత్తులు పదునుపట్టేడు. కెప్టెన్ పోలోవిట్సేవ్ కాళ్ళనున్న వూలు మేజోళ్ళమీద చింకిరిగుడ్డలు బాగా చుట్టిపెట్టి, వాటిపైన ఫెల్టుబూట్లు తొడిగేడు. సెమియాన్, అతడూ కలిసి గొఱ్ఱెలకొట్లోకి వెళ్ళేరు. యాకోవ్ లూకుచ్ కి మొత్తం 17 గొఱ్ఱెలు, 2 మేకలు వున్నాయి. వాటిలో చూడుతోవున్నవేవో, యీనినవేవో సెమియన్ కి బాగా గుర్తే. అతడు ఆ చీకట్లోనే పొట్టేళ్ళు, గొఱ్ఱెలు, మేకలు వేటికి

వాటిని విడతీసి, వొక్కొక్కొటే పట్టుకొని లాక్కొస్తున్నాడు. తెల్లటి టోపీ ముఖంమీదికి లాక్కొని సిద్ధంగానిలబడియున్న పాలోవిట్స్కీ వొక ప్లాట్లేలు కొమ్ములు పట్టుకొని క్రింద పడ తోసేడు. మళ్ళీ పైకి లేవకుండా దానిని కాళ్లతో తొక్కి పెట్టి, మెడలు వెనక్కి వంగతీసి, కత్తితో కంఠంముడి కోసి చంపేసేడు.

యాకోవ్ లూకిచ్ వొక్క వ్యవసాయంలోనే కాక అన్ని విషయాలలోనూ కూడ గట్టివాడే. అతడు తన గొర్రెల మాంసం, బోల్షివిక్ సైనికులుకాని, పారిశ్రామిక కూలీలుకాని తినడానికి యిష్టపడలేదు. వాళ్ళంతా, లూకిచ్ మీద పన్నులు, అదనపు పన్నులు విధించి 10 సం॥లనుంచి అతను భాగ్యవంతుడవకుండా కృంగతీస్తున్న సోవియట్ ప్రభుత్వానికి మూల స్తంభాలు. సోవియట్ ప్రభుత్వము, 'యాకొవ్ లూకిచ్'లు వొకరికొకరు గర్భశత్రువులు. దీపం చూస్తే పిల్లలు దాన్ని అందుకోవడానికి గబగబ పాకినట్లు, యాకోవ్ అతని జీవితంలో వొక్క నిముషంకూడ వృధాచెయ్యక ధనం కూడబెట్ట డానికి పాకులాడేడు. విప్లవంనాటికి అతని ఆశయాలు ఫలోన్ముఖానికి వచ్చేటట్లు కనిపించేయి. అతని కొడుకుని 'నొవొఛెర్కాస్' జంకర్సుస్కూలులో చదివించాలని అనుకొనేవాడు. చిన్న 'ఆయిల్ మిల్' కొనాలనే వుద్దేశ్యముతో క్రమంగా డబ్బు కూడబెట్టడం మొదలెట్టేడు. నలుగురు కూలీలని పెట్టి

వ్యవసాయం విరివిగాసాగించాలని కలలుకంటూ, ముందు తనకు కలుగబోయే వుచ్ఛస్థితిని తలుచుకొని, ఆ సంతోషం పట్టలేక యెగిరి గంతులువేసేవాడు. చిల్లరికొట్టు నొకదానిని పెట్టాలనియు, తరువాత, తరువాత, యేదివాలాతీసిన కోసక్కు-జమీందారు దగ్గరనుంచో చవకగా వొక మిల్లు కొనాలనియు ఉవ్విళ్ళూరుతుండేవాడు. ఊహా ప్రపంచములో యాకోవ్ లూకిచ్, నిరంతరకృషిచేత మొద్దుపారియున్న శరీరము, చవకబారు కోసక్కు-బ్రొజర్లు, బూట్లు తొడుగుకున్న తనని అందమైన నాజూకైన శరీరముమీద సిల్కు-బ్రొజర్లు, ఫెల్టుబూట్లు, తొడుగుకొని, పొట్టమీద బంగారపు గొలుసు వ్రేలాడుతూ, సమస్త సౌఖ్యాలు అనుభవిస్తున్నట్లు చిత్రించుకొనేవాడు అతని కొడుకు సైన్యములో కల్నల్ గా పనిచేస్తూ, చదువుకొనిన పెద్ద కుటుంబములోని యువతిని పెళ్ళిచేసుకొంటాడు. అతనిని తీసుకొనిరావడానికి యాకోవ్ లూకిచ్, సాధారణ బండి కాకుండా, మంచి ఖరీదైన మోటారుకారు తీసుకువెళతాడు........యాకోవ్ లూకిచ్ స్వప్నాలకి అంతే వుండేది కాదు. ఇంతలో విప్లవం వచ్చి, దేశం అల్లకల్లోలం అయిపోయింది. కాని యాకోవ్ లూకిచ్ దానివల్ల నష్టపడలేదు. స్వతహాగా తెలివైనవాడు, జిత్తులమారి అవడంచేత అరాకజం వస్తుందని ముందే గ్రహించి, వెంటనే దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకున్నాడు. అతడు 1914సం॥లో కొన్న ఆవిరి

యంత్రం అమ్మేసి మూడు వందల రూబులుల బంగారము, వొక తోలుసంచీ నిండా వెండి, కుండలో పెట్టి పాతేసేడు. పశువులు, గొర్రెలు, మొదలైన జంతువులన్నిటిని అమ్మేసి, తనకి కావలసినంత భూమిమాత్రం సేద్యంచేసి మిగిలినది బీడుగా వదిలేసేడు. అంతా సిద్ధం చేసుకొని కూర్చున్నాడు. రెల్లు దుబ్బుమీదనుంచి తుపాను వెళ్ళిపోయినట్లు, విప్లవము, అంతర్యుద్ధము కరువులు అతనిమీదనుంచి వెళ్ళిపోయేయి. తుపాను వస్తే మహావృక్షాలు వేళ్లతోకూడా తెగి క్రింద కూలి పోతాయి; కాని రెల్లు నేలమీదికి వంగి తుపాను వెళ్ళిపోగానే పైకి లేస్తుంది. కాని, పాపం— యాకోవ్ లూకిచ్ మళ్ళీ పైకి లేవడానికి వీలులేకపోయింది! అందుచేతనే సోవియట్ ప్రభుత్వం అంటే అతనికి తీరని ద్వేషము. అతని పని విత్తులు తీసిన గిత్తమాదిరి అయిపోయింది. సంపదలు పోగుచేసే అవకాశాలు, వాటితోపాటు, శరీరానికి మైకంకలిగించే ఆసంతోషము కూడా పోయేయి. అందుచేత పొలోవిట్సేవ్, అతనికి భార్యాపుత్రులకంటె కూడ సన్నిహితుడయేడు. వీలైతే పొలోవిట్సేవ్ పక్షాన్ని చేరి, సోవియట్ ప్రభుత్వాన్ని నాశనం చేసి, జీవితాదర్శాన్ని సాధించాలి, లేదా యీ ఆస్తికూడా వదలి మామూలు కూలీలలా జీవించాలి! ఈ రెండు వదలి మూడో మార్గం యేదీ లేదు. లూకిచ్ కి మొదటి మార్గమే మంచిదని తోచింది.

బీళ్ళుదున్నేరు.

అందుచేతనే, యాకోవ్ లూకుచ్ 'స్టాలిన్' సమిష్టి వ్యవసాయ క్షేత్రపు మేనేజిమెంటు కమిటీలో సభ్యుడై యుండియు 14 గొఱ్ఱెలని చంపేస్తున్నాడు. "ఆ కుక్క పాలోవిట్సేవ్ కాళ్ళదగ్గిర రక్తం యెలా కతుకుతూందో! నా గొఱ్ఱెలని అన్నిటిని చంపి యీ కుక్కకేనా పారేస్తానుకాని, వొక్క గొఱ్ఱెనికూడా సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి యిచ్చి; పెరిగి పిల్లల్ని పెట్టనిచ్చి, సోవియట్ ప్రభుత్వానికి వుపయోగపడడానికిమాత్రం వొప్పుగోను." అనుకున్నాడు లూకుచ్. పాలోవిట్సేవ్ చెప్పిన ఆలోచనకూడా చాలాబాగుంది. "నువ్వు నీ పశువుల్ని అన్నింటిని చంపేసెయ్యి. బోల్షివిక్ లకి యేమీ అంకనియ్యకూడదు. పశువులన్నీ సంరక్షణలేక చావనీ; అధికారం మన చేతిలోకి వచ్చినతరవాత కావలసినన్ని సంపాదించుకోవచ్చు! అమెరికా, స్వీడను దేశాలనుంచి మేలుజాతి పశువుల్ని పంపిస్తారు. కనబడినవన్నీ నాశనంచేసి, తిరుగుబాట్లు చేసి, కమ్యూనిస్టులకి వూపిరి ఆడకుండా చెయ్యాలి! యాకోవ్ లూకుచ్! చింతపిక్కలాంటి నీ గుఱ్ఱం పోతుందని విచారించకు. గుఱ్ఱాల నన్నిటిని సమాజపరం చెయ్యడంకూడా వొకందుకు మంచిదే! దానివల్ల ముందుముందు మనకి సులువు, లాభము కూడ వుంది. మనం తిరుగుబాటు చేసి వొకగ్రామాన్ని స్వాధీనం చేసుగున్నప్పుడు యింటింటికి తిరిగి గుఱ్ఱాల్ని వెతకనక్కరలేకుండా, తిన్నగా సమిష్టి వ్యవసాయక్షేత్రపు తవేలాలలోకి

వెళ్ళి గుఱ్ఱాలన్నిటిని బయటికి తీసుకువచ్చి యెక్కి వెళ్ళి పోవడానికి వీలుగావుంటుంది." ఓహో! యెంతటి ఆలోచన! ఇంతటి దూరాలోచనతో సలహా యిచ్చేవాడు లూకుచ్‌కి అయాచితంగా దొరికేడు.

పాలోవిట్సేవ్, సైమియన్ గొఱ్ఱెల్ని చంపి తోళ్ళు వొలుస్తూంటే లూకుచ్ పక్కని నిలబడి చూస్తున్నాడు. లాంతరు వెలుతుర్ని తెల్లటి గొఱ్ఱెచర్మం నిగనిగలాడుతూంది. వాళ్ళిద్దరూ కలిసి తోళ్ళు సునాయాసంగా వొలిచేస్తున్నారు. తల క్రిందికి వేళ్ళాడుతూ, చర్మం పొట్టవరకు తిరగతీసి లాగేసియున్న మొండెం వైపు, పక్కనే క్రిందపడి దొర్లుతూన్న తల వైపు, చూసేటప్పటికి యాకోవ్ లూకుచ్ కాళ్ళు తడబడ్డాయి. అకాత్తుగా ఖాపోవ్ భార్య భయంతో వణుకుతూ నెమ్మదిగా "లూకుచ్! యెందుకు నన్ను యిలాగ బాధపెడతారు? వదిలెయ్యండి." అనడం జ్ఞాపకంవచ్చింది; తోలు లాగేసినచోట నీలిగాను, యెర్రగాను కనిపిస్తున్న మాంసంముద్దలు, పైకి వుబికియున్న కండరాలతోను, భయంకరముగావున్న గొఱ్ఱె మొండెము వైపు అయిష్టంతో చూసేడు. ఆ రక్తపు వాసనకి మళ్ళీ వెనక వచ్చినట్లే వాంతి రాబోయింది.

"చూస్తే కళ్ళు తిరిగిపోతున్నాయి......వాసనకి పేగులు కడుపులోనుంచీ......" అని నసుగుతూ బయటికి వెళ్ళి పోయేడు.

“ఇక్కడ నిలబడి యిదంతా చూడమని యెవరేనా బతిమాలేరా నిన్ను! మే మిద్దరం చెయ్యగలం యీ పని!” పోలోవిట్సేవ్ నవ్వి, ఆ రక్తపు చేతులతోనే సిగరెట్టు తీసి వెలిగించేడు.

ఉదయం భోజనాల వేళకి, అతి కష్టంమీద, ఆపని పూర్తి అయింది. ఒలిచిన తోళ్ళన్నీ, చాటుగా గదిలో ఆరబెట్టేరు. ఆడవాళ్ళిద్దరు, బలిసిన గొర్రెమాంసం కూర తయారుచేసేరు వుదయం భోజనానికి. పోలోవిట్సేవ్ గదిలోకి వెళ్ళి లోపల తాళం వేసేసుకున్నాడు. కేబేజి పులుసు, గొర్రెమాంసం కూర తీసుకువెళ్లి అతని గదిలో పెట్టేరు. అతను భోజనం అయిన తరవాత లూకిచ్ కోడలు ప్లేట్లు తీసి గది బాగుచేసి బయటికి వచ్చింది. ఇంతలో బయట తలుపు తీసిన చప్పుడు వినబడింది!

“నాన్నా! డేవిడోవ్ వస్తున్నాడు!” అని సైమియన్ పరుగెత్తి వచ్చి తండ్రితో చెప్పేడు. యాకోవ్ లూకిచ్ నిర్ఘాంత పోయేడు, కత్తివేటు వేసిన ముఖంలో రక్తపుచుక్క లేదు. డేవిడోవ్ పంచవార నిలబడి బూట్లమీది మంచు తుడుచుకుంటున్నాడు. నిలబడి దగ్గి, పెద్దపెద్ద అంగలు వేస్తూ వచ్చేడు.

“నాపని అయిపోయింది!” అనుకున్నాడు యాకోవ్ లూకిచ్.

“పిశాచంముండాకొడుకు యెలా నవ్వుతున్నాడో! ప్రపంచం అంతా తనదే అయినట్లు! స్వంత యింట్లో మసలుతున్నట్లు. ఏమీ సందేహంలేదు, యీవాళతో నాపని ఆఖరు! నికీటా ఖాప్రోవ్‌ని హత్య చేసినందుకు నన్ను అరెస్టుచెయ్యడానికి

వస్తున్నాడనుకుంటూ. అచోకీ తీసేడు; దొంగలంజకొడుకు!"

తలుపు తట్టిన చప్పుడు, ఆ వెంటనే వొక కంఠస్వరం వినబడ్డాయి:

"లోపలికి రావచ్చా?"

"రండి!" అని యాకోవ్ లూకుచ్ అనబోయేడు కాని నోట మాట రాలేదు.

డేవిడోవ్ వొక్క నిముషం ఆగి తలుపు తెరిచేడు. లూకుచ్ బల్లమీదినుంచి లేవలేకు— లేచి నిలబడడానికి కాళ్లు స్వాధీనం తప్పేయి. వణుకుతూన్న కాళ్లబూట్లు మడమలు నేలకి తగిలి చప్పుడవకుండా కాళ్లు పైకి యెత్తనలసివచ్చింది.

"కామ్రేడ్! క్షేమమా."

"కామ్రేడ్, తమరు క్షేమమా" లూకుచ్ అతని భార్యకూడ వొక్కసారిగా అన్నారు.

"మంచు విపరీతంగా కురుస్తూంది........."

"అవును బాగా కురుస్తూంది."

"ఈ మంచువల్ల దేనికీ నష్టం లేదనుకుంటాను, నష్టం వుండదంటారా?" అంటూ డేవిడోవ్ జేబులో చెయ్యిపెట్టి వొక జేబురుమాలు పైకితీసేడు. ఉతికి యెంత కాలం అయిందో కాని, మాసిపోయి నల్లగా తోలులా వుంది. అది గుప్పెట్లో వుండ చేసి దాల్లో చీదేడు.

"కామ్రేడ్! లోపలికి రండి." యాకోవ్ లూకుచ్ ఆహ్వా

నించేడు.

"ఇలాగ వున్నాడెందుచేత చెప్మా!" ఆస్ట్రోవ్నోవ్ వాలకం అతని వొణుకుచూసి డేవిడోవ్ ఆశ్చర్యపోయేడు.

"రైచేలకి నష్టం వుంటుందంటారా?" అని డేవిడోవ్ అడిగేడు.

"వాటికేమీ నష్టం వుండకూడదు......... మంచుబాగా కప్పేసింది. గాలిదెబ్బకి మంచు యెగిరిపోయిన చోట మాత్రం కొంచెం జబ్బు యిస్తుం........"

"నెమ్మదిగా యీమాటా, ఆమాటా మాట్లాడి, అకా త్తుగా 'ఖాపోవ్ని ఖూనీ చేసినందుకు నిన్ను అరెస్టు చేస్తాను.' అంటాడేమో! బహుశా పోలోవ్ట్సేవ్ యిక్కడ వున్నట్లు తెలిసిందేమో. సోదా జరుగుతుంది!" అనుకున్నాడు: యాకోవ్ లూకిచ్ భయం వదలి ముఖం కొంచెం తెరిపిని పడింది. నుదుటిమీద చెమటపోసి దట్టంగా పెరిగిన గడ్డం లోకి జారుతూంది.

"అంతా కలిసి కొంచెం పలహారం తీసుకుందాం. రండి, ఆ పైగదిలో కూర్చుందురుగాని."

"యాకోవ్ లూకిచ్! మీతో మాట్లాడడానికి వచ్చేను. మొన్న మీటింగులో సమిష్టి వ్యవసాయక్షేత్రంమీద మీరు చెప్పిన వుపన్యాసం చాలాబాగుంది. కాని వొక్క 'లేబర్ ఆర్గనైజేషన్' విషయంలోమాత్రం మీరు కొంచెము పొర

పాటుపడ్డారు. మిమ్మల్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి మేనేజరుగా యేర్పాటుచెయ్యాలని అనుకుంటున్నాం. వ్యవసాయంలో మీకు చాలా నైపుణ్యము, అనుభవమూ వుందని విన్నాను."

"ఇల్లా నిలబడ్డారేమిటి! లోపలికి రండి. 'గషా! 'టీ, సిద్ధంచెయ్యి. 'కేబేజీసూప్' మీకు యిష్టమేనా? లేకపోతే పుచ్చకాయలు వున్నాయి. మీ యిష్టం? రండి, మీకు తోచి వచ్చేరుకాని, మీయెత్తు బంగారమిస్తేమాత్రం వస్తారా. ప్రజల్ని దరిద్రంలోనుంచి లేవనెత్తడానికి వచ్చిన మహాపురుషులు..." యాకోవ్ సంతోషంతో వుక్కిరిబిక్కిరి అయిపోయేడు. నెత్తి మీదనుంచి పెద్ద బరువేదో దింపేసినట్లు అనిపించింది. "నేను శాస్త్రీయ పద్ధతులమీద వ్యవసాయం చేయడం, నిజమే. వ్యవసాయంలో, వాళ్ళ తండ్రి, తాతల పద్ధతినే అనుసరించే యీ కోసక్కులందరికీ, నూతన మార్గాలు నేర్పాలి. వాళ్లు ఎలాగ దున్నుతారో చూడండి! నేలపైన గోకి వెళ్లలు తిరగతీస్తారు! వ్యవసాయశాఖవారు నాకొక 'సర్టిఫికేటు' యిచ్చేరు. సైమియన్! అద్దం కట్టించిన ఆ 'సర్టిఫికేటు' తీసుకురా. పోనీ, అవసరంలేదులే, మేమే వెడతాం, అక్కడికి."

'సైమియన్‌కి' సైగచేసి యాకోవ్ లూకిచ్ డేవిడోవ్‌తో కలిసి మిద్దెగదిలోకి వెళ్ళేడు. తండ్రి వుద్దేశము గ్రహించి సైమియన్, పొలోవిట్సేవ్ వున్న గదికి తాళం వెయ్యడానికి

వసారాలోకి వెళ్ళేడు. గదిలోకి తొంగిచూసి లోపల యెవరూ లేకపోవడానికి ఆశ్చర్యపోయేడు. అక్కడినుంచి సావిడిలోకి వెళ్ళేడు. పాలోవిట్సీవ్ కాలిబూట్లు లేకుండా వొక్క వూలు మేజోళ్ళుమాత్రం తొడుగుకొని, మిద్దెగదిలోకి వెళ్ళే గుమ్మంలో నిలబడి తలుపు సందులోనుంచి తొంగిచూస్తున్నాడు. అతడు సైమియన్‌ని చూడగానే వెళ్ళిపొమ్మని సౌంజ్ఞ చేసి, తలుపు సందుదగ్గిర చెవిపెట్టి వింటున్నాడు. “గుండెలు తీసిన బంటు.” అనుకుంటూ సావిడి వదలి వెళ్ళిపోయేడు సైమియన్.

ఆ హాలు శీతకాలంలో వుపయోగించరు. ఒకమూలగంజాయి విత్తులు రాశిపోసి వున్నాయి. గుమ్మం దగ్గిర ఆపిలుపళ్ళు నిలవ చేయబడ్డ పీపా పడివుంది. పాలోవిట్సీవ్ ఆ పీపా వంచమీద కూర్చున్నాడు. అక్కడ కూర్చుంటే దేవిడోవ్, యాకోవ్ లూకిచ్‌ల సంభాషణ బాగా వినిపిస్తుంది. చలిచేత పాలోవిట్సీవ్ కాళ్లు కొంకర్లుపోతున్నాయి. కదలకుండా కూర్చుని, తలుపు అవతల వుండి మాట్లాడుతున్న దేవిడోవ్ మాటలు శ్రద్ధగా వింటున్నాడు. “అస్తమానూ, వెధవ మీటింగుల గొడవే! వీలుంటేనా.........ఈ తక్షణం.........” పాలోవిట్సీవ్ పళ్ళుకొరుకుతూ, గుప్పెళ్ళు బిగించి గుండెలకి అదుముకున్నాడు.

తలుపు అవతలనుంచి యీ మాటలు వినిపిస్తున్నాయి:

"కామ్రేడ్! అసలు కిటుకు అది. పూర్వంలాగే వ్యవసాయం చేస్తే లాభంలేదు. పంటలు యెలాగ పండుతున్నాయో చూసేరా! ఎకరం పుట్లు పండుతే గొప్ప! ఒక్కొక్కప్పుడు పండిన పంట పెట్టుబడికే సరిపోవడంలేదు. మా చేలు చూడండి! మనిషి అడ్డపడితే కదలడానికికూడా వీలుండదు. చేలో నిలబడి చెయ్యి యెత్తుతే వెన్నులు అందకుండా యెదిగిన సంవత్సరాలుకూడా యెరుగుదుము నేను. కురిసిన మంచు అంతా ఎక్కడికీ పోకుండా చేలల్లో నిలకట్టడమే కారణం. అంతకంటె మరేమీలేదు. 'సన్ ఫ్లోర్' మొక్కలు చలిమంట కాగడానికి వుపయోగిస్తాయని వీళ్ళల్లోకి కోసేస్తే యెలాగ! వేసవిలో పిడకలు చేసి జాగ్రత్తపెట్టుకునే శ్రద్ధ వొక్కడికీ కూడా లేదు! సోమరితనం బలిసిపోయింది. 'సన్ ఫ్లోర్' పంటమాత్రం కోసుకుని మొక్కల్ని అట్టేపెట్టేస్తే కురిసిన మంచు అంతా యెక్కడికి పోకుండా వాటిని అంటిపెట్టుకొని వుంటుందని, గాలి మంచుని యెగరగొట్టకుండా అడ్డుగాకూడా వుంటుందనికూడా వీళ్లకి తెలియదు. అటువంటి భూమి వేసవికాలం దున్ని విత్తులు చల్లుతే, యెంత పంట పండమంటే అంతపంటా పండుతుంది. మంచు నిలగట్టకపోతే అదంతా వృధాగాపోయి, నేలకి సత్తువ వుండదు; మనకి పంటవుండదు"

"అవును. మీరన్నమాట నిజమే."

"మన సోవియట్ ప్రభుత్వం నాకు పూరికే యివ్వలేదు,

సర్టిఫికేటు. గొప్ప చెప్పకోడం కాదుకాని—వ్యవసాయంలో వారు వున్న అనుభవం యీ చుట్టుపక్కల యెవ్వరికీ లేదు. గవర్నమెంటు వ్యవసాయ నిపుణులు చెప్పేవాటిలో కూడ అక్కడక్కడ కొద్ది లోపా లున్నప్పటికి, నేర్చుకోవలసినది చాలా వుంది. నేను వ్యవసాయ విషయాల్ని గురించి వ్రాసే పత్రిక వొకటి తెప్పిస్తున్నాను. అందులో వొకడు, చేలనిండా మంచు లేకపోయినట్లయితే నేల బీటలు తీసి మొక్కల వేళ్లన్నీ తెగిపోయి చచ్చిపోతాయని వ్రాసేడు."

"ఆ! అలాగా. ఈ సంగతి నేను యెప్పుడూ వినలేదు."

"అది అక్షరాలా నిజం. పరీక్షచేసి చూసేను కూడాను. కొన్ని మొక్కలు తవ్వి చూస్తే, వాటి పిల్లవేళ్ళన్నీ తెగిపోయి వున్నాయి. ఆహారం తీసుకొనే వేళ్లే లేకపోతే మొక్క చావక యేం చేస్తుంది? రక్తనాళాలు కోసేస్తే మనిషి చావడూ? అలాగే మొక్కలు కూడాను."

"నిజమే. యాకోవ్ లూకిచ్, మీరు చెప్పేవాటిలో వొక్కటికూడ అసత్యంలేదు. చేలలో మంచు నిలకట్టాలి. వ్యవసాయ సంబంధమైన పత్రికలేవో తెప్పిస్తున్నానన్నారు, అవి వొక్కసారి యియ్యండి; చదివి మళ్ళీ యిచ్చేస్తాను. ఇప్పుడు మీదగ్గిర వున్నాయా!"

"అవి, నీకు ఆట్టే వుపయోగించవు." అనుకున్నాడు. పొలోవిట్సేవ్. "వాటిని చదవడానికి నీకు వీలుండదు. నీరోజులు

దగ్గరపడ్డాయి." అతను తనలో తనే నవ్వుకున్నాడు.

"శీతకాలం గోళ్ళలో మంచు నిలకట్టడం యెల్లాగ?" లూకిచ్ మళ్ళీ మొదలెట్టేడు. "దానినికూడా ఆలోచించేను. 'బ్రిష్‌వుడ్డు' తో దడి కట్టడంకంటె సులువైన పద్ధతి యేదీ కనిపించలేదు."

"సరేలెండి. దూడలపాకలు వెచ్చగా వుండడానికి యేం చెయ్యాలంటారు? చవకలో తేలిపోవాలి; తెలిసిందా?"

"దానికి పెద్ద ఆలోచన యేముంది! చుట్టూ దడికట్టి మట్టి పూరత పూరాయించడం. లేకపోయినట్లయితే రెండు వరసలని దడులుకట్టి ఆ ఖాళీలో యెండిన పేడ వేసెయ్యడం."

కాళ్ళు నొప్పిపట్టడంచేత, వులుసుగా కూర్చోడానికి పాలోవిట్స్ కొంచెం కదిలేడు. అడుగున పీపా దొర్లిపోవడం చేత గభాలున కిందపడిపోయేడు.

"ఏదో పడినట్లు చప్పుడయింది, యేమిటది?" అన్నాడు డేవిడోవ్.

"పిల్లి యేదో కింద పడతోసివుంటుంది. శీతకాలంలో ఆ సావిడి వుపయోగించం. ఆ సావిట్లో గంజాయి విత్తులున్నాయి చూద్దురుగాని రండి."

పాలోవిట్స్ గభాలున లేచి, తనగదిలోకి వున్న ద్వారం తెరిచి, లోపలికి వెళ్లి తలుపు వేసుకున్నాడు. తలుపు గ్రంధులన్నిటిలోను నూనె వెయ్యడంచేత యేమీ చప్పుడవలేదు.

బీర్పుదున్నేరు.

డేవిడోవ్, ఆస్ట్రోవ్నోవ్ బాగా వుపయోగిస్తాడని సంతోషిస్తూ, పేపర్లకట్ట వొకటి చంకని పెట్టి, యింట్లోనుంచి బయటికి వచ్చేడు. "ఇల్లాంటివాడు చేతిలోవుంటే, గ్రామం గ్రామం అంతా సంవత్సరంలో మార్చెయ్యవచ్చు. కష్టపడి పని చేస్తాడు, తెలివితేటలున్నాయి, పైగా చదువుకున్నవాడు. మేనేజరు పదవికి తగినవాడు! మకార్ ఇతనిని అనుమానించ డానికి కారణం తెలియకుండా వుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి వుపయోగిస్తాడు. సందేహంలేదు." అనుకుంటూ డేవిడోవ్ సోవియట్ ఆఫీసుకి వెళ్ళిపోయేడు.



## పదిహేనో ప్రకరణము.

## జంతు వధ.

యాకోవ్ లూకుచ్ ప్రోత్సాహంచేత, గ్రిమాచీలాగ్ లో ప్రతివాళ్లు, రాత్రులందు రహస్యముగా పశువులు, గొర్రెలు, పందులు, కోళ్లు, మొదలైనవాటి నన్నిటిని చంపడం ప్రారంభించేరు. చీకటిపడ్డది మొదలు, తెల్లారేవరకు రాత్రి అంతా యేదో వొకదాని అరుపు వినిపిస్తూనే వుంది. వీరు, వారు అని భేదం లేకుండా, సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరినవాళ్లు, చేరనివాళ్లు కూడ చంపుతూనే వున్నారు. గొర్రెలు. పందులు మొదలైనవాటినే కాక పాడి పశువుల్ని, యెద్లని కూడ చంపేస్తున్నారు. రెండురోజులలో గ్రిమాచీలాగ్ లోని సగం పశువులు నశించేయి. పేగులు. యెముకలు నోట కరచుకొని పోతున్న కుక్కలే యెక్కడ చూసినా. 18 నెలలనుంచి కోఆపరేటివ్ స్టోర్సులో పడియున్న 200 పూడుల వుప్పు యీరెండు రోజులలోను ఖర్చయిపోయింది. "మనది కావు, చంపెయ్యండి", "చంపక అట్టేపెడితే, మాంసపు పన్ను పేరు చెప్పి యెల్లాగా తీసుకుపోతారు వీటి నన్నిటిని.", "సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరిన తరవాత మాసం దొరకదు. కడుపు

నిండా తినండి." అనుకొనేవాళ్లే యెవర్ని చూసినా. చిన్న పిల్లలు మొదలు ముసలివాళ్లవరకు ప్రతివాళ్లు పొట్టలు విచ్చేలా తిన్నారు మాసం. పండుగులలోను చచ్చిపోయినవాళ్ళ ఆత్మ శాంతి రోజులలోను తిన్నట్లు తెగతిని కడుపునొప్పిచేత బాధ పడ్డారు.

ఘూకర్ తన ఆవుదూడని మొదటి రోజు రాత్రే చంపేసేడు. దూలానికి వేళ్ళాడతీస్తే, చర్మం సులువుగా తీసెయ్యవచ్చునని, భార్య, అతడు కలసి ఆ శవానికి తాడుపోసి వేళ్లాడతియ్యడానికి ప్రయత్నించేరు. బాగా బలిసిన ఆ దూడని యెత్తడంలో ఘూకర్ భార్య నడుము బెణకడంచేత వారం రోజుల వరకు 'మమిఛికా' చేత నడ్డి తోమించుకోనవలసి వచ్చింది. భార్య నడ్డి బెణకడంచేత ఆ మరునాడు ఘూకరే వంట వండవలసివచ్చింది. ఆశచేత ఆ మాసం తెగతిన్నాడు. దానితో, అజీర్ణంచేసి కడుపు వుబ్బి, బాధపడుతూ, 24 గంటలు దొడ్లో 'సన్ ఫ్లోర్' మొక్కలలోనే కూర్చుని వుండేవాడు: అతని యింటి పక్కనుంచి వెళ్ళేవాళ్లు యెప్పుడు చూసినా, 'ఘూకర్' టోపీ ఆ 'సన్ ఫ్లోర్' మొక్కలలో కదలిక లేకుండా అల్లా, కనిపిస్తూనే వుండేది. ఉండి ఉండి 'ఘూకర్' అకాత్తుగా లేచి, బాధతో మూలుగుతూ, వీధివైపేనా చూడకుండా యింట్లోకి వెళుతూండేవాడు. కాళ్ళు యీడ్చుగుంటూ నెమ్మదిగా గుమ్మంవరకు వెళ్ళి, అక్కడ యేదో జ్ఞప్తికివచ్చినట్లు, ఊతా

త్తుగా వెనక తిరిగి మళ్ళీ 'సన్ ఫ్లోర్' మొక్కలలోకి వచ్చి కూర్చునేవాడు.

పశ్రిజలంతా పశువుల్ని చంపేస్తున్న సంగతి రజ్మటోన్నోవ్ కి రెండవరోజు సాయంత్రం తెలిసింది. వెంటనే అతడు డేవిడోవ్ బసకి పరుగెత్తేడు.

"సావకాశంగా కూర్చున్నారా?" అని అడిగేడు.

"చదువుకుంటున్నాను." చేతిలోనున్న చిన్న పచ్చ అట్ట పుస్తకం పేజీ తిరగేస్తూ, డేవిడోవ్ చిరునవ్వు నవ్వేడు. "ఈ పుస్తకం చదువుతూ కూర్చుంటే, యింక తిండికూడా అక్కర్లేదు." అతడు తోస్సి కనిపించీలా నోరు తెరిచి పకపకానవ్వేడు.

"నవలలు చదువుతున్నారా! అవతల గ్రామం, అంతా..."

"నవలా యిది? మతిలేదా యేమిటి!" డేవిడోవ్ విరగబడి నవ్వుతూ, రజ్మటోన్నోవ్ ని, తనకి యెదురుగా బల్లమీద కూర్చో పెట్టి ఆ పుస్తకం అతని చేతికి యిచ్చేడు. "ఇది 'రాస్టోవ్' పార్టీకమిటీ సభ్యులకి 'ఆండ్రీవ్' యిచ్చిన రిపోర్టు. వెధవ నవలలు దీని ముందు యెందుకు పనికివస్తాయి! నిజం! ఏమీతోచక పుస్తకం చదవడం మొదలెట్టేను; అంతే; ఆ ధోరణిలో ఆకలి కూడా మరిచిపోయేను. చాలా చలిగా వుందే!" అతడు లేచి, జేబుల్లో చేతులు పెట్టి, వంట యింట్లోకి వెళ్ళేడు.

"నేను చెప్పేది వింటారా, వినరా?" రజ్మటోన్నోవ్ కోపంతో గట్టిగా అడిగేడు.

"ఆ-యిదిగో వస్తున్నా! ఒక్క నిముషం."

వంటయింట్లోనుంచి 'కేబేజిసూప్' మూకుడు చేత పట్టు కొనివచ్చి కూర్చున్నాడు. రజ్మటోవ్ కేసి చూస్తూ పెద్ద రొట్టెముక్క నోటితో కొరికి నవలడం ప్రారంభించేడు. మూకుడులోనున్న 'కేబేజిసూప్'లో పచ్చగా తేలుతూన్న గొర్రె మాంసపు కొవ్వు, యెర్రగానున్న మాంసపు ముక్కలు కనిపిస్తున్నాయి.

"'సూప్'లో మాంసం వేసేరాయేమిటి?" అండ్రీ మూకుడు కేసి చూపిస్తూ అడిగేడు.

ఉక్కిరిబిక్కిరి అయేటట్లు నోటినిండా రొట్టె వుండడం చేత, మాట్లాడడానికి వీలులేక బుర్ర వూపేడు, దేవిడోవ్.

"మాసం యెక్కడిది!"

"నాకు తెలియదు; కాని యెక్కడిది అయితే మనకెందుకు?"

"వాళ్ళు, అప్పుడే, గ్రామంలోని సగం జంతువుల్ని పైగా చంపేసేరు."

"ఎవరు?" దేవిడోవ్ యింకొక రొట్టెముక్క విరిచేడు.

"ఇంకా యెవరని అడుగుతూన్నారా? సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఛైర్మన్! యీలోకంలో లేరా మీరు! మీ సమిష్టి వ్యవసాయ క్షేత్రపు రైతులు వారి పశువుల్ని అన్నిటిని చంపేస్తున్నారు. వాళ్ళే కాదు, గ్రామంలోని రైతు లందరూను! క్రిందుమీదు తెలియక, రక్తం చవిచూసిన పెద్దపులుల్లాగ

యెద్లనికూడా చంపేస్తున్నారు."

"మీటింగులో మాట్లాడుతూన్నట్లు అంత గట్టిగా అరుస్తా రెందుకు? అదో దురలవాటు." డేవిడోవ్ రొట్టెపై 'నూక్' కలిపి నోట్లో వేసుగున్నాడు. "జరిగినదంతా, నెమ్మదిగా చెప్పండి, యెవరు చంపుతున్నదీ, యెందుకు చంపుతున్నదీ."

"ఎందుకు చంపుతున్నారో నేనెల్లా చెప్పగలను?"

"అనవసరంగా అరుస్తూ, చప్పట్లు చరుస్తారు. నేను కళ్లు మూసుకొని, 1919 నాటి ఆ వెనకటి సంగతులన్నీ శాంతంగా జ్ఞప్తికి తెచ్చుగోకలను."

"ఇంకొక నిమిషానికి మీరుకూడా అరవడం మొదలెడ తారు."

రజ్మట్నోవ్ తనకి తెలిసినంతవరకు, ప్రజలు జంతువుల్ని చంపడం విషయం తెలియచేసేడు. డేవిడోవ్ క్రమంగా, రొట్టె నములకుండానే తినెయ్యడం మొదలెట్టేడు. అతనిలో పరిహాసభావం పోయింది.

"వెంటనే వెళ్ళి, 'జనరల్ మీటింగు' జరుగుతుందని ప్రజల కందరికీ తెలియచెయ్యండి." అని ఆజ్ఞాపించేడు. "నగుల్నోవ్‌ని యిక్కడికి......పోనీ లెండి, నేనే వెడతాను అక్కడికి."

"జనరల్ మీటింగు దేనికి?"

"ఎందుకా? జంతువుల్ని చంపకూడదని తెలియచెయ్యడానికి! అటువంటివాళ్ళ సభ్యత్వాలు రద్దుచేసి, కేసులు పెడ

దం. చూసీచూడనట్లు వదిలెయ్యవలసిన విషయం కాదిది. ఇదంతా కులకుల పోగ్రిత్సాహం. ఈ సిగరెట్టు తీసుకొని కాల్చి చూడండి. ఇందాకటినుంచీ, యీ విషయం మరిచిపోయాను, చూసేరా," డేవీడోవ్ పెదవులమీద చిరునవ్వు తళుక్కుమంది! కళ్ళు సంతోషాన్ని వెలిగక్కుతున్నాయి. అతడు పెదవులు కదల్చకపోయినా, సంతోషం ముఖంలో తాండవం ఆడుతూనేవుంది.

"ఈరోజునసే, నాకు 'లెనిన్ గ్రాడ్' నుంచి బంగీ వొకటి వచ్చింది. స్నేహితులు పంపేరు......" వుత్సాహం చేత యెగ్రిబడ్డముఖంతో వంగి, మంచం క్రిందనుంచి, చిన్న పెట్టె వొకటి యివతలకి లాగి మూత, తెరిచేడు! సిగరెట్టు పెట్టెలు, బిస్కట్టు ప్యాకట్లు, చమ్కీ పనిచేసిన సిగరెట్టుకేసు, ఇంకా అనేక వస్తువులు చిందరవందరగా పడివున్నాయి.

"కామ్రేడ్సు నన్ను మరిచిపోలేదు. చూడండి. ఎన్ని వస్తువులు పంపించారో.........ఇవి లెనిన్ గ్రాడ్ సిగరెట్లు, ఛోకలెట్లు కూడా పంపేరు, చూసేరా? నాకు యెందుకు అవి? ఎవరికేనా పిల్లలకి పంచిపెట్టేస్తాను.........కాని అదికాదు విషయం, అసలు మనకి పంపించేరు, అదీ మనం చూడవలసింది. ఏమంటారు, అంతేనా? జ్ఞాపకార్థం యీవస్తువులన్నీ పంపుతూ వాటితో నొక ఉత్తరంకూడా పంపేరు........."

డేవిడోవ్ కంఠస్వరంలో యెన్నడూలేని నెమ్మది తోణు

కాదుతూంది. ఆండ్రీ, శాంతము, సంతోషము మూర్తీభవించి యున్న యీ కామేస్రిడ్ దేవిడోవ్ ని యిదివరకు చూడలేదు. దేవిడోవ్ తత్తరపాటు అంతా రజ్మటోన్లోవ్ ని ఆవహించింది.

"సరే, బాగానేవుంది, మీరు చాలా గొప్పవాళ్ళు, అందు చేతనే మీ స్నేహితులు యివి అన్నీ పంపించేరు. కాని యివి అన్నీ కలిసి వొక 'రూబులు' ఖరీదేనా వుంటాయా?"

"ఖరీదు యెంత అని కాదు మనం చూడవలసింది. నేనున్నాను చూసేరా, తల్లి, తండ్రి. భార్య, పిల్లలు యెవ్వరూ కూడ లేని యేకాకిని. ఇప్పుడు యీ పార్సెలు వచ్చింది చూడండి! ఎంత సంతోషంగా వుంటుంది? ఈ ఉత్తరం మీద యెంతమంది సంతకాలు చేసేరో చూడండి" దేవిడోవ్ వొక చేతితో సిగ రెట్ పెట్టెతీసి, రెండవచేతితో, అనేక సంతకాలు వున్న వొక వుత్తరం పట్టుగున్నాడు. అతని చేతులు వణికేయి.

రజ్మటోన్లోవ్ లెనిన్ గ్రాడ్ సిగరెట్టు వెలిగించి, యిల్లా అడిగేడు:

"ఈ బసవీలుగా వుందా? ఇంటి యజమానురాలు మంచిదే అనుకుంటాను, కాదూ? గుడ్డలు వుతగడం యేం చేస్తున్నారు? మా ఇంటికి తీసుకువచ్చి పడెయ్యండి, మా అమ్మ వుతికిపెడు తూంటుంది; లేకపోయినట్లయితే యిక్కడివాళ్లని యెవరినేనా యేర్పాటుచేసుగోండి. మీరు తొడిగిన ఆ షర్టు చూడండి. గొడ్డుతోలులా యెల్లావుందో. అంటించినా అంటుగోదు:"

బీళ్ళుదున్నేరు.

డేవిడ్లోవ్ ముఖం యెర్రబడింది.

"అవును. ఏదో చూడాలి. నగుల్నోవ్ యింట్లో వున్నంత కాలము, యేమిచెయ్యడానికీకూడ వీలులేకపోయింది; చిరిగి పోయిన బట్టలు కుట్టుకోనడం, వుతగడంకూడ నేనే చేసు కుం టుండేవాడిని. యిక్కడికి వచ్చినప్పటినుంచి వొక్కసారి కూడ సబ్బు పట్టించి బట్టలు శుభ్రంగా వుతుకుకోలేదు. అందు చేతనే యిల్లా వున్నాయి......... ఈ వూళ్ళో కొట్లలో యెక్కడా సబ్బు దొరకలేదు. ఈ పక్కన వున్న వొక ఆమెని అడుగుతే, ఆమె 'సబ్బుయివ్వండి, వుతికి పెడతాను.' అంది. బట్టల సబ్బు పంపించమని లెనిన్ గ్రాడ్ లో మా స్నేహితులకి వుత్తరం వ్రాయాలి. ఈ బస అంత పాడుగాలేదు, పిల్లల గొడవ యేమీలేదు, స్థిమితంగా కూర్చుని చదువుకోడానికి వీలు గానే వుంది........."

"మీ బట్టలు మా అమ్మకి యివ్వండి, ఆవిడ వుతుకుతుంది. మొఖమాటపడకండి. మా అమ్మ చాలా మంచిది"

"ఏదో వొకటి చేస్తాను, మీరు వ్యసనపడకండి. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి మంచి స్నానాలయిల్లు వొకటి కట్టిం చాలండి. బాగుండదు? కొద్దిరోజులలో చూడాలి. ముందు మీరు వెళ్ళి మీటింగువిషయం చూడండి. వెనక నేను కూడా వచ్చేస్తున్నాను."

రజ్మట్నోవ్ సిగరెట్టు పూర్తిచేసి వెళ్ళిపోయేడు. డేవిడ్లోవ్

కొంతసేపు పెట్టిలో వస్తువులు యిక్కడివి అక్కడ, అక్కడవి యిక్కడ సర్ది వొక్క నిట్టూర్పు విడిచేడు. తరువాత మాసి పోయిన బూడిదరంగు 'స్టార్చు' కాలరు సరిచేసి, చెదిరియున్న నల్లటి జుట్టు దువ్వుకొని బయటికి వెళ్ళడానికి సిద్ధం అయేడు.

దోవలో నగుల్నోవ్ యింటిదగ్గర ఆగి అతనిని కేకేసేడు. నగుల్నోవ్ కనుబొమలు ముడేసి, అతనినుంచి దృష్టి తప్పించి చూస్తూ బయటికి వచ్చేడు.

కుశలప్రశ్నలు అయిన తరువాత దేవిడోవ్, "ప్రజలు పశువుల్ని అన్నిటిని చంపేస్తున్నారు." అన్నాడు.

"ఒక్కడికికూడా పట్టుమని పది రూపాయల ఆస్తిలేదు, ఇంతోటిఆస్తి ప్రభుత్వానికి వశపరచవలసి వస్తుందేమోనని యీ అడావిడి అంతా. మధ్యతరగతి ప్రజలు పడుతున్న ఆందోళనకి అంతే లేదు." నగుల్నోవ్ భార్య వైపు తిరిగి "లుకెరియా! నువ్వు యిక్కడ వుండకు. వెళ్ళి యీ యింటి ఆవిడ దగ్గర కూర్చో" అన్నాడు.

లుకెరియా విచారంతో యింట్లోకి వెళ్ళిపోయింది. గ్రేమాచీ లోని భాగ్యవంతు లందరితోపాటు, టిమోఫీ కూడ ప్రవాసానికి వెళ్ళినప్పటినుంచి ఆమె విచారంగానే వుంటూంది. ఎప్పుడూ కలకలలాడే ఆమెలో ఆ వెనకటి సంతోషమేమీ లేదు. టిమోఫీ వియోగం సహించలేక కుంగిపోతూంది. భాగ్యవంతుల్ని అందరిని వుత్తరధృవ ప్రాంతానికి పంపేరోజున ఆమె

టిమోఫీని చూడడానికి, సిగ్గుబిడియాలు వదిలేసి వుదయం మొదలు బోర్షెవ్ దొడ్లో కాచుకొని కూర్చుంది. బాగా పొద్దు వాలిన తరువాత, భాగ్యవంతుల కుటుంబాలని, వారి సామానులని యెక్కించుకొని స్లెడ్జిబళ్లు బయలుదేరేయి గ్రిమాచీనుంచి. లుకేరియా, వొక్క కేక వేసి, నిలువునా మంచులో పడిపోయింది. టిమోఫీ ఆమెని లేవనెత్తడానికి స్లెడ్జిబండిలోనుంచి కిందికి వురికేడు. కాని అతని తండ్రి కేకలు వెయ్యడంచేత, మహాక్రోధంతో గ్రిమాచీ గ్రామం వైపు తిరిగి తిరిగి చూస్తూ, బళ్ల వెనక వెళ్లిపోయేడు.

టిమోఫీ బుజ్జగింపుమాటలు లుకేరియా చెవుల్లో యింకా ప్రతిధ్వనిస్తూనే వున్నాయి. ఆమాటలు యింక యెన్నడూ విని పించవుకదా! జీవితంలోని వెనకటి సౌఖ్యదినాలు తలుచు కుంటే, యే యువతి విచారించదు! ప్రేమతో ఆమె కళ్లల్లోకి చూస్తూ, "లుకేరియా! ఆ పచ్చగౌను తొడుక్కుంటే బాగుంటుంది. పెద్ద వుద్యోగస్తుడి భార్యలా వుంటావు," అనేవాళ్ళు యెవరు? "వెళ్ళిపోవాలి; వొదిలెయ్యి. ఎంత సేపు వున్నా నిన్ను విడిచివెళ్లాలని వుండదు. నీ అందం చూస్తే కొరుక్కుని తినెయ్యాలనిపిస్తుంది." లుకేరియాని పొగడి వుబ్బేసి, హృదయం రేకెత్తించి, సౌఖ్యపరవశురాలినిగా చేయగలవాడు టిమోఫీ వొక్కడే.

ఆరోజు మొదలు ఆమె భర్తమీద కూడ విరక్తిగా

ప్రంశసం మొదలెట్టింది. ఆమెలోని యీ మార్పు మకార్ గ్రహించేడు.

"లుకెరియా! నాతో వుండే యీ కొద్దిరోజులు సుఖంగా వుండు. తరవాత నీ వస్తువులన్నీ తీసుకొని నీ యిష్టం వచ్చిన చోటకి వెళ్ళు. నిన్ను హృదయపూర్వకంగా ప్రేమించి నలుగురిలోను నవ్వుల పాలయేను. నా వోర్పు నశించింది. ఒక భాగ్యవంతుడి కొడుకుతో నీ యిష్టంవచ్చినట్లు తిరుగుతున్నా కాని మాట్లాడక వూరుకున్నాను. అంతటితో నగిలిపెట్టక వాడు వూరు వదిలి వెళ్ళిపోతుంటే నడివీధిలో, అందరు చూస్తుంటే, సిగ్గేనా లేకుండా వాడికోసం గోలపెట్టేవు. ఇంకా వోర్పువహించి యుండడం నాచేత కాదు. ఇంతవరకు నా మెడకి గుదిబండలా వున్నావు. ఈ అనవసరపు బరువెందుకు; తోసిపారేస్తాను. తెలిసిందా?" అన్నాడు.

"ఆ, తెలిసింది." అని చెప్పి వూరుకుంది లుకెరియా.

ఆరోజు సాయంకాలం నగుల్నోవ్, దేవిడోవ్‌లు యీ విషయాన్ని గురించి రహస్యంగా మాట్లాడుకున్నారు.

"మకార్! మీ భార్య దుర్నడత అంతకంతకి మితిమీరుతూందే! నిన్న నేమిచేసిందో చూసేరా! ప్రజలలో తలయెత్తుకొని తిరగకలరా మీరు?" అని నిలవతీసి అడిగేడు దేవిడోవ్.

"మళ్ళీ ఆ వెనకటి గొడవలన్నీ........"

"ఛీ! కట్టిమొద్దు! ఇంతకంటె దున్నపోతయినా నయం."

దేవిడోవ్ ముఖం యెర్రబడింది. నుదుటిమీది రక్తనాళాలు వుబ్బాయి.

"మీతో మాట్లాడడం కష్టం." నగుల్నోవ్ గదిలో పచారు చేస్తూ వేళ్ళు మెటికలు విరిచి, తనలో తనే నవ్వుకున్నాడు. "'అనార్కిస్టు టాట్స్కీయిస్టు. నిలకడలేనివాడు' అని తిట్టడంతో మాట్లాడడం ప్రారంభిస్తారు. నాభార్యమీద నాకు యెటువంటి వుద్దేశం వుందో, యింత అపకీర్తి సహించి యెందుకు వూరుకుంటున్నానో మీకు తెలుసును. నా మనస్సు మారిపోయిందని మీకు చెప్పనే చెప్పేను. మీకు యెప్పుడైనా గొర్రెతోక చూస్తే ఆశ్చర్యం కలిగిందా?"

"లేదు." దేవిడోవ్ నెమ్మదిగా సమాధానం చెప్పేడు. నగుల్నోవ్ సంభాషణ మార్చేసి అర్థంలేని ప్రశ్నలు వెయ్యడం చూసి ఆశ్చర్యంకలిగింది.

"నాకు మాత్రం ఆశ్చర్యం కలిగింది. గొర్రెకి తోక వుపయోగం యేమి వుందాఅని." అదనపు బరువుతప్ప మరేమీ లాభంలేదు. ఎద్దు, గుర్రం, ఆఖరికి కుక్కకూడా దాని తోకవల్ల కొద్దిగానైనా వుపకారం పొందుతూంది. గొర్రెకి కొవ్వు బరువైన తోక, యిటు. అటు ఆడించడానికి తప్ప యీగల్ని తోలుకొనడానికికూడ వుపయోగించదు. ఉపయోగం లేకపోవడం సరేకదా పైగా దానినిండా, బుడ్డగుణుజులు, దూరి పీకుతుంటే బాధగాకూడా వుంటుంది."

"ఈ తోకల్ని గురించిన యీ వుపన్యాసం యెందుకు?" అన్నాడు దేవిడోవ్.

నగుల్నోవ్ సమాధానం చెప్పకుండా మళ్ళీ ప్రారంభించేడు.

"గొఱ్ఱెకి తోక లేని కొఱత తీర్చడానికి పెట్టినట్లు తోస్తుంది, ఆ మొండిముక్క. అది అనుపయోగమే కాని దాని బదులు అక్కడ యింకొకటి యేమి పెడతాము? గొఱ్ఱెకి తోక అనుపయోగం అయినట్లే, నా భార్య కూడా నాకు అనుపయోగం. నేను ప్రపంచ విప్లవంకోసం యెదురు చూస్తున్నాను. అదే నా జీవిత పరమావధి. నా భార్య ఉనడానికే కాని యింక యెందుకూ పనికిరాదు. నా దోవకి అడ్డుకూడాను. కాని ఆడది లేనిదే అసలే సాగదు. నేనూ మనుష్యుడినే. జబ్బు చేస్తే చాకిరీ చెయ్యడానికి, యింకా యితర అవసరాలు తీర్చడానికి ఉపయోగిస్తుంది. నేను కనక తృప్తిపరచ లేకపోయినట్లయితే వెళ్లిపోవచ్చు! ఒకసారి ఆమెతో 'నువ్వు నీ యిష్టంవచ్చిన వాళ్ళతో తిరగవచ్చు, నా అభ్యంతరం లేదు; కాని నా కళ్ళ యెదుట కాకుండా రహస్యంగా వుంటూండు. అంతే కాని నీ యిష్టంవచ్చినట్లు అడ్డమైనవాళ్ళతోను తిరిగి ఆ ఆనమాళ్ళతో నా దగ్గిరికి వచ్చేవంటేమాత్రం వొళ్లు వొలిచేస్తాను. జాగ్రత్త.' అన్నాను. కామ్రేడ్ దేవిడోవ్! యీగొడవలన్నీ మీకు తెలియవు. నా భార్య చెడు ప్రవర్తనకి నేను యేమి చెయ్యగలను? అది మరి యిద్దరికికూడ సమాధానం చెప్పగలదు. కూలీ వర్గా

నికి శతృవైన వొక భాగ్యవంతుడితో తిరగడమే కాకుండా, వాడు వెళ్ళిపోతుంటే సిగ్గేనా లేకుండా యేడ్చిన దీనిని యెవరు అడ్డంవచ్చినాసరే నా యింట్లో నుంచి తరిమెయ్యాకమానను. ఎటువంటి పని చేసినా కొట్టడానికి మాత్రం నా మనస్సు వొప్పదు. మీ రేకనక అయినట్లయితే, భావకొట్టి వుందురు, కాదూ? అటువంటప్పుడు కమ్యూనిస్టునని చెప్పుకొనే మీకు, పూర్వకాలపువాళ్ళకి యేమి తేడా వుంది? పూర్వపువాళ్లు భార్యలను అస్తమానూ కొడుతుండేవారు! విషయం యిది. మీరు యికనుంచి యికిరియా మాట నా దగ్గిర యెన్నడూ యెత్తకండి. అటువంటి విషయాలలో వొకరి సలహా నాకు అవసరం లేదు. భార్య చాలా తీవ్రసమస్య. చాలవరకు ఆమెమీద ఆధారపడి వుంటుంది." వగుల్నోవ్ పరధ్యాన్నంగా నవ్వేడు. మళ్ళీ తీవ్రంగా మాట్లాడడం మొదలెట్టేడు. "ఈ దేశ సరిహద్దులు తీసిపారెయ్యనియ్యండి; అప్పుడు అందరికంటె ముందుగా నేనే, 'విదేశ స్త్రీలను మీ యిష్టంవచ్చినవాళ్ళని పెళ్ళి చేసుకొనండి!' అని బయలుదేరుతాను. అప్పుడు ప్రపంచములోని ఈ వేర్వేరు జాతులన్నీ కలిసిపోయి, వొకడు తెలుపు, యింకొకడు పసుపు, మరియొకడు నలుపు అను భేదము, తెల్ల జాతివాడు మిగిలిన వాళ్లకంటె గొప్పవాడనుకొనే అహంభావము నశించిపోతాయి. ప్రతివాళ్లు యెండలో శ్రమపడి పనిచెయ్యడంచేత బలిష్ఠములైన శరీరాలతో వొకేరంగు శరీరాలతో వుంటారు.

రాత్రిళ్ళు సాధారణంగా యిలాగ ఆలోచిస్తుంటాను......"

"మరికొర్! మీరు కల్పనా ప్రపంచంలో విహరిస్తుంటారు." దేవిడోవ్ అసంతృప్తితో అన్నాడు. "మిమ్మల్ని నేను అనేక విషయాల్లో అర్థంచేసుకోలేకుండా వున్నాను. జాతివిభేదాలు .........అది నిజమే ననుకోండి. కాని మిగిలిన విషయాలు... ......Problems of existence లో మాత్రం మీతో యేకీభవించలేను. సరే ఆ విషయాలన్నీ మనకెందుకు! ప్రస్తుత విషయం చూద్దాం. ఈవేళనుంచి మీ యింట్లో మకాం యెత్తేస్తున్నాను."

దేవిడోవ్ బల్ల కింద వున్న సూట్ కేస్ యివతలకి లాగేడు. దాల్లోవున్న పనిముట్లు గలగలలాడుతుంటే ఆ పెట్టె తీసుకొని బయటికి వెళ్ళిపోయేడు. నగుల్నోవ్ అతనితో కూడా కొత్తగా బస తీసుకున్న ఫిలిమోనోవ్ యింటికి వెళ్లేడు. అక్కడికి వెళ్ళేవరకు వారు తొలకరి చల్లికలను గురించి మాట్లాడుకున్నారు. అది మొదలు వారి పరస్పర సంబంధాలలో యే పేచీ లేకుండా సాఫీగా గడవడం ప్రారంభించేయి.

అందుచేతనే దేవిడోవ్, గ్రామస్థులు పశువుల్ని చంపుతున్నారని చెప్పడానికి వచ్చినప్పుడు నగుల్నోవ్ తన భార్య లోపలికి వెళ్ళిపోయిన తరువాత సరదాగా మాట్లాడడం మొదలెట్టేడు.

"పశువుల్ని అన్నిటిని వధం చేస్తున్నారు, ద్రోహులు!"

అన్నాడు నగుల్నోవ్. వాళ్ళు మాంసం తెగతిని కడుపు నొప్పి తోనైనా బాధపడడానికి అంగీకరిస్తారు కాని, పశువుల్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రంకి యివ్వడానికిమాత్రం అంగీకరించరు. మనం వొక సమావేశం యేర్పాటుచేసి, ఆసభలో 'పశువుల్ని చంపేవారిని కాల్చి చంపడానికి అనుమతి యివ్వవలసినదని' వొక రిజల్యూషను Pass చేద్దం "

"ఏమిటి?"

"కాల్చిపారేద్దం. వాళ్ళని కాల్చిపారెయ్యడానికి యెవరి అనుమతి తీసుకోవాలి? పీపుల్సు కోర్టుకి అధికారం లేదను కుంటాను. ఉందా? ఇద్దర్ని కనక చంపినట్లయితే, మిగిలినవాళ్లు కళ్ళు తెరిచి దోవకి వస్తారు. ఇటువంటి పరిస్థితులలో మనం యేమీ దయాదాక్షిణ్యాలు లేకుండా అతిక్రూరంగా ప్రవర్తించాలి "

డేవిడోవ్ సెత్తిమీది టోపీ బల్లమీద పడేసి, గదిలో పచారు చెయ్యడం మొదలెట్టేడు. అతని కంఠస్వరంలో అసంతృప్తి, అనిశ్చయము ప్రతిఫలిస్తున్నాయి.

"మళ్ళీ మీరు తప్పుదోవ తొక్కుతున్నారు! అది వట్టి దుడుకుతనం అనిపిస్తుంది. మకార్! మళ్ళీ ఆలోచించి చూడండి. ప్రజలు వాళ్ళపశువుల్ని చంపుగుంటే మీరు నిజంగా వాళ్ళని కాల్చి చంపగలరా! అటువంటి పనిచేస్తే, సహింపుకొనడానికి మనకేమీ చట్టాలు లేవు. సెంట్రల్ యెగ్జి

క్యూటివ్ కమిటీ Pass చేసిన రిజల్యూషను ప్రకారంకూడా 'రెండు సం॥ల జైలు, భూమిని స్వాధీనం చేసుకోవడం, ప్రవాసం పంపడం' తప్ప మరేమీ చెయ్యడానికి వీలులేదు. మీరు యేకంగా చంపిపారెయ్యడానికి అనుమతి కోరుతూన్నారు! నిజంగా మీరు........"

"ఏమిటి నేను'' నేను ఆ రకంకి చెందినవాడిని కాను. అస్తమానూ మీరు ప్లానులువేస్తూ ఆలోచిస్తూనే వుంటారు. కాని ముందు మనం నుక్కొదున్నడం యెలాగ? ప్రతీవాళ్లు సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరేముందే యెద్దుని చంపేసినట్లయితే యేంపెట్టి దున్నుతాం?" నగుల్నోవ్ పెద్దపెద్ద అంగలువేస్తూ డేవిడోవ్ దగ్గిరికి వెళ్ళి అతని బుజంమీద చెయ్యివేసేడు, తన బుజాల దగ్గిరికివచ్చిన డేవిడోవ్ కేసి చూస్తూ.

"సైమియన్! మిమ్మల్ని చూస్తే విచారంగా వుంది. ఇంత చవటబుర్ర అయిపోయింది యెందుచేత, మీది? ఈ సం॥రం చల్లికలు ఆగిపోయేయంటే యెంత యిబ్బంది పడాలో తెలుసునా? ఆవిషయం గ్రహించలేదూ మీరు? దీనికి మూలకారకులను యిద్దరు, ముగ్గుర్ని కాల్చి చంపేస్తేచాలు! భాగ్యవంతుల్ని కాల్చిపారెయ్యాలి! ఇది అంతా వారి ప్రోత్సాహమే! పై వుద్యోగస్తుల అనుమతి పొందాలి." అన్నాడు.

"ఛీ, నోరుముయ్యి!"

"అదిగో! మళ్లీ మొదలెట్టేరు!" నగుల్నోవ్ తలవాల్చేడు.

మళ్లీ, అకాత్తుగా తల యెత్తి పెద్దకంఠస్వరంతో, "వాళ్లు అందరూ పశువుల్ని నాశనం చేసేస్తున్నారు. అంతర్యుద్ధంలో మాదిరిగా అతి క్లిష్టపరిస్థితులు వచ్చేయి. శత్రువులు నలుమూలలా చెలరేగుతున్నారు; మీరు! మీవంటి మందకొడి మనుష్యుల మూలంగానే ప్రపంచ విప్లవానికి అనుకూల పరిస్థితులన్నీ వృథా అయిపోతున్నాయి. ఇటువంటివాళ్ళు ప్రపంచ విప్లవం తీసుకు వస్తారన్నది వట్టిమాట. ప్రపంచం అన్నిమూలలా భాగ్యవంతులు మన సోదర కూలీలని చిత్రవధ చేస్తున్నారు: రెడ్ చైనీయుల్ని నాలుగు మూలలనుంచి క్రిమ్మి నాశనం చేసేస్తున్నారు; నల్ల వాళ్లని నేలపెట్టి రాసేస్తున్నారు; అటువంటి నగ్గ శత్రువుల్ని మీరు యిక్కడ దయదలుస్తామంటారు! ఎవరేనా వింటే సిగ్గు కూడాను! భయంకర అవమానం! భాగ్యవంతులచేత అణిచి వెయ్యబడుతున్న యితర దేశములలోని మన సోదరుల్ని తలుచు కుంటే నా రక్తం వుడికిపోతుంది! భయంకరమైన ఆ వార్తలు చదవడానికి యిష్టంలేక పేపరు చూడడంకూడా మానేసేను. క్లిష్టస్థితి, పడుతూన్న బాధలు చూస్తే గుండెలు నీరయి పోతాయి. కాని మీరు......... శత్రువులచేత జైళ్లలో త్రోయబడి క్రుంగుతూన్న మన సోదరుల్ని కలలోనైనా తలుచు కుంటారా మీరు? వాళ్ళ విషయమే అక్కరలేదు మీకు!"

"వాళ్ళ విషయం అక్కరలేదు, నాకు? ఇంక యెప్పుడూ మాత్రం యిల్లాంటి మాటలు అంటూండకండి. కుమ్మర్ల్ని

చూడగా కొంచెం మతి చెలించినట్లు కనిపిస్తున్నారే! మాట్లా డితే కాల్చెయ్యాలి అంటారు; అదొక పెద్ద విషయంకాదు— ఎవరుపడితేవాళ్ళు చెయ్యొచ్చు! ఏమాత్రం ప్రతిఘటన కలిగినా మీరు తీవ్రంగాపోతారు. మన నీతిని బోధిస్తూ ప్రచారం చెయ్యాలికాని, అడ్డు వచ్చిన వాళ్ళందర్నీ చంపేస్తానంటే యెల్లాగ? అసలు, యింతవరకు వచ్చేవరకు యెందుకు వూరుకున్నారు?"

"వూరుకున్నానా!"

"ఆ—యేమీ అనుమానం లేదు. పరిస్థితులు విషమించేవరకూ కళ్లు మూసుకొని కూర్చున్నాము; యిప్పుడైనా దానికి తగిన ప్రతిక్రియ ఆలోచించాలికాని, కాల్చి చంపేస్తామంటే లాభంలేదు. అవసరం వచ్చినప్పుడు, ఇదివరకు చేసేను ఆపని. ఇప్పుడు యెంత సేపూ ప్రజలలో తీవ్రంగా ప్రచారంకావాలి. మీటింగుకి వెళ్ళిపోదం రండి; అప్పుడే ఆలస్యం అయింది. పశువుల్ని చంపకూడదని ప్రజలలో బాగా ప్రచారం చెయ్యాలి."

"నిన్నరోజల్లా, నేను ప్రతి యింటికి వెళ్ళి, వాళ్ళకి బాగా బోధించేను"

"అదీ, చెయ్యవలసిన పని. మళ్ళీ యింకోసారి వెడదం, మనం అందరం కలిసి."

"మళ్ళీ వెడతారా! నిన్న వొకరియింట్లోనుంచి వస్తూ, వాళ్లకి

బాగా నచ్చచెప్పేను. యింక పశువుల్ని చంపరు.' అనుకున్నాను. ఇంతలో ఆయిల్లు దాటకుండానే వాళ్లు చంపుతూన్న పంది అరుపు వినపడింది. అంతక్రితమే వాళ్లకి ప్రపంచ విప్లవాన్ని గురించి, కమ్యూనిజాన్ని గురించి బోధించేను! ఎల్లా మాట్లాడేవనుకున్నారు! ఆమాటలకి నాకే కళ్లు నీళ్లు వచ్చేయి. అంత అల్లా చెప్పినా లాభంలేకపోయింది. బండి యెద్దు ముల్లుకర్రతో చెబుతే వింటుందికాని నచ్చచెబుతే వింటుందా! వీళ్లని నెత్తిమీద మొట్టి, 'భాగ్యవంతుల మాటలు వినకురాగాడిదా! వాళ్ళలా ఆస్తి పోగుచేసుకోవాలనే దుర్బుద్ధి వొదిలెయ్యి. పశువుల్ని చంపేసేవంటే, చిత్రవధ చేస్తాను జాగ్రత్త' అని చెప్పాలి. వాడు, 'యెద్దునేకాదా చంపుతున్నాను' అనుకుంటాడు, కాని నిజంచేత వాడు ప్రపంచ విప్లవాన్ని దూరం చేస్తున్నాడన్నమాట."

"కొంతమందిని శిక్షిస్తే, మిగిలినవాళ్లు సులువుగా లొంగుతారు." అన్నాడు డేవిడోవ్.

వాళ్లు వీధులోకి వచ్చేరు. దట్టంగా కురుస్తున్న మంచు కాళ్ళకింద పిసపిసలాడుతూంది. చీకటి గాఢాంధకారం. ఆ చీకట్లోనే వాళ్లు స్కూలు దగ్గిరికి వచ్చేరు. మీటింగుకి గ్రామస్తులలో సగంమంది మాత్రం వచ్చేరు. 'ప్రజలు బుద్ధిపూర్వకంగా చేసే జంతు వధని ఆపడానికి పీపుల్స్ కమిస్సారు నిర్ణయించిన శిక్షాస్మృతి, రజ్మత్నోవ్ చదివి వినిపించేడు. అతని

తరవాత డేవీడోవ్ మాట్లాడేడు. అతడు వుపన్యాసం అయిపోయిన తరవాత అఖరున యిల్లా అనిచెప్పేడు:

"సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరడానికి కొత్తగా 26 గురు దరఖాస్తులు పెట్టేరు. రేపు మీటింగులో, భాగ్యవంతుల మాటలువిని మోసపోయి, పశువుల్ని చంపేసినవారిని యేరి వారి దరఖాస్తులు తోసేసి, మిగిలినవారిని మాత్రం చేర్చుకుంటాము."

"ఇంతకిత్రితమే సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరినవాడు చంపుతాడనుకోండి; వాడిని యేం చేస్తారు?" అని అడిగేడు లుబిష్కిన్.

"వాళ్ళనికూడా బయటికి గెంటేస్తాము!"

సభలో గుసగుసలు బయలుదేరేయి.

"అలాగ అయినట్లయితే సమిష్టి వ్యవసాయ క్షేత్రమే యెత్తెయ్యవలసివస్తుంది. ఈవూరు మొత్తంమీద అటువంటి వాడు వొక్కడుకూడా లేడు." అన్నాడు బోక్షేవ్.

నగుల్నోవ్ పిడికిళ్లుబిగించి అతని మీదకి వురికేడు.

"నిన్ను యెవరూ మాట్లాడమనలేదు. నోరుముయ్యి! సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని గురించి నువ్వు మాట్లాడవలసిన అవసరం లేదు. నీ సలహా అవసరం లేకుండానే మేము నిర్వహించుగోగలం. నీ గిత్తదూడని నువ్వు చంపెయ్య లేదనుకుంటాను, అవునా?"

"నా దూడల్ని నాకు తోచినట్లు చెయ్యగలను"

"ఆ—అల్లాగా! రేపు నిన్ను సైదుకి పంపించినప్పుడు, అక్కడ నీ యిష్టంవచ్చినట్లు చేద్దువుగానిలే!"

"అంతతొందరా! వొళ్ళుక్కొప్పుడు విషమిస్తుంది జాగ్రత్త" అని యెవడో కేకేసేడు.

మీటింగుకి ప్రజలు చాలామంది రాకపోయినా, చాలా గందరగోళంగా వుంది. మీటింగు పూర్తి అయినతరవాత అంతా నిశ్శబ్దంగా బయటికి వెళ్ళేరు. అక్కడ యెవరి యిళ్లకి వాళ్లు వెడుతూ, గుంపులు గుంపులుగా చేరి మాట్లాడుకోనడం మొదలెట్టేరు.

"తొందరపడి అనవసరంగా రెండు గొఱ్ఱెల్ని చంపేసేను!" అని సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుడైన 'సైమియన్ కురుఝునోక్వ్' లుబిష్కిన్‌తో అన్నాడు.

"అన్నీ తెలిసిన నేనుమాత్రం యేం చేసేను! ఒక మేకని చంపేసేను." లుబిష్కిన్ నిట్టూర్పు విడిచేడు. "సభలో నిలబడడానికే చిన్నతనంగా వుంది. దీనికంతకీ నా భార్యే కారణం. దీన్ని తగలెయ్య? 'చంపు', 'చంపు' అని వేధించుకు తినేసింది! మాసం తినాలని ఉందిట! దొంగముండ! ఇంటికి వెళ్ళనీ పళ్ళు వూడకొడతాను!"

"ఆడవాళ్లకి యేం తెలుసును; నెమ్మదిగా బోధించాలి మనం." లుబిష్కిన్ మామగారు అకీమ్ బెష్లిబ్నోవ్ అతనికి

సలహా యిచ్చేడు. "సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో సభ్యుడవు నువ్వు అల్లా చెయ్యడం బాగుండదు."

"అకిమ్! నువ్వు మీ దొర యెద్దుని చంపేసేవుట కాదూ?" అన్నాడు అతని యింటి పక్కనే నివసించే డెమ్కా—ఉ పాకోవ్.

"అవునోయ్—అబ్బాయి, చంపేను అంతకంటె నేనుయేం చెయ్యను చెప్పు? దాన్ని తగలెయ్యా అది కాలు విరగ్గొట్టు కుంది! కర్మ అంటే అదేసుమా—వూరికే పుణ్యానికి, యెక్కడో మూల వున్న పాతరగొయ్యి దగ్గిరికి వెళ్ళి దాన్లోబడి కాలు విరగకొట్టుకుంది."

"తెల్లవారుఝామున నువ్వు నీ కోడలు కర్రలు పుచ్చుకొని దాన్ని పాతర వైపు తోలడం నేను చూసేను..."

"ఆ—యేమిటి? డెమ్కా—యేమంటున్నావు? ఎప్పుడూ అలాగంటి తెలిసీ తెలియని మాటలు చెప్పకేం!" ముసలి అకిమ్ తొట్రుపడి, అకాత్తుగా నడివీధిలో అలాగే నిలిబడి కన్ను కానరాని కారుచీకట్లోకి రెప్పలాడుస్తూ చూస్తున్నాడు.

"తాతా, రావోయ్." అన్నాడు డెమ్కా. "మైలురాయిలా నడివీధిలో అలాగ నిలబడ్డావెందుకు? నీఅంతట నువ్వే యెద్దుని పాతరగోతిలోకి తోలి........"

"డెమ్కా, యెద్దు దానంతట అదే వెళ్ళింది. అలాగంటి మాటలెప్పుడూ అనకు! మహాపాపం!"

శీతగాలి చెలరేగింది. నదికి యిరువైపులా దట్టంగా వ్యాపిం

బీభృదున్నరు.

చియూన్న పొప్లారుచెట్లు, విల్లోచెట్లు, హోరుమని ధ్వని చేస్తూ వ్రురూతలూగిపోతూన్నాయి. ఎటుచూచినా చీకటి గాఢాంధకారం. కురుస్తూన్న మంచుకు హద్దూ—పద్దూ లేదు. శీతకాలం ఆఖరుసారి తన ప్రతాపం అంతా చూపిస్తూంది.

## పదునారవ ప్రకరణము

## హత్యా ప్రయత్నము.

మీటింగు అయిపోయిన తరువాత డేవీడోవ్, రజ్మటోవ్లు కలిసి బయటికి వచ్చేరు. మంచు దట్టంగా కురుస్తూంది. అక్కడక్కడ తలుపు సందుల్లోనుంచి దీపాలు మినుకు మినుకుమని కనిపిస్తున్నాయి. యెక్కడో మోరయెత్తి అరుస్తున్న కుక్క అరుపు వినిపిస్తూంది. పొలాలమీద మంచు నిలకట్టడాన్ని గురించి యాకోవ్ లూకిచ్ చెప్పిన సలహా జ్ఞాపకంవచ్చి, డేవిడోవ్ నిట్టూర్పు విడిచేడు. "ఈ సం॥ రానికి మనం అలాగ చెయ్యలేము. ఇటువంటి తుఫాను పట్టిందంటే యెంతమంచు పడుతుంది నేలమీద! అంతా కూడా వృధాగా పోతుంది. ఏం చేస్తాం."

"తబేలా దగ్గిరికి వెళ్లి, గుఱ్ఱాలని వొకసారి చూచి వెళ్లిపోదం." అన్నాడు రజ్మటోవ్.

"సరే, నడవండి."

వాళ్లు వొక పక్కసందులోకి మళ్ళేరు. దూరాన్ని వెలుతురు కనిపించింది. తబేలాగా మార్చబడిన లాష్టినోవ్ పాక వెలుపల వొక లాంతరు వేళ్ళాడుతూంది. ఇద్దరు అక్కడికి

వెళ్ళేరు. కుమ్మరం దగ్గిర పంచవార, యేడు, యెనమండుగురు కోసక్కులు నిలబడి వున్నారు.

"ఈవేళ డ్యూటీమీద యెవరున్నారు?" అని అడిగేడు రజ్మటోవ్. అక్కడ నిలబడియున్న కోసక్కులలో వొకడు సిగరెట్టు పారేసి కాలిబూటులో రాసేసి, "కోండా్రట్ మైదనికోవ్" అని సమాధానం చెప్పేడు.

"ఇక్కడ ఇంతమంది మూగేరెందుకు? మీరంతా యేం చేస్తున్నారిక్కడ?" అని దేవిడోవ్ అడిగేడు.

"కామ్రేడ్ దేవిడోవ్.........వూరికేనే నిలబడి సిగరెట్లు కాల్చుకుంటున్నాము."

"ఇప్పుడే గడ్డి తీసుకువచ్చి పడేసి నిల్చున్నాము."

"సిగరెట్లు కాల్చుకుంటూ నిలబడి మాట్లాడుకుంటున్నాము. మంచుకురవడం తగ్గుతుందేమోనని చూస్తున్నాము వెళ్లిపోవడానికి."

గుర్రాలు గడ్డి నములు చప్పుడు వినిపిస్తూంది. గుఱ్ఱపులద్దెలు,- వుచ్చ వాసన కొడుతూంది. ఒకమూల కోయ్యలని, గుఱ్రపు సామానులు వేళ్ళాడుతున్నాయి. నేల అంతటా తుడిచి వుంది.

"మైదనికోవ్!" అండ్రీ కేకేసేడు.

"ఆ—వస్తున్నా." తబేలాలో వొక మూలనుంచి సమాధానం వినబడింది.

మైదనికోవ్ రాగోలుకర్రతో పట్టిగడ్డి తీసుకువస్తూన్నాడు. తలుపుదగ్గరనుంచి నాలుగవఅరలోనున్న నల్లగుఱ్ఱందగ్గరికి వెళ్ళి బూటుతో తన్ని లేవగొట్టి, గాడిలో గడ్డివేసేడు.

"అల్లా నిలబడ్డావేమి!" అంటూ కునికిపాట్లు పడుతూన్న గుఱ్ఱాన్ని రాగోల కర్రతో కొట్టేడు. గుఱ్ఱం తత్తరపాటుతో డెక్కలుఎత్తివేస్తూ, సకిలించి, గాడిలోకి తలపెట్టింది. కాండ్రాట్ డేవిడోవ్ దగ్గిరికివచ్చి, పనిచేత మోటబారిన చెయ్యి ముందరికి చాపేడు.

"కామ్రేడ్ మైదనికోవ్! పనులెల్లా జరుగుతూన్నాయి?"

"అన్నీ సవ్యంగానే జరుగుతూన్నాయి."

"బయటవాళ్లందరూ చేరేరెందుకూ?"

"వాళ్లనే అడగండి!" అతని స్వరంలో ఒకవిధమైన అసంతృప్తి ప్రతిధ్వనించింది. "రాత్రి నేను గుఱ్ఱాలకి గడ్డివెయ్యడానికి రాగానే వాళ్ళంతా ఇక్కడికి చేరుతారు. వాళ్లగుఱ్ఱాల్ని, పశువుల్ని, సమిష్టి వ్యవసాయక్షేత్రం అధీనం చేసినా మనవిఅనే వుద్దేశ్యం ఇంకా వదలలేదు వాళ్ళకి. బయట నిలబడ్డవాళ్ళంతా వాళ్ళగుఱ్ఱాలని బాగా మేపుతానో లేదో అని చూడడానికి వచ్చినవాళ్ళే! వాళ్ళువచ్చి, "నాగుఱ్ఱానికిగడ్డి వేసేవా?", "మాపందెపు గుఱ్ఱాన్ని బాగా మేపుతూన్నావా?", 'మాఆడగుఱ్ఱం చిక్కిపోలేదుకదా?"అని వేధించుకు తినేస్తారు. వాటిని మేపక ముడ్డి ఎండకడుతున్నామనుకున్నారా? వాళ్లకి

సమాధానం చెప్పలేక చచ్చిపోతున్నాను. 'గుర్రాలకి గడ్డి వెయ్యడానికి మేముకూడా సహాయం చేస్తాము. ఉండు.' అంటూ వాళ్ళంతా వచ్చి తలోక సందెడుగడ్డి తీసుకుపోయి, ఎవరి గుర్రాలకివాళ్ళు చాలాగడ్డి వేస్తూంటారు. ఇలాఅయితే బాగు లేదు. అవసరంలేనివాళ్ళు ఎవళ్ళుకూడ ఇక్కడికి రాకూడదని రిజల్యూషను ఒకటి పాస్ చెయ్యాలి."

"ఏమ్నారా?" అండ్రీ రెప్పలు ఆర్పుతూ డేవిడోవ్ వైపు చూసేడు.

"వెంటనే వాళ్ళనందర్నీ వెళ్ళిపొమ్మని చెప్పండి!" డేవిడోవ్ ఆజ్ఞాపించేడు. "అవసరమైనవాళ్ళు తప్ప పైవాళ్ళు ఎవరూ ఇక్కడ ఉండడానికి వీల్లేదు. ఒక్కొక్క గుర్రానికి ఎంతగడ్డి వేస్తారు? తూచి వేస్తూంటారా?"

"తూచడంలేదు. ఉజ్జాయింపుగా ఒక్కొక్క దానికి అరపూడు వేస్తూంటాను."

"అన్నిటికీకూడా పక్కకి గడ్డి వేస్తూన్నారా?"

"ఎందుకు వెయ్యడం?" కోండ్రాట్ కోపంతో తలపంకించేడు. నల్లటిజుట్టు, మెడమీద చిరిగిపోయిన అతని కోటు మీదపడి చిందింది. "మన మేనేజరు ఆస్ట్రోవ్నోవ్, యాకోవ్ లూకిచ్ అన్నమాట- నాదగ్గిరికివచ్చి, "గుర్రాలు తిని దిగపెట్టిన గడ్డి వాటి పక్కకి వేస్తూండు," అని చెప్పేడు. అదిమంచి ఆజ్ఞయేనా? అతను చాలా తెలివైన వ్యవసాయదారు డను

కుంటున్నాము. చూడండి ఎల్లాంటి ఆజ్ఞలు ఇస్తున్నాడో!"

"ఏమి దాన్లో తప్పేముంది?"

"కామ్రేడ్ డేవిడోవ్! అది తప్పే. గుర్రాలు వదిలేసే గడ్డి అంతా మంచిదే. గొర్రెలకి మేకలకి వేస్తే ఒక్క పరక కూడా దిగ పెట్టకుండా తినేస్తాయి. అల్లాంటి గడ్డి అంతా గుర్రాలకి పక్క వెయ్యమన్నాడు! దీని గురించి ఆయనతో చెప్పేను. కాని నువ్వు నాకు సలహా ఇవ్వవచ్చేవా అని కసిరి కొట్టేడు."

"నీవు చెప్పినదే బాగుంది. ఆ గడ్డి పక్క వేయకండి. రేపు అతన్ని ఒక్క తట్టు ఏగసి చీవాట్లు పెడతాను" అన్నాడు డేవిడోవ్.

"ఇంకొక విషయం ఉంది. గడ్డి ఆనూతవారనున్న మేటిలో నుంచి తీసివెయ్యమని చెప్పేరు. అల్లా ఎందుకో నాకు అర్థం అవలేదు"

"యాకోవ్ లూకిచ్, ఆ గడ్డి అంత మంచిది కాదని చెప్పేడు. ఈ శీతకాలంలో ఆ గడ్డితో మేపి, తొలకరి దుక్కుల నాటికి మంచిగడ్డి ఉంచితే బాగుంటుందని చెప్పేడు."

"ఆ ఆలోచన బాగానే ఉంది, కాని ఉపయోగించే గడ్డి పక్కకి వెయ్యమనడాన్ని గురించి మాత్రం చెప్పండి?"

"ఓ తప్పకుండా చెబుతాను. ఈ లెనిన్‌గ్రాడ్ సిగరెట్టు కాల్చిచూడండి, చాలా బాగా ఉంటుంది." డేవిడోవ్ దగ్గేడు. "నా స్నేహితులు పంపించేరు......గుర్రాలన్నీ సరి

యైన స్థితిలో ఉన్నాయికామా?"

"వందనాలు. నిష్కకూడా ఇయ్యండిమరి. గుర్రాలన్నీ బాగానే ఉన్నాయి. మనపార్టీగుఱ్ఱం-లాష్టినోవ్ దగ్గర తీసుకున్నది—అదిమాత్రం రాత్రిజబ్బుచేసి లేవలేకపోతే, వెంటనే మందులు పోసేరు. అదిమినహాగా మిగిలినవన్నీ సరియైన స్థితిలోనే ఉన్నాయి. ఒకగుఱ్ఱపుపిల్ల రాత్రులుకూడా పడుకోకుండా నిలబడే ఉంటూందిట. అసలు పడుకోవడమే లేదని చెప్పేరు. రేపు గుఱ్ఱాలకన్నిటికి ముందరకాళ్ళకీనాడాలు కొట్టించేద్దాం. బాగాఅరిగిపోయి కాళ్ళుజారిపోతూన్నాయి. సరే, వెళ్ళండి. అప్పుడే బాగా పొద్దుపోయింది. ఇంకా గుఱ్ఱాలదగ్గిర నాకు చాలా పనుంది."

రజ్మట్నోవ్, దేవిడోవ్‌తో కలిసి తనఇంటివైపు బయలుదేరేడు. కాని ఒకవీధి మలుపులో 'లూకా ఛిబాకోవ్' ఇంటి ఆవరణదగ్గిర రజ్మట్నోవ్ ఆగి, దేవిడోవ్‌ని స్పృశిస్తూ 'అక్కడ చూశావా!' అన్నాడు నెమ్మదిగా.

వారికిమూడుబారల దూరంలో దడిగుమ్మందగ్గిర ఒకమనిషి నీడకనిపిస్తూంది. రజ్మట్నోవ్ గభాలునఅతనివైపు దుముకెత్తేడు కుడిచేతరివాల్వరు పుచ్చుకొని, ఎడమచేతితో గుమ్మంపక్కని నిలబడియున్న ఆమనుష్యుని పట్టుకున్నాడు.

"లూకా, నువ్వేనా?"

"ఆంద్రీ రజ్మట్నోవ్! ఇల్లా వచ్చేరేమిటి?"

"ఆ కుడిచేతిలో ఏమిటి ఉంది? అది ఇల్లా ఇచ్చెయ్యి. త్వరగా!"

"కామ్రేడ్ రజ్మటోవ్! ఏమిటి ఇది అంతా?"

"ముందు అది ఇచ్చెయ్యి. లేకపోతే కాల్చేస్తా!"

ఈమాటలు విని డేవిడోవ్ కూడా వచ్చేడు. "ఏమిటి అతన్ని ఇమ్మని అడుగుతూన్నావ్?" అని అడిగేడు.

"లూకా! ఇచ్చెయ్యి. లేకపోతే కాల్చేస్తూన్నాను!" రజ్మటోవ్ తీవ్రంగా అన్నాడు.

"ఇదుగో, తీసుకో! అంతకోపంగా ఉన్నావెందుకు?"

"చూడండి, గుమ్మందగ్గిర చేత,ఏంపుచ్చుకొని నిలబడ్డాడో! ఇంతరాత్రివేళ కత్తిపుచ్చుకొని ఎందుకునిలబడ్డావు ఇక్కడ? ఎవరికోసం, కాచుకొని ఉన్నావు? డేవిడోవ్ కోసమా? ఏం, మాట్లాడవేం, కత్తిపుచ్చుకొని ఎందుకు నిలబడ్డావు? చంపడానికి చూస్తూన్నావా? ఏమిరా ద్రోహీ!"

దడివారి నిలబడ్డవాని చేతులో కత్తి ఉండడం రజ్మటోవ్ కాక, ఇంకొకడయినట్లయితే కనుక్కోలేకపోయి ఉండును. ఆకత్తి లాక్కొనడానికి రజ్మటోవ్, మీదికి ఉరికేడు. లూకా నిర్ఘాంతపోయి కొంతసేపటికి తెలివితెచ్చుకొని తలుపు తెరచి,

"మీరు, అఘోహ వసుతూంటే ఇంక నేను ఊరుకుంటే విషమిస్తుంది. అసలువిషయం ఏమిటో మీకే తెలుస్తుంది.

ఆండ్రీస్ట్రెప్కి, నోఒచ్! నా వెనకే రండి!"

"ఎక్కడికి?"

"గొర్రెల దొడ్లోకి."

"ఎందుకు?"

"రండి, కత్తి పుచ్చుకొని నేను గోడవార ఎందుకు నిలబడ్డానో మీకే తెలుస్తుంది"

"పదండి చూసిపద్దం" అంటూ డేవిడోవ్, లూకా దొడ్లోకి ముందుగా నడుస్తూ, రజ్మట్నోవ్ తో

"నా వెనక రండి" అన్నాడు.

గొర్రెల పాకలో ఒక బల్లమీద లాంతరు వెలుగుతూంది. పక్కనే పిడకలపోగు ఒకటి ఉంది. లూకా భార్య కూర్చుని పనిచేస్తూంది. గుండ్రటిముఖం, విశాలమైనకళ్ళు, తీర్చిదిద్దినట్లున్న కనుబొమ్మలు_మొత్తంమీద ఆమె అందమైనదే. కొత్త వాళ్ళని చూడగానే ఆమె గభాలునలేచి నిలబడింది. ఆమె ఎదట రెండుబిందెలనీళ్ళు పక్కన గోడవార నీళ్ళతోనున్న పళ్ళేము ఉన్నాయి. కుడిచేతివైపున మూలలో ఒకబలిసినపంది, గడ్డిమీద నిలబడి ఎదుటనున్న పెద్దతొట్టిలోని కుడితి తాగుతూంది.

"మూలకారణం ఏమిటో ఇప్పుడు చూడండి," లూకాఒక మాటకిఒకమాటకి సంబంధం లేకుండా అని పందికేసి చూపించేడు. "ఈపందిని రహస్యంగా చంపెయ్యడానికి నిశ్చయించేము నాభార్య దానికి కుడితి పోస్తూంది నేను దానిని

క్రింద పడతోసి చంపుదాం అను[illegible]ను. ఇంతలో [illegible] లో ఎవరివో నాటలయేలు వీధులో [illegible] చంపడం కనిపెడుతున్నారేమోనని అనుమానం కలిగింది. ఇప్పుడు నేనున్నట్టే చొక్కా చేతులు పైకితీసి, తుండుగుడ్డ ఒకటి కప్పుకొని, చేతిలో కత్తితో వద్దిదగ్గిరికి వెళ్ళేరు. మీరుకనిపించేరు. అక్కడ నేను ఎందుకు నిలబడ్డాననుకున్నారు అక్కడ? ఎవరినైనా చంపడానికి వెళ్లేవాడు చేతులు ఎగతీసి, బట్ట కప్పుకొని వెడతాడా?" అూకా పైమీది గుండుగుడ్డ తీసేసి వెకిలినవ్వు నవ్వి, భార్యవైపు తిరిగి "ఎందుకు ఇంకా అక్కడ నిలబడ్డావు? ఆపందిని బయటికి తోలెయ్యి." అన్నాడు.

"దీనిని చంపకు, ఇప్పుడే ఒక మీటింగు అయినన్నాము, జంతువుల్ని వేటినీకూడ చంపడానికి వీలులేదు." అన్నాడు రజ్మటోవ్.

"అల్లాగేలెండి, ఇంక చంపను. నామనస్సు తిప్పేసేరు..." అక్కడినుంచి ఇంటికి వచ్చేవరకూ దోవపొడుగునా డేవిడోవ్ ఆంద్రీతో వేళాకోళం అనుకూనే వచ్చేడు.

"సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఛైర్ మన్ ప్రాణాలు రక్షించేరు! ఒక విప్లవవ్యతిరేకిని నిరాయుధునిగా చేసేరు! దెబ్బకి రెండు పక్షులు! ఓహోహో!"

"పందిప్రాణాలు కాపాడేను!" రజ్మటోవ్ పరిహాసంగా జవాబు చెప్పేడు.